# విషయసూచిక.




| | మొదటిభాగము. | స్వప్నముల పుటసంఖ్య. | వివరణల పుటసంఖ్య. |
|---|---|---|---|
| | సర్వజీవ సహోదరత్వ ప్రార్థన ... | 1 | |
| | ఉపోద్ఘాతము ... ... | 1 | |
| | విజ్ఞాపన ... ... | 1 | |
| | పీఠిక ... ... | 1 | |
| | దివ్యస్వప్నముల సత్యత ... | 1 | |
| | **స్వప్నోపదేశములు.** | | |
| 1 | రామమంత్రోపదేశము ... | 1 | 39 |
| 2 | పాతనూతినీరుకంటె క్రొత్తనూతినీరు మంచిదని - పరిత్యాగోపదేశము | 3 | 45 |
| 3 | స్వస్వరూపదర్శన మగునని ... | 4 | 56 |
| 4 | భగవద్గీతలు చదువమని ... | 4 | |
| 5 | అధ్యాసను తెలుపు శ్లోకము ... | 5 | 58 |
| 6 | ద్వైతముద్దలు తినవద్దు అద్వైతామృతము త్రాగుమని - అనగా అద్వైతబోధ ప్రారంభము | 5 | 65 |
| 7 | ఎర్రటి అద్దములతో నమర్చబడిన తలుపులు కిటికీలుగల యేడంతస్థుల మేడకు నేను వెలుపలనుండుట - రజోగుణనివృత్తి. | 6 | 66 |

| | | స్వప్నములు పుటసంఖ్య. | వివరణల పుటసంఖ్య. |
|---|---|---|---|
| 8 | నా పాపములనుతీసి దూరముగా దండెముమీదవేసి చూపుట-శరీరశుద్ధి. | 6 | 67 |
| 9 | నాస్థూలదేహ దహనప్రదర్శనము-దేహాత్మబుద్ధి నివారణ. | 6 | 70 |
| 9-ఎ | కుక్కలను చంపించవద్దని జీవహింస కూడదని. | 8 | 71 |
| 10 | జీవుడు పరబ్రహ్మాంశయని ... | 9 | 71 |
| 11 | పరమేశ్వర మంత్రోపదేశము ... | 9 | 72 |
| 12 | నన్ను probationary 'chala' పరిక్షార్థంశిష్యునిగ నేర్పరచుట-సాదన చతుష్టయోపదేశము. | 11 | 76 |
| 13 | స్థిరశిష్యునిగ confirmed chala నేర్పరుచుట=పరివ్రాజకావస్థబోధ. | 11 | 79 |
| 14 | "సోహం ఈశః" యను మంత్రోపదేశము | 13 | 80 |
| 15 | జాగ్రదవస్థ యందుపదేశార్థతత్వ బ్రహ్మాద్వైతభావనకలగజేసుకొమ్మని | 13 | 85 |
| 16 | ధారణ ధ్యానసమాధిమార్గములజూపుట | 14 | 92 |
| 17 | ఇంద్రియనిగ్రహమునకు సదా బుద్ధి నాశ్రయించుమని. | 17 | 110 |
| 18 | శివమంత్రోపదేశము ... | 19 | 113 |
| 19 | స్వస్వరూపదర్శనము ... | 20 | 116 |
| 20 | ఉపదేశసహస్రి చదువుమని ... | 24 | 134 |

| | | స్వప్నములు పుటసంఖ్య. | వివరణల పుటసంఖ్య. |
|---|---|---|---|
| 21 | అహం బ్రహ్మాస్మి యను మహావాక్యోపదేశము. | 24 | 134 |
| 22 | సంవిత్కారణాయనమః యను మహావాక్యోపదేశము. | 25 | 145 |
| 23 | మహాత్మాహం మహాత్మ తత్వాహం యను మహావాక్యోపదేశము. | 25 | 152 |
| 24 | నసభవతిరోహితః యను వాక్యోపదేశము. | 25 | 162 |
| 25 | యత్రైశక్తి తథాతవచ యను వాక్యోపదేశము | 26 | |
| 26 | అద్వైతానుభవ విశేషబోధ ... | 26 | 163 |
| 27 | మంత్రాధికారి లక్షణముల యుపదేశము | 26 | 171 |
| | మనస్సునుగూర్చి ... ... | 28 | |
| | సత్సహవాసము సజ్జనసేవావిశేషములు. | 35 | 170 |
| | మూడు ముక్తిమార్గముల వివరణ ... | 35 | |
| | మూడు తరగతుల మనుజులవివరణ. | 37 | |
| | నారాయణాష్టాక్షరిమంత్రము ఓంకారము రామనామము యొకటే యని. | | 41 |
| | రామమంత్రాంగములు ... | | 43 |
| | విగ్రహారాధనము పునర్జన్మ కారణము. | | 44 |
| | విష్ణుయొక్క దశావతారాంతరార్థము. | | 47 |
| | స్వస్వరూప ధ్యానక్రమము ... | | 58 |

| | వివరణల పుటసంఖ్య. |
|---|---|
| జపశబ్ద నిర్వచనము - పరా - పశ్యంతి మధ్యమా వైఖరీవాక్కుల వివరణ | 73 |
| జపకాలమందు బూర్ణిమదృష్టి అమా దృష్టి పాడ్యమిదృష్టి వివరణ. | 75 |
| శబలజీవుడని-శుద్ధజీవుడని-జీవుడు రెండు విధములు. | 84 |
| జీవేశ్వరైక్యము-జీవబ్రహ్మైక్యము ? | |
| యోగాభ్యాస విఘ్నకారణములు. | 103 |
| బాహ్యవస్తు పరిత్యాగాది పూర్వక ప్రాణాయామము. | 109 |
| బ్రహ్మనుగూర్చి కుతర్కము కూడదని. | 113 |
| మనస్సు చిత్తముల లక్షణములు. | 121 |
| కామక్రోధముల కార్యములు ... | 124 |
| యోగి తన సామర్థ్యము వెల్లడిచేయ కూడదని. | 129 |
| ప్రాణవాయువులు ఇడాపింగళ నాడులలో నొకమారు సంచరించుకాలము యోగాభ్యాసకులకు నొకదినమని. | 130 |
| ధారణ-ధ్యాన-సమాధుల వివరణ. | 132 |
| ద్వైత-విశిష్టాద్వైత-అద్వైతముల ముక్తివివరణ. | 142 |
| సృష్టిక్రమము ... | 143 |
| బ్రహ్మయొక్క మూడు దేహములు. | 155 and 180 |

వివరణల
పుటసంఖ్య.


| | |
|---|---|
| దేశకాలములు మాయాకార్యములు-ప్రపంచము వ్యవహారసత్యముకాని- పరమార్థసత్యము కాదు. | 157 |
| అహంకారతత్త్వముయొక్క వ్యష్టి సమష్టి వివరణము. | 162 |
| ధ్యానములో విరాట్ మొదలగు వ్యక్తుల నేతి నేతివాక్యములచే లయముచేయు క్రమము. | 173 |
| పంచాకాశనామములు ... | 174 |
| జపధ్యాన సప్తమంత్రముల సాముదాయతాత్పర్యము. | 176 |
| మల-విక్షేత-ఆవరణలను శక్తులలక్షణములు. | 180 & 182 |
| సప్తభూమికలపేర్లు. ... ... | 182 |





ఓమ్

శ్రీ గురుభ్యోనమః.

శ్రీ గణేశాయనమః.

# సర్వజీవ సహోదరత్వ ప్రార్థన.



ప్రపంచములో మతములను శాఖలనేర్పఱచిన మతకర్తలకు గురువులకు నమస్కారములు.

సృష్టికి నాదికారణమగుఁ గారణ రహితకారణమా? నీవద్వితీయుండవు. సర్వత్ర నిండియున్నవాఁడవు. వాక్కు మనస్సులకుఁ గోచరము గానివాఁడవు, నామరూపములు లేనివాఁడవు. అయినను జనులు వేరు దేశముల వేరుభాషల నిన్ను పరమేశ్వర? అల్లా? గాడ్? మొదలగు ననంత నామములఁ బ్రార్థించెదరు. సర్వమతములు శాఖలు చక్రములో రేఖలు కేంద్రమందేక మగునటులఁ బారమార్థిక దృష్టిలో నీయందేకమగును. నీవు విశ్వమంతయు వ్యాపించి నీశక్తియగు నవిద్యలో నీయంశములుంచినందువలన, సకల భూతప్రపంచములు నుత్పత్తియగుచున్నవి. జడములగు నామరూపములు భేదముగాని, 'సత్' పదార్థమైన నీయందేవికారము భేదము లేదు. నీవన్నిటియందు లోపలను, వెలుపలను నిండియుందువు. నీయంశములే జీవులగుచేత పిపీలకాది సర్వజీవులకు సహోదరత్వము గలిగినది. వేదములు, కొరాను, బైబిలు, మొదలగు సర్వమతగ్రంథములు సోదరభావమును బోధించుచున్నయవి కాని అజ్ఞానులు, దురభిమానమతోద్రేకులు, నీయందనేకత్వము, జీవభేదములు కల్పనజేసి, వేదవ్యాసుఁడు, బుద్ధుఁడు, మహమ్మదు, క్రైస్టు, నానకు,

రాంమోహనరాయి మొదలగు మతకర్తలు, మహాపురుషులుబోధించు సర్వజీవ సమత్వము, సహోదరత్వము విడనాడి, వివిధ కలహములకు లోనై స్వర్గతుల్యమగు నీభూలోకమును నరకప్రాయముగను, జీవనము దుస్సహానముగను జేయుచున్నారు.

ఓ పరమేశ్వరా ? అల్లా ? గాడ్ ? మాదుర్బల మనస్సులను క్రౌర్యము, కలహములు, చెడుతలంపులు, చెడుకార్యములనుండి మరలించి, ప్రతిమనుజుండు, స్వమతమును, సిద్ధాంతములను, సత్యముగ నమ్మి « ఆత్మవత్సర్వభూతాని » అను వేద వాక్యానుసారమున, నిండు సర్వసమత్వబుద్ధితో నన్నిటియందుఁ దనను, తనయందన్నిటిని జూచుననఁగా, నొకరికష్టసుఖములు తనవిగాఁ దలఁచుచు దైవసంపద్గుణములతో మెలగుచుండునటులను గ్రహింపుము. మతమనఁగ స్వానుభవము. రిక్తమాటలు మతముగాదు. తాను సేవించు దేవుని తన హృదయమందు సదా జూచుచు నాదైవమె తాననెడు నిశ్చయబుద్ధి స్వానుభవము.

తన ఆత్మయందు నమ్మకములేని మనుజుఁడు, నాస్తికుఁడు గాని ఆస్తికుఁడుగాడు.

ఓ పరమేశ్వరా ? అలా ? గాడ్ ? వర్తమాన భావికాలము లయందు మనోదుర్బలత మొదలగు నాపదలనుండి మమ్మురక్షించి సదా మంచిపనులు చేయుట కవయవ పటుత్వము, మనోబలిమి నొసంగి దినదినము మాకన్నము, తృప్తి, జీవపారిశుధ్యము, సంపూర్ణ జ్ఞానము, సత్ప్రవర్తన, గలిగి నీయందు నిండుభక్తి, నీసృష్టియందుఁ బరమప్రేమ, సోదరభావములతో నిరంతరము నిర్మలమనస్సుతో నీ ధ్యానమొనర్చుచుండునటులనుగ్రహింపుము.

ఓం తత్సత్.



ఓం

# స్వప్నలబ్ధాద్వైతబోధ.



కాకినాడ వాస్తవ్యులు బ్రాహ్మణులు పరోపకారార్థము హోమోపతివైద్యశాస్త్రము స్వయముగఁ జదివి యం. బి. పరీక్షలో నుత్తీర్ణులై స్వంత ధర్మవైద్యశాల నేర్పరచి బీదజనుల కారోగ్యము గలుగఁ జేయుచున్న బ్రహ్మశ్రీ పెద్దిభొట్ల సుబ్బారాయుడుగారు, ప్లీడరు, F. T. S. యీ పుస్తకము చదివి యనుగ్రహించిన యుపోద్ఘాతము.

## FOREWORD.

"భూదేవి శిందూరతిలకమే కాశ్మీరమందురు. దానిని చూడనివాడు ఆదేశమునుగూర్చి తావిన్నది మరియొకనికి మిక్కిలి హృద్యముగ రసవంతముగ వర్ణించి చెప్పుచున్నాడు. అద్దాని చూచివచ్చినవాడు తా జూచినది జూచినటుల మరియొకనికి తెలుపుచున్నాడు. వినివచ్చి చెప్పు వర్ణనమెంతయు సంపూర్ణము మనోహరము కావచ్చును, కాని చూచివచ్చినవాని వాక్యమునందే, సత్యప్రామాణ్యము సిద్ధించును.

ఈ "స్వప్నలబ్ధాద్వైతబోధ" యను గ్రంథమున పూర్వపక్షసిద్ధాంత ఖండన మండన సమన్వయధీవిశేషము తార్కిక ప్రజ్ఞాప్రదర్శనము లేదు. ఈ గ్రంథమాలోచనచే కూర్చబడినది కాదు. జ్ఞాపకము తెచ్చుకొని వ్రాసినది. స్వప్నమందు దృష్టమై

శృతమైనది. జాగ్రత్తునందు స్మృతియై యీగ్రంథరూపము దాల్చి నది. స్వామి నిమిషకవి వెంకయ్యగారు సుమారు 82 సంవత్సరముల వయోవృద్ధు. 23 సంవత్సరములు మాజస్ట్రేటు హోదాయందుండి చక్కగ న్యాయపరిపాలనము గావించి, వార్ధక్యమున యోగసాధన చేయుచుండిరి. వారికి నేడెట్టి బూటకములతోగాని డంబములతో గాని పనిలేదు. అట్టివారు తమ స్వానుభవములని, తేదీవారిగ తెలి యపరచుచున్న అంశముల నంత చులకనగ, కాదని, త్రోసివేయుటకు వీలులేదు. నేడు లౌకిక దృష్టికి ఎంతవిపరీత విడ్డూర్యములై అవిశ్వా సనీయములవలె కానవచ్చినను మహాత్ములు—దివ్యప్రబోధకులు జగత్కల్యాణముకొరకు ఆయాయవసరంబుల యోగ్యంబగు సత్పా త్రుల చిక్కబట్టి తన్మూలమున కర్తవ్యాకర్తవ్యముల—ధర్మాధర్మ ముల నిరూపించి తత్వసారమును లోకమున కందిచ్చుచుందురను సంగతి ప్రపంచచారిత్రమున నూతనముకాదు. మరియు శాస్త్రదృ ష్టికిని విరుద్ధముకాదు. లంకయందు యుద్ధమధ్యమున అగస్త్యభగ వానుడు శ్రీరామచంద్రునకు ఆదిత్యహృదయము నుపదేశించెను. కురుక్షేత్రమున రణరంగమందె శ్రీకృష్ణపరమాత్మభారతవీరునకు యోగశాస్త్రముపదేశించి విశ్వరూపదర్శనము గావించెను. అప్పుడు వారు చేసినదేమి. తమ మహత్వాతిశయముచే గురువుల నిజోప దేశంబుల బింబ ప్రతిబింబ న్యాయమున శిష్యుల మనోదర్పణము లందు ప్రతిఫలింప జేసిరి. శిష్యుల మనోహృదయముల పాదలిపట్టు గాని పదునై యున్నతరి, కరిగిన లక్కపైపలెను జ్ఞానబీజముల ముద్రించి వైచిరి. మరియొకలాగు జరిగెననుకొనుటకు ఆయా దేశ కాలము పరికించినచో నెన్నెన్నియో అభ్యంతరములు కనబడుచు న్నవి. మహాత్ములు అదృశ్యులైయుండి అప్పుడప్పుడు లోకసంగ్ర.

హేతుభూతమై కొందరు వ్యక్తులకు జ్ఞానోదయమును గావించి వారి మూలమున జ్ఞానతేజమును లోకమున వ్యాపింపజేయు కోరుచుండుట అనుభవసిద్ధము, శాస్త్రసమ్మతము అని దివ్యజ్ఞాన సమాజము వారు చర్చించి దృష్టాంత పూర్వకముగ నిరూపించుచున్నారు. సూర్యభగవానుడు నిజకరముల చంద్రమండలమును స్పృశించి, తేజోవంతముగావించి తపించుచున్న లోకమునకు చంద్రికామృతము వర్షించుచుండుట లేదా- మరియు లోకము సూర్యునుండి సరాసరిగ వచ్చు ఎండను కన్నెత్తి చూడజాలక యున్నది. చంద్రునిపైనుండి జాలువారు చున్న వెన్నెలలో నోలలాడి యానందించుచున్నదను విషయముకూడా ఈ సందర్భమున గమనింపదగినదై యున్నది.

లౌకిక విద్యోపదేశమునకు బాల్య కౌమారములే యెట్లు మిక్కిలి యుచితములై యొప్పునో అటులనే ఆధ్యాత్మిక తత్త్వోపదేశమునకు సత్యప్రదర్శనమునకు జాగ్రత్తుకంటె స్వప్నావస్థయె మిక్కిలి అమరియున్నది. బాల్యకౌమార యవ్వనవార్ధక్యంబులకువలెను, జాగ్రస్వప్నసుషుప్త్యావస్థలకు కూడ సాక్షియు భోక్తయుకూడ నగు వ్యక్తి యొక్కటియే యగుచు హారమందలి వివిధ మణులలోని సూత్రమువలె నున్నందున, ఆయా యవస్థాభేదముల నైక్యతయు ఏతదనుభవములకు కేంద్రీకరణము నమరుచున్నది. మానవుడు వీణ, వివిధావస్థలు తంతువులు, గురువుగా యక్షుడు, ఉపదేశము రాగము. ఏరాగమునే తంతువు పలుకునో ఆ తీగపై ఆ రాగ మాలాపన చేయబడును. జాగ్రదవస్థయందు మనోఫలకముపై సదా దేశకాల నామరూపభేదము లల్లిబిల్లిగ నలముకొనియే యుండును. సాగరోపరిభాగమువలె సదా వివిధ రసభావతరంగ కల్లోలితమయే యుండును.

జాగ్రదవస్థ యుడిగిన నంతనే మనసుయొక్క వ్యాకులత సంక్షోభము మందగించును. నిశ్చలత్వము నిర్మలత్వము కలుగును. బాహ్యలోకముయొక్క దేశకాల నామరూపాదిచ్ఛిన్న భిన్నత్వ దృష్టి మరుగు పడిపోవును. అట్టితరి మనస్సు కలుపుతీసి శుభ్రపరచిన క్షేత్రమువలె మేఘశకలమాలిన్య రహితమగు నీలగగనమువలెను, క్షాళితస్ఫటికమువలె యొప్పియుండును.

యోగిపుంగవులు తమ మనములనిట్టి నిర్వికల్ప సమాధియందుంచుకొనుటకు బుద్ధిపూర్వకముగా ప్రయత్నించి చిరకాల పరిశ్రమగావించి కృతార్థులగుచుందురు. అట్టి సమాధియందు వారు అభ్యాసబలముచే చిరకాలముండగలరు. కాని అట్టి స్థితియే ప్రతిమానవునకు ప్రతిదినమును సాధారణముగ జాగ్రత్స్వప్నసుషుప్తుల సంధికాలములనెప్పుడోయొకప్పుడు ఒకరెప్పపాటుకాలమైనను కలుగుచునే యుండును. కాని ఆ సుముహూర్తము నెరిగి కనిపెట్టి జీవిత ప్రవాహము నాక్షణముదాటి ముందునకు జరిగిపోకుండ నరికట్టుట మిక్కిలి కష్టసాధ్యము, గాని ఆక్షణము ఆ సుముహూర్తము మిక్కిలి మహత్తరమైనది. విశేషమేమన దివ్యమగు రేడియోగానము వినుటకు నీ మానవయంత్ర మాక్షణమునందె సుఖమై అమరియున్నది. అట్టి సుముహూర్తములె మహాత్ములు తమ వుపదేశముల శిష్యుల కందిచ్చుటకు మిక్కిలి అనువైయుండును. అట్టితరి ఉపదేశములు స్వప్నములై అనుభవింపబడుచుండును. ఈస్వప్నములు దివ్యస్వప్నములు. పైత్య అజీర్ణ రోగాది జనిత స్వప్నములుకావు.

అట్టి ఉపదేశ గర్భితములగు దివ్యస్వప్నములనే, గ్రంథకర్త ఈపుస్తకమున వినిపించుచుండెను. ఆ స్వప్నముల యంతరార్థమునే శ్రుతి స్మృతి వాక్యసారానుగుణ్యముగ వ్యాఖ్యాన మొనర్చియుండెను.

కవులకు సూర్యచంద్రోదయాదులవలెనే వేదాంతవిధులకు చిరకాల పరిచయములే యగుగాక, యిందలి కొన్ని యుపదేశ సత్యములు—కాని అవియింద నూతన దృక్పథమునుండి గుర్తింపబడుచున్నవి. కావున వారలుకూడ ఈగ్రంథము చూడదగినదియే యైయున్నది. మరియు గ్రంథకర్త అద్వైతసిద్ధాంతమును స్థిరపరచుటకొరకు యిందు వాదించుటలేదు. ఈనిర్మలజీవి, యోగాభ్యాసి, భక్తుడు, సత్యపరిమాణబుద్ధితో తావిన్నది కన్నది మర్మములేక మనసువిప్పి చెప్పుచుండెను. కావున ఈగ్రంథము వేదాంతశాస్త్రములందేకాక కావ్యసారస్వత సమాజమునందుకూడ స్థానము బడసి ఎల్లరచే పఠింపబడదగి యున్నది.

ఆస్తిక నాస్తిక సంశయ పరివృతమైన నేటి ప్రపంచములోనికీగ్రంథము వెలువడుట శుభావహము.







# విజ్ఞప్తి.

ఓం తత్సత్.

## మహనీయుల అభిప్రాయములు.



ప్రతియభిప్రాయములోను నొక విశేషాంశము వ్రాయబడి నది గాన ముందుగాఁ జదువతగియున్నవి.

ఓం

అంకరాజు సుబ్బరాయశర్మగారు వ్రాసినది.

బ్రహ్మశ్రీ నిమిషకవి వెంకయ్యపంతులుగారి దివ్యసన్నిధికి—

మహాశయా! నమస్తే.

తమరు ప్రీతితో నాకొసఁగిన రెండు గ్రంథములను వందనములతోఁ గైకొంటిని.

ఆధ్యాత్మిక చింతఁగలిగి, భగవద్గీతోప నిషత్పురాణ సముచ్చయసారమును గ్రహించి ఆచరణపారీణులై, తొంబదియేండ్ల వయోజ్ఞాన వృద్ధదశలో,తమరు భగవానునిచేత, నవస్థాత్రయములో నొకటియగు స్వప్నావస్థయందు నుపదేశింపబడిన మహావాక్యములను పొందినబ్రహ్మానందమును లోకోపకారార్థము గ్రంథరూపముగ విశదపర్చినందులకు శాశ్వతకృతజ్ఞుఁడను. ఇది సాధారణజనుల కందరకు గ్రాహ్యముకాదు. ప్రస్తుత విద్యాపాండితీమనీషులకు గో

చరము కాదు. ప్రాచీనమహర్షి ప్రోక్త మహద్గ్రంథరాజములను ఆస్తి క బుద్ధితో జ్ఞానదేత్రములతో గమనించి సందేహాస్పదులైనవారలను దరిఁజేర్ప నావయెకాని వేఱుకాదు. తమరిందుదహరించిన మహా విషయములు కొన్ని ఆస్మద్గురువరేణ్యులగు శ్రీశృంగేరిమఠస్థ శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర భారతీస్వాములవారివలన నుపదేశింపఁబడి సంస్కారములనొంది పునర్జన్మనొందితి.

తమగ్రంథముల శైలిసులభము- భావమతిగంభీరము-తురీ యావస్థయందుండు మహాజ్ఞానుల మహావాక్యము లిప్పటి హెచ్చు మందికి పిచ్చిమాటలవలె నుండును. "బాలోన్మత్త పిశాచవజ్జడవృ త్త్యా లోకమాచరేత్" యని మహాజ్ఞానులను వర్ణించిరి. అట్టిమ హాజ్ఞానుల మహోపదేశముల నున్నదున్నట్లుగ, నపార్థములచేయక, విశదపర్చినందులకు శతసహస్రవందనములర్పించుచున్నాను.

చిత్తగించఁగోరెదను.

విధేయుఁడు

అంకరాజు సుబ్బరాయశర్మ,

శ్రీ శృంగేరిమఠస్థశ్రీశంకరాచార్య

శిష్యప్రశిష్య

ఆరువేలనియోగి చరిత్రకర్త.

——— ———

*Madras,*
*19-9-29.*

## SIVOHAM.

The book "*Svapnalabdha Advaitabotha*" or "Sanatana Geetas" which you kindly handed over to me was carefully gone through and in my opinion it is got up well to suit the present situation.

The Philosophical thoughts expressed therein are all based on ancient Sastras and it is a very good exposition of the personal experience of a devotee.

I bestow my hearty blessings on the Bhakta that exposed so many sacred philosophical ideas to save people who are ignorant of truth.

(Sd.) VAMADEVASVAMY.

---

**Opinion favoured by Brahmasri M. R. Ry. K. S. Ramaswami Sastri Garu, Professor in Advaita Vedanta, and District Sessions Judge.**

*Camp* :—NANDALUR.
8—9—29.

" I have perused with great pleasure our revered Nimishakavi Venkayya gar's " *Svapnalabdha Advaita-bodha.* " I am glad to see that the earlier tiny brochure has now become a big book. Such a breaking of the bud into blossom is a desirable event. It adds to the world's store of beauty and charm and fragrance.

Mr. Venkayya is one of those happy and privileged souls, who are fortunate enough to realise the eternal in the present (అత్రబ్రహ్మసమశ్నుతే). He wears his weight of years lightly and knows the precious truth of Sita

Devi's message of experience (ప్రతేజీవన్త్ర మూకస్థ్యోనరం వర్ష శతాదపి)

It is well known that every day we dwell in three universes, viz. the waking state and the dream state, and the state of deep sleep. Further and acuter analysis, reduces each of these into three subdivided states. Each of these nine states has its speciality of "*Anubhava*" or experience. The soul is the witness of them all, and is separate from them all, and its glory knows no obscuration whatever (నోదేతినాస్త్రమేత్యేకాసంవిదేకాస్వయంప్రభా).

In these states there are gradations of bliss, the men of virtue and devotion are privileged to see the wonders of the creation and to have revelations in dreams and to touch and kiss and enjoy the lotus feet of God in dream and sleep. He is the lucky and privileged man who carries out God's commandments in his waking state and establishes the kingdom of God upon the earth and increases the fund of altruism and love in this pain-shadowed and hate-shattered world who has visions of God in dreams and enjoys the kiss of God's feet in sleep But the rarest and most fortunate of all is he who, by the aid of Yoga on his part, and of grace (అనుగ్రహా) on the part of Iswara, rises into the Turia (fourth) state and has the bliss of God,—Consciousness *(Kaivalya)* as described by Sri Rama in the Muktikopanishad.

(Sd.) K. S. RAMASWAMI SASTRI,
*District and Sessions Judge,*
CUDDAPAH.

కాకినాడ,

ఓం 28.8_1929.

పరమాత్మనేనమః

కాకినాడ వాస్తవ్యులు మహారాజశ్రీ

శ్రీపాద్మ వెంకట సుబ్బయ్యగారు, పెంషనరు వ్రాసినది.

"మానవులు పూర్వజన్మవాసనానుసారముగ దేవమనుష్య పిశాచరాక్షసగణముల జన్మింతురనియు, ఆయాగణములకుఁ దగిన సత్వరజస్తమోగుణములు కలిగియుందురనియు, అందు దేవగణజన్ములు సత్వగుణప్రధానులై ఆస్తిక్యము, దైవభక్తి, దేవతాప్రసన్నతి మొదలగు సద్గుణశోభితు లగుదురనియు లోకప్రసిద్ధి. అట్టిమహనీయులలో పూర్వజన్మమున జ్ఞానవిషయమైన సాధనఁ జేసి యంద సంపూర్ణులగు వారలు శ్రీగీత అ 6 శ్లో 40.41_42 లందు శ్రీకృష్ణభగవానులు శలవిచ్చినరీతి పరిశుద్ధులును, జ్ఞానసంపన్నులునగు శ్రీమంతులవంశమునగాని, అట్టియోగులయింద్లగాని జన్మించి, ఆత్మజ్ఞాన పరాయణులై మోక్షసామ్రాజ్యమును బడయుదురనుటనిశ్చయము.

మహారాజశ్రీ నిమిషకవి వెంకయ్యపంతులుగారు అట్టిపూర్వజన్మవాసనాప్రభావమునకదా, ప్రపంచమందు, ముఖ్యముగ సకల కలుషదూషితమగు నిక్కలికాలమున, నిటుల స్వప్నములమూలమున శ్రీకృష్ణపరమాత్మగురునివలన జ్ఞానవిజ్ఞానసంపన్నులయిరి. సుషుప్తినుండి జాగ్రదవస్థకు వచ్చు మధ్యకాలమున, కనుచీకటివేళదోఁచు కుడ్యాదికాభాసరూపములవలె, కనురెప్పల యందలి రక్తప్రసారమువలన నానావిధకల్పనలతో దోఁచు చిత్రభ్రమలు స్వప్నములని యింతదనుకఁ దలచుచుంటిని గాని, యిప్పుడాసందియము వీడెను. వర్తమానకాలమున శుకవాక్యముల వేదాంతోపన్యాసము

లనిచ్చు విద్యాగురువులేకాని, శుకవాక్కుల నిజతత్త్వమెఱింగి బోధించు సద్గురువులరుదు. కనుక, పూర్వజన్మోపలబ్ధవిజ్ఞానముతో జన్మించినవారలకు, "ధరణిలోపలనారారు తత్త్వములకు, నవ్వలైయున్న తత్త్వంబునెవ్వఁడెరుగు। శివుఁడు గురురూపమున వచ్చి చెప్పకున్న," అని శ్రీసదానందయోగిగారు చెప్పినటుల నీస్వామి వెంకయ్యగారికి పరమాత్మయగు శ్రీకృష్ణభగవానుఁడే గురువై, నానావిధ రూపముల స్వప్నములయందు తత్త్వబోధ నొనరించెననుట నిర్వివాదము. ఆరంభమున రామతారకము, తరువాత హంసగాయత్రి, శివతారకము మున్నగు నుపదేశములతో శివకేశవాద్యభేదముందెలిపి, శరీరత్రయపరిశుద్ధమొనరించి, మహావాక్యోపదేశముంజేసి కేవల పరమవిజ్ఞానసంపన్నుఁజేసి తరింపజేసెనని విస్పష్టమగుచున్నది. మానవులలో నిట్టి చరితార్థు లెందును లేరు. అట్టి స్వానుభవమున నిజాత్మయే శ్రీకృష్ణపరమాత్మగా నీస్వామి రచించిన "స్వప్నలబ్ధాద్వైతబోధ" యను గ్రంథరాజము ఆస్తికులకు కల్పలతిక, నాస్తిక బ్రాహ్మ ఆర్యాది నూతనమతావలంబులకు నేత్రాంజనమునై విరాజిల్లుననుట అతిశయోక్తి కాఁజాలదు.

అంధుఁడు రత్నపరీక్షజేయ నుంకించినటుల శ్రీ పంతులుగారు దయతోఁ బంపిన యీపత్రమునందలి విశేషాంశములఁగూర్చి వ్రాయుటకేనసమర్థుఁడనయ్యును, దీనిం జదువజదువ నది గురురూపముం దాల్చి నాసందియములఁ దొలఁగించి నాహృదయసీమను జ్ఞానాంకురములనాటినందున, కృతజ్ఞతాభివందనముగా నింతమాత్రము వ్రాయఁగల్గితిని.

ఇట్లు,

కామర్షి వెంకటసుబ్బయ్య.

ప॥ వ॥ డి॥ పెన్షనరు.

**Review of Sriman Vidyabhushana Vedantaratna,**
**A. Govindacharya Swamin. M. R. A. S. Etc.**
**Mysore City, 2-9-1929.**

*Veda Griham, Mysore.*

To

SRIMAN NIMISHAKAVI VENKAYYA GARU, ETC,

Dear Sir and Brother in God,

Three days back I became wifeless and so have entered on Sanyasasrama *de-facto* but not *de-jure* yet. While in this condition, I had an extraordinary dream last night. I went to a certain locality where a tank appears above, and a stream flows from it. But this stream is dry. Here I resolve to collect all Sankaracharya's works on Advaita Philosophy, and Ramanujacharya's works on Visista-advaita Philosophy, incorporate and amalgamate them into a consistant whole (a fusion) and leave a consolidated philosophy useful for all posterity and generations to come, and as a universal system of thought, which shall include both East and West also into a whole. I rose in the morning and strange to say your book on "Swapnalabdha-Adwaita bodha" was put into my hands by the post man (morning 2-9-1929, dream night 1-9-1929)—a realization of the dream, justifying your experiences !!!. The dry stream again below the tank becomes wet flowing again, meaning that the way to 'Moksha' is Bhakti-rup-apanna-jnana or blending of Sankara and Ramanuja, which is what your book now stands for.

I am busy writing a series of articles on Vedanta and Christian Parallels, for which purpose I was extracting from Prof. J. S. Mackenzie's latest book *Fundamental Problems of Life*, where you will find to your surprise another illustration of my dream (of last night) realized. I send you the copy of it, to be embodied in your book, as having a most forceful bearing upon the theme, and as my opinion; and in illustration too of what I had said to you already, viz; "not to commit the fatal mistake that the world is non-existant." How ? Your dreams and my dream show. If then there are indications of Reality in the Dream world itself, then apply the same logic to the working Universe, and the Sleeping Universe, and then find the whole reality in the Turiya or Samadhi or mystic Universe; all the other states than the Turiya giving us Parts (or partial) of Reality.

Sri Sankaracharya's famous verse quoted below also comes to our help as elucidatory of the topic under review :—

"*Satyapi bhed-apagame, Nadha Tav-aham na mamakinas Tvam*
*Samudro-hi tarangah Kvacha na samudro na tarangah*"

Here is Mackenzie-

"Even Parmenides can hardly be taken as an exception. In Indian philosophy, on the other hand, what is ultimately real has usually been thought of rather as a bourdless whole, and particular things that have name and form have been thought of as relatively

illusory. It is, however, easy to exaggerate this antithesis. It is true that Atomism and Monadism and other types of Pluralism have played a large part in the development of European science and philosophy, but they have seldom been allowed to flourish, without some degree of criticism and opposition; and though a good deal of this opposition is traceable to Oriental influences, no one can deny that our Europeon ways of thinking have been profoundly modified by it. On the other hand it is probable that we are apt to be unduly impressed by those aspects of Eastern speculation that are most remote from our own tendencies, and to forget that they also have had their critics and opponents. The conception of Reality as the Absolute or Brahmam and of the finite world as " Maya " or " illusion, due simply to ignorance, " is apt to strike the Western mind as incredible or even absurd. † We can only understand it in the modified form presented by F. H. Bradley, according to which appearance has at least a certain degree of Reality and the ultimate Reality lives in its appearances, and we may be prone to ignore the fact that in India also there is a modified form of Monism, which can be much more easily understood by us. It has recently been maintained by a scholar of considerable repute ‡ that Maya does not properly mean illusion, but only a finitizing process.

† This has been well brought out by Lord Ronaldshay in his very interestig book 'The Heart of Aryavarta'.

‡ Sir John Woodroff. See his book '*The world as power, power of Mind.*' There is ground for doubting however whether his view about this is quite correct.

This view may be erroneous though it has received a certain amount of support, but at least it is undeniable that in India itself a modified form of Monism has found wide acceptance. The commentaries of Sankara in which the more extreme form of Monism is defended, have undoubtedly had a deep influence—perhaps a more extensive influence than any other philosophical system, but the modified Monism set forth by Ramanuja, and ably supported at the present time by the saintly scholar A. Govindacharya* of Mysore, according to which the conception of Maya is rejected altogether, appears to have affected recent Eastern thought–at least among trained dialecticians—in a degree hardly less potent than the extreme doctrine of Sankara himself. The essential difference is that Sankara thought of absolute reality as without qualities, and consequantly regarded all qualities as illusory, whereas Ramanuja considered, that absolute reality must include all qualities in a perfect unity and that the finite world must be thought of as a process towards perfection. It is easy to bring this into relation to modern interpretations of Christianity, in which God the Father and God the Son appear to fall into the back ground, and the emphasis is laid rather on God the Holy Ghost, (*i.e*) on the nisus towards the Supreme value. The best representatives of

---

* Reference may be made more particularly to his "*Life of Ramanuja*" and to his latest work "*A Metaphysique of Mysticism*." He is however a mystic rather than a philosophical thinker. The influence of Ramanuja is seen in the teaching of Ramakrishna Paramahamsa and his disciple Vivekananda and probably also to some extent in the writings of Rama Tirtha, Rabindranath Tagore and Professor Radhakrishanan.

Modern Christianity appear to be those who think of themselves in the well known phrase of Heim as the Knights of the Holy Ghost. In this way an appreciation has become possible, and easy, between Hinduism and Christianity, and there is nothing that could contribute more to the spiritual unity of the world than such an approximation. Thus there is a bridge between the more uncompromising tendencies of Eastern & Western speculation, which at least enables us to see the most hopeful opening for mutual understanding, and perhaps eventually for complete agreement in philosophical thought. (p.p 236—237)

In these you will see a justification of your Bhakti blended with Jnana.

A. GOVINDACHARYA,
*Svamin.*

*N. B*:—The difference between the Visistadvaita and Advaita is very subtle as our revered and learned brother explains in the above review. We see rivers and streams, which enter into the Sea, at first in distinct channels formed by the current (in the Sea water even) retaining the color and sweetness as well to some extent, but in passing onwards they gradually lose the channels as also the color and taste and become entirely absorbed or united in Sea water. This natural fusion or final blending of waters (of streams into sea), I believe, accounts for the subtle differences drawn in the two great philosophies of Sri Sankara and Ramanuja.

The amalgamating of these two philosophies and of Christianity into one consolidated fusion, which our learned brother is now doing is certainly very praiseworthy and desirable as it brings both the East and West into one Universal system of thought.

May God the Omnicient bless the author to complete the work soon.

N. VENKAYYA.

—..—

చిత్తూరు జిల్లాలో కాశీబుగ్గతీరమున శ్రీవ్యాసాశ్రమాధిపతులును యదార్థభారతీ పత్రికాధిపతులును ఐన శ్రీ శ్రీ శ్రీ మళయాళ స్వాములవారు పూర్ణదయతో ననుగ్రహించిన శ్రీముఖము.

ఓమ్ తత్ సత్.

అహింసా పరమోధర్మః.

ఓ పరిశుద్ధమైన జ్ఞానమున్ను కరుణయు, శాంతియు గలిగి ఋషిసంతానములై దైవాత్మస్వరూపులైన ప్రియమైన సోదరీ సోదరులారా—

నిమిషకవి శ్రీవెంకయ్యగారికి గలిగిన ఆత్మోపదేశమును గురించిన అనుభవములను భక్తులకు తెలుపుటకొఱకై స్వయముగా వ్రాయబడిన మొదటిగ్రంథమైన "ఆత్మానుభవమున్ను" రెండవదైన "స్వప్నలబ్ధా ద్వైతబోధ" అను గ్రంథద్వయమును నాపై విశ్వాసపూర్వకముగా అంపినందునను అభిప్రాయము తెలుపుటకు వ్రాసినందునను, అంతరంగవిశ్వాసమును క్రింద వ్రాయడమైనది.

శ్లో॥ తేషా మేవానుకం పార్థ మహమజ్ఞానజంతమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

అని శ్రీకృష్ణపరమాత్ముండు గీత దశమాధ్యాయమున బోధించిన విషయములో సంపూర్ణనమ్మకము నాకుగలదు. ఈవిషయమై శ్రీశుష్కవేదాంత తమోభాస్కరమున నిజమగు కారణగురువుగాని, విహితగురువుగాని దొరకనిపక్షమున, నిర్మలభక్తితో దైవధ్యానము చేయువారికిస్వప్నరూపేణ ఐనను ఉపదేశములభించునని వ్రాయబడియున్నది. చిత్తనైర్మల్యమునొంది ఆత్మధ్యానరతులై ఉపరతిస్థితి నొందిన వారికి గలిగెడు స్వప్నములు పైత్యాధిక్యముచే విషయుల

గు జనులకు గలిగెడి వికారస్వప్నమువంటిదికాదు. భక్తులను సంశయము నివర్తిచేసి కాలానుసారముగ, ఆత్మాభివృద్ధిచేసుకొనుటకై ఋషులసంఘమొకటి గలదని బ్రహ్మనిష్ఠులందఱున్ను అంగీకరించి యుండువిషయమే. ఇది దివ్యజ్ఞానసంఘములలోగల ఆనిబిసెంటు అమ్మగారు మొదలైన పావనాత్ములు ప్రస్తుతముగా స్పష్టపఱచి చెప్పుచున్నారు. ఈవిషయమై శాస్త్రములను పెక్కండ్రు ప్రబోధ జ్ఞానముగలవారు యీగ్రంథములో తెలుపుటచే మరల ఆవిషమై తెలుపంబనిలేదని తలంచెద. పైనుదహరించిన ఋషిసంఘము ప్రపంచములోగల అన్నిరాష్ట్రములలోను అన్నిమతములలోను గలదు. శ్రీయేసుక్రీస్తు భూమియందు అవతరించువిషయమై తనతల్లియగు మరియాదేవిగారికి స్వప్నములో దైవదూతలు మీగర్భములో ఈశ పుత్రుడగు యేసుపుట్టబోవుచున్నాడు. భయపడనక్కరలేదు. మీ జన్మము ధన్యము అనిబోధించినట్లు బైబిలులో కనుపడుచున్నది. అదేప్రకారము శ్రీమహమ్మదు నబీగారు ప్రాతఃకాలమున ప్రార్థనకొఱకు జనులను ఆహ్వానించే విషయమై అగాధచింతనలోనుండగా తమశిష్యులలో ముఖ్యులగువారి నొకరికి దైవదూతలు స్వప్నములో తెలిపిన వచనములనే మహమ్మదులందరును వాడుచున్నారు. అదేప్రకారము శ్రీబుద్ధదేవుండు యౌవనారంభకాలమున మాయామోహముచే స్వబోధమావరణపడి దాంపత్యమోహములో చిక్కియుండుకాలమున స్వప్నములో దివ్యపురుషులు వచ్చి "జనుల ఉద్ధరింపుడు బయిటరండు. లోకము మీఅమృతబోధకొఱకు నిరీక్షించుచున్నదని స్వప్నములోచెప్పినట్లు బుద్ధపురాణమునగలదు. శ్రీమహమ్మదునబినిగురుంచినది" కురానుషరీఫులోను, మహమ్మదునబిజీవితములోను చూడఁదగును. ఇట్లనే శ్రీజగద్గురు శంకరపాదాచార్యులు

భూలోకమున అవతరించుటకు కాలమాసన్నమైనపుడు తనతల్లియగు ఆర్య 'అంబాళుకు' స్వప్నములో మీగర్భమున పరమశివాంశమై శ్రీశంకరుండు పుట్టబోవుచున్నారని స్వప్నములో తెలిపినట్లు శ్రీ శంకరవిజయముచే తెలియవచ్చుచున్నది. ఇకను, ఈవిషయమై పెక్కుచరిత్రములుగలవు. ముముక్షువులకు ఇంతియేచాలునని తలంచెద. నాకు ఈవిషయములలో చాలనమ్మకముగలదు. నిమిషకవి శ్రీ వెంకయ్యగారిని నేరుగా చూడకపోయినను యుత్తరములచే తను పుస్తకములచేతను చూచేలాగున నమ్ముచున్నాను. శుష్కవేదాంతములు ప్రబలి జిహ్వోపస్థలను నిగ్రహింపశక్తిలేనివారలై స్వేచ్ఛాప్రవర్తనము ప్రబలమైన ఇట్టికాలములో ఈగ్రంథము జనులకు చాలాఉపయోగకరము. ఈగ్రంథము అనుబంధ చతుష్టయము తోకూడి ముముక్షువులకు మననము చేయందగిన ఉపనిషద్దివ్యవచనములు పెక్కులుగలవు. శ్రీ వెంకయ్యగారి నిరభిమానత్వము ప్రేమ, సమదృష్టి స్వప్నములో వుపదేశించిన దివ్యపురుషలలోగల భక్తి దయార్ద్రహృదయము నిండుదైవభక్తి మొదలైన దివ్యగుణములు గ్రంథము చదువువారికందరికి గోచరించును. గ్రంథముచివరభాగమున చేర్చియుండుపద్యములే తార్కాణము. దయామయుడగు సర్వేశ్వరుడున్ను లోకోద్ధారతత్పరులగు మహర్షులున్ను కరుణతో మనల ననుగ్రహింతురుగాత. "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు."

"ఓం శివం శాంతమమృతమద్వైతం"

ఓంశాంతిః శాంతిః శాంతిః.

ఇట్లు తమచరాచర సుఖాభిలాషియగు మలయాళస్వామి.

శ్రీ వ్యాసాశ్రమః.

విశాఖపట్టణము,
9-9-29.

మహారాజశ్రీ శ్రీరాజా శ్రీవిక్రమదేవవర్మగారు వ్రాసినది.

"శ్రీయుత నిమిషకవి వెంకయ్యపంతులుగారు సాదరముగాఁ బంపించిన "స్వప్నలబ్ధాద్వైతబోధ" మను పుస్తకమును వందనపూర్వకముగా నందుకొని చదివి ముదమొందితిని.

పంతులుగారికి స్వప్నలబ్ధజ్ఞానమేకాక, శాస్త్రపరిచయము సైతమున్నట్లు పొత్తమును జదువువారికిఁ దెలియగలదు. అద్వైతజ్ఞానాభిలాషులకది మిగుల నుపాదేయమగు గ్రంథము.

విషయగౌరవమునుబట్టి యందలి పదముల యసాధుత్వము మన్నింపఁదగును.

ఇట్లు,
శ్రీ విక్రమదేవవర్మ.

మంగళగిరి.
4-9-29.

ఓం

తత్సత్

శ్రీలక్ష్మీనరసింహస్వామినేనమః

శ్రీమన్మంగళగిరి కోయిల్ కందాడై వాధూల విద్వాన్ మహామహోపధ్యాయ శఠగోపాచార్యులయ్యవార్లంగారు వ్రాసినది.

అయ్యా, తాము నాయందు నిండుదయతో జ్ఞాపకముతో పంపిన „ స్వప్నలబ్ధాద్వైతబోధ యను పొత్తముచేరినది. అద్దానిని ఆమూలాగ్రముగ పరిశీలించి చూచినాను. నా బుద్ధిజాడ్యమువలన యెక్కడనైనా పంక్తినిగాని, విషయమునుగాని విడచితినేమో యను నేతలంపుతోఁ దిరుగా రెండవపర్యాయము పరిశీలించి చూచినాను. వెనుక నేను మోడేకుర్తి వచ్చినప్పుడు తమచే వివరింపబడిన స్వప్నోపదేశములయొక్క వివరణమై యున్నది. ఈగ్రంథము ముముక్షువులగు ఆస్తికాగ్రగణ్యులకు మిక్కిలీ హృద్యమైయున్నది. నాస్తికులను కాలవిళంబమునఁ జక్కగబోధించి మంచిమార్గమునకుఁ దీసుకొని రావచ్చును. ఆస్తికనాస్తికునిమాత్రము మంచిమార్గమునకుఁ దెచ్చుట దుర్ఘటము.

శ్లో॥ “ అజ్ఞస్సుఖమారాధ్య స్సుఖతరమారాధ్యతే విశేషజ్ఞః ।
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి న రంజయతి. ”

అను పండితంమన్యమానులకు, జ్ఞానలవదుర్విదగ్ధులగువారికి, అజీర్ణరోగికి భోజనపదార్థములయందు ద్వేషబుద్ధి కలుగునటులుండును.

జ్ఞానవిపాకులగుముముక్షువులకు అత్యంతోపయోగమై, మోక్షసాధనమని చెప్పుటకు నిస్సందేహము. ఈవిషయము మనస్సును ఉపాధిగ్రస్తము గాకుండా అరికట్టి యేకాగ్రబుద్ధితోఁ జూచినఁ దెలియును. బహ్మవిద్యయన, సర్వకారణకారణమగు పరమకారణమును తెలుసుకొనుటయె బ్రహ్మవిద్యయనంబరగు. ఇట్టిపరమకారణవస్తువును దెలుసుకొనుటకు రెండుమార్గమును గలవు. అదియెట్లన— క్రియాజన్యజ్ఞానమనియు, యోగజన్యజ్ఞానమనియు ద్వివిధమైయున్నది. క్రియాజన్యజ్ఞానమనగా మాబోట్లము కష్టపడి శాస్త్రవ్యాసంగముచే సంపాదించిన జ్ఞానము. యోగజన్యజ్ఞానమన ప్రహ్లాదులవలె చిత్తనైర్మల్యతచే యీశ్వరప్రణిధానాదులఁజేసి తదనుగ్రహమును సంపాదించుకొన్న జ్ఞానము. అస్మదాదుల జానము చదివినంతవఱకే భగవత్కటాక్షలబ్ధజ్ఞానము, నిరవధికము. మాజ్ఞానము ఉపాధివశమున భ్రమప్రమాదాది దోషగ్రస్తమైయుండును. అజ్ఞానమునకు నిట్టిదోషము లేమియు లేకనే నిర్దుష్టములై యుండును. "శాస్త్రజ్ఞానం బహుక్లేశం" అనువచనమే యిందుకు తార్కాణము. శ్రీప్రహ్లాదులు శ్రీభాగవతము సప్తమస్కంధములో "చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థముఖరశాస్త్రంబులు, నేచదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్లఁ జదివితిదండ్రీ" యనియు, "మత్తస్సర్వమహంసర్వ" మనియు చెప్పినపుడుఆయనగారికి నెంతవయస్సు. బ్రహ్మస్వరూపమువలె నపరిచ్ఛిన్నమగు శాస్త్రముల నెప్పుడభ్యసించినట్టు యోచింపుడు. గనుక తాము బాల్యాత్ప్రభృతి "సుస్నిగ్ధః" అనునట్లు సుకృత కర్మవశమున "యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని" అనునట్లు, దయా, సత్య, శౌచములు, శాంత

దాంత్యాదిగుణములు గలిగి యీగుణసంపదవలన పరమేశ్వరాను గ్రహమును సంపాదించిన విమలజ్ఞానమువలన స్వకర్తృత్వబుద్ధిని పరాయత్తముచేసి వ్రాసిన గ్రంథములు గనుక నిర్దుష్టములుగను, గుణవంతములుగను, సుబోధములుగను ఉన్నతపదవినొందుటకు సోపానస్థానములగు వేదాంతగ్రంథములై యున్నవి. గనుక యీగ్రంథములను చదువువారలు విసుగులేక సాత్వికబుద్ధితోఁ జదివినయెడల స్త్రీ బాల జడమతు లందరికి మోక్షమార్గ ప్రదర్శకములై చతుర్విధపురుషార్థదాయకము లని చెప్పకతప్పదు. ఇట్లు వ్రాయుట నాస్తికులను గుఱించియు, ఈర్ష్యాదిగుణములుగలవారిని గుఱించియు వ్రాసినదికాదు. ఆస్తికనాస్తికులను గుఱించియుకాదు. ఇట్లువ్రాయుట స్తుతిపరముకాదు. యథావస్థితిని వ్రాయడమైనది. పరమేశ్వరుని దయను సంపాదించుకొంటే „మూకంకరోతి వాచాలం, పంగుం లంఘయతేగిరిం” అనునటుల అంతఃప్రవిష్టుడగు పరమాత్మ అన్ని శక్తులనిచ్చును. దయను సంపాదించుకొనుటయే దుర్లభము. „మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే” యనియు, „జాయమానం హి పురుషం యః పశ్యేన్మధుసూదనః” యనియు నొకానొక మహానుభావులుందురు. అందరికి లభించదు.

ఈగ్రంథములు సుబోధకములుగను, అనవరత పఠ్యమానములుగనుండుటచే నాకు గలిగిన ఆనందాతిరేకమువలన కరణత్రయముతో నిట్లువ్రాసితిని. మిక్కిలీకర్కశములగు తర్కవాక్యములచేత, వ్యాకరణసూత్రములచేత ఒరపుడిపెట్టిన, పరమసుకుమారములగు నీవేదాంతగ్రంథము లోర్వజాలవు. అదియెట్లన. „వ్యాసా కుఠార కుద్దాల నాసాభరణ రంజితం.” అపరంజియందుఁ బొనుగబడీన

వజ్రపునాసాభరణను మెరుగుపోగరతో మెరుగుబెట్టినసహించును గాని, వాస్యా అనగా బాడిదె, కుఠారమనగా గొడ్డలి, కుద్దాల మనగా పిరకాసుగడ్డపలుగు వీనితోఁ దోమిన సహించునా? సహింపదు. గనుక వాటితో కీచులాడక, ముముక్షువులగువారు సర్వకాలములయందు నీగ్రంథములను పఠింపుచూ అద్వైతానందమనుభవించుచూ అస్మదాదులకుఁ గొంతవరకు దాయభాక్కులఁజేయుదురని ప్రార్థించెదను.

శ్రీశంకరభగవత్పాదులుకూడ తర్క వ్యాకరణములు మోక్షదాయకములు కావని భజగోవింద స్తోత్రమునందు వాక్రుచ్చియున్నారు. గనుక వేదాంతశాస్త్రమే మోక్షదాయకము.

వైదికమతములు ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములు మూఁడేకాక యితరమతము లనేకములుండినను, సర్వకారణవస్తువొకటికలదనువారందరు మనకు సోదరులుగా భావించవలయును. ఇంతేకాక సర్వమతములవారికి ప్రాప్యమొకటే అయియున్నది. అదియెట్లన "యథా స్యందమానా నద్యః సముద్రే స్తంగచ్ఛంతి" యనునట్లును, ఆకాశాత్పతితంతోయం యథాగచ్ఛతి సాగరమనునట్లును, ఉపాధిభేదము లనేకములుండినను ఉపాస్యమొకటే అయియున్నది, సత్యము. గ్రంథములు దివ్యతమముగనున్నవి.

శ్రీ శఠగోపాచార్యులయ్యవార్లంగారు.

11—9—29.

శ్రీకాశీ.

అనేకనారాయణస్మరణం.

శ్రీ:

శ్రీబ్రహ్మానంద సరస్వతీస్వామి.

బ్రహ్మశ్రీ అంకరాజు సుబ్బరాయశర్మగారికి—

ఆంధ్రపత్రిక కార్యాలయము, చెన్నపురి.

మీరు వ్రాసిన రిజస్టరి వుత్తరమున్ను అందుదహరించిన ప్రకారము రిజస్టరిచేసిపంపిన స్వప్నలబ్ధాద్వైతబోధ గ్రంథమున్ను పంచద్రావిడ శాఖాంతరభేదనిరాకరణ పత్రికయున్ను అందినవి. ఆగ్రంథమునందు చాలాభాగము చదివితిని. గ్రంథకర్త నిమిషకవి వెంకయ్యగారిని రమారమీ నలుబది సంవత్సరములుక్రిందట నేను చూచియు, వారి సుగుణసంపత్తిని గూర్చి వినియు ఆనందించినవాడనే. వారు బాల్యమునుండియు ఆంగ్లభాషాభ్యాసముచేసి లౌకికపదవులనలంకరించియుండియును, నియమముగ గురుముఖతః సంస్కృత విద్యనభ్యసించి తచ్ఛాస్త్రపాండిత్యము నందకయును, యీకాలపు వేదాంతులవలె కేవల శ్రుతపాండిత్యమునందే ఆధారపడక బహు కారణజన్యమైన స్వప్నముల నన్నిటిని జ్ఞప్తియుంచుకొని వాటినన్నిటిని అద్వైతపరముగా సమన్వయించుకొని చిత్తశాంతినొంది బ్రహ్మానందమగ్నుడనైతినని అంతటితో దృప్తినొందక "స్వయం తీర్ణః పరాన్ తారయతి" అను న్యాయమున ముముక్షుజనతకుపకా

యముగ తమ అనుభవమును గ్రంథరూపముగ బ్రకటించినందుల కు మిగుల నానందించి వారికనేక నారాయణస్మరణలను చేయుచు న్నాను. మఱియు నీసందర్భమున నాకు స్ఫురించిన విషయమును వ్రాయతలంచితిని. నా బాల్యమున భారతమందలి "ఒకటిఁగాని రెం టి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూటి నాల్గింటి కడువశ్యములుగ జేసి, యేని టిని గెల్చి యారింటి నెరిగి, యేడువిడిచి వర్తించువాడు వివేకధనుఁ డు" అను పద్యమును చదివి అందుల పలువిధార్థములను వినినపుడే మన భాషయందలి పదగంభీరమునకు ఆశ్చర్యమునొందితిని. తదు పరి నలయాదవరాఘవపాండవీయము మొదలగు గ్రంథములను చదివినపుడును, నొకసమయమున నొకపండితుడు నీచోక్తులగు బూతు మాటలకుఁగూడ వేదాంతార్థములను చెప్పినపుడు మన భాషామహి మను గుర్తెరిగితిని. తుదకు "తత్త్వమసి" మహావాక్యమునకు "అ తత్త్వమసి" అని ద్వైతులు అర్థము చేసి వాదించగా వినినపుడు పండితుల బుద్ధిసూక్ష్మమున కవకాశమిచ్చిన సంస్కృతభాషతో తుల్యమైనది మరొకటిలేదని భావించితిని. అట్టి భావములతోనున్న నాకు స్వప్నముల నన్నిటిని వేదాంతపరముగ సమన్వయించుటలో ఆశ్చర్యముకలుగలేదు గాని వారిగ్రంథము ముముక్షులలో కొందరి కి మార్గదర్శికాగలదని నమ్మెదను.

శ్రేయోభిలాషి,

శ్రీ బ్రహ్మానంద సరస్వతీస్వామి.

శ్రీ పంచగంగేశ్వరమఠం.

శ్రీ బిందుమాధవఘట్టా, శ్రీ కాశీ.

గంజాముజిల్లా బరంపురం వాస్తవ్యులు పెన్షను డిప్యూటీ కలెక్టరుగారైన బ్రహ్మశ్రీ మహారాజశ్రీ పోతాప్రగడ వెంకట రమణయ్యపంతులుగారు వ్రాసిపంపించిన యభిప్రాయము.

శ్రీ రామాయనమః.

## స్వప్నలబ్ధాద్వైతబోధనుగురించిన విజ్ఞాపన.

శ్రీహరియందు పరమభక్తి విశ్వాసముల్గలిగి మోక్షేచ్ఛగల సర్వజనోపకారి అయిన యీగ్రంథమును వ్రాసిన మ॥రా॥రా॥ నిమిషకవి వెంకయ్యపంతులుగారీగ్రంథముయొక్క యొక ప్రతిని 1929 సం॥ర మాగష్టునెలాఖరున నాకుఁబంపి నాయభిప్రాయమును కోరినారు. ఈజిల్లాలో వీరిని యెరిగినవారు బహుకొద్దిమంది యుందురు. వీరిపేరు గోదావరిజిల్లాలో చాలాప్రసిద్ధికెక్కియున్నది. ఈ గ్రంథము నేనుచదివి సమగ్రముగా నాలోచించగా నాయభిప్రాయము వ్యక్తపరచుట కీశ్వరప్రేరేపణ కలిగినది. వీరు సహస్రమాసజీవులు. మరిన్నీ ఆత్మానుభవమును పొందినవారు. గాన నిట్టివారి యాజ్ఞను మన్నించిన నాకు శ్రేయస్కరమని నమ్మకము కలిగినది. ఇట్టి మహాగ్రంథము విషయమై స్వతంత్రించి యభిప్రాయమివ్వదగిన అనుభవజ్ఞానముగాని శాస్త్రపరిచయముగాని నాకులేకున్నను మహనీయులైన వీరి ఆజ్ఞను మన్నించుటే విధిగా దోచి యీపనికి పూనుకొన్నాను. మహనీయులైన పెద్దిభొట్ల సుబ్బారాయుడుగారి Foreword యుండగా నాయభిప్రాయము దివిటీముందర దీపమైనను నాశ్రేయస్సుకొరకే యీయభిప్రాయమును వ్రాయబూనితిని. ఈవెంకయ్యపంతులుగారి విషయమై, 1878 సంవత్సరములో నేను

రాజమహేంద్రవరము F.A. కు జదువుటకు వెళ్లి కాకినాడలో స్థిరముగా వసించియున్న నాతల్లిదండ్రులను జూచుటకు కాకినాడకు పోతూ వచ్చుచుండుటచేత వీరియోగ్యతనుగురించి వినికి విశేషముగా నాకు గలుగుచుండెను. అప్పటప్పట వారి సందర్శనము కూడ నరుదుగా గలుగుచుండెను. అప్పట్లో అనగా 1882 సం॥రం మేనెల వరకు నేను గోదావరిజిల్లాలో నున్నాను. ఈకాలములో వీరు అతిపరిశుద్ధమైన అంతఃకరణతో వ్యవహరించువారనే ప్రశంసను వినేవాండను. అటుపైన నేనీజిల్లాకు వచ్చినపిమ్మటం గూడ తరుచు వీరియోగ్యతను గురించి వినేవాడను. 1895-96 సంవత్సరములో నేను రసూలుకొండలో తహశ్శీలుదారు పనిలో నుండు కాలములో నాకు బాల్యస్నేహితులున్ను, కాకినాడలో హెడ్డుక్వార్టరు డిప్యూటికలక్టరుగానుండి శలవుమీద రసూలుకొండకు వచ్చిన J. T. Lever దొరగారి ప్రశంసలో గూడ యీ వెంకయ్యగారిని గురించి వారు బహు శ్లాఘనీయంగా మాట్లాడినారు. ఎంత గొప్ప అధికారి అయినను వారిదయను అభిలషించకుండా మనుష్యమాత్రుని అనుగ్రహముకుగాని ఆగ్రహముకుగాని లోబడకుండా కేవలము పరమేశ్వరుని యందు మాత్రమే గురియుంచి ధారాళముగా వ్యవహరించువారని Lever దొరవారు చెప్పినారు. వారివల్లనే గాక యింకా అనేకుల వల్లకూడా తరుచువింటిని. వీరు retire అయిన తరువాతకూడా 1910 సం॥రం లో నేను రాజమహేంద్రవరం Sub Collcctor ఛార్జీలో నుండినకాలములో వీరిస్వగ్రామముకు వెళ్లి వీరిదర్శనము చేసినాను. గాని వీరికి యీబ్రహ్మవిద్యావిషయమైన కృషి యున్నదని యీగ్రంథము 1929 శెప్టెంబరు నెలలో నేను చదివేవరకు నె

రుగను. ఈగ్రంథము చదివిచూడగా వీరికీకృషి మధ్యవయస్సు నుంచి యున్నట్లు స్పష్టపడుచున్నది. సామాన్యముగా లభ్యముకాని అసాధారణప్రజ్ఞ కలిగియున్నది. సామాన్యజనులకు దైవభక్తిన్ని వేదాంతశాస్త్ర పరిచయమున్ను కొంచెముగానున్నను అందుకు ద్విగుణము వారి డాంబికముచేతనుగాని, యితరులతో ప్రసంగము వల్లగాని మరియేకారణముచేతనుగాని (ముఖ్యముగా వారి బాహ్య చర్యలను సంభాషణను పురస్కరించుకునే) వెల్లడి కావడము జరుగు చుండుట మనము చూచుచున్నాము. ఇంత చిరకాలపరిచయము నాకున్నను వీరిలో యీడాంబికము మొదలగునవి నాకు గోచరించ లేదు. కనుక వీరీగ్రంథము వ్రాయుటయు ప్రచురపరుచుటయు ని ర్వ్యాజమైన లోకోపకారబుద్ధి ఉదయించియే చేయుచున్నారని నాకునమ్మకము కలిగినది.

ఈగ్రంథములోని ప్రథమభాగమైన స్వప్నోపదేశములు మాత్రమే చదివి అపహాస్యముతో విరమించువారి కీపుస్తకముయొ క్క విలువ తెలియనేరదు. గ్రంథమంతా విచక్షణతో చదివిన॰ ముముక్షువులకు యేయడవులకు పోకనే, సన్యసించకనే, గృహస్థుడై యుండియు, లౌకికవ్యాపారములకు లేశమపి ప్రతిబంధము లేకుండా అపరోక్షానుభవముకు ప్రయత్నించి సాధించవచ్చు నని తోచును. గాని ఇందుకు కేవలము గ్రంథపరిశీలనే చాలదు. దృఢమైనట్టిన్ని నిర్వ్యాజమైనట్టిన్ని భక్తివిశ్వాసములు సర్వాత్మనా యుండవలెను. అవిలేనిచో నెంతఉత్కృష్టవేదాంతశ్రవణచేసినను కావ్యనాటకాలం కారగ్రంథముల పఠనవల్ల నెట్టిప్రయోజనమో అంతేఫలము. అవి యున్నవారలకీగ్రంథము చదువుటవల్ల లాభమేమనగా తమచిత్తవృ

త్తులను పరిశోధించుకొని మలినవాసనలను దూరముచేసుకొనుచూ తాముకూడా ప్రయత్నించి స్థిరమైన అద్వైతానుభవమును పొంది ముక్తులమవుదుముగాక అనేకోరిక కలుగును.

స్వప్నములు స్వప్నములే కానివానిలో నిజమేమియున్నదని సందేహించుట పనిలేదు. యెవరికి తీవ్రమైన వైరాగ్యముకలిగి తదేకదృష్టి పుట్టునో వారికి స్వప్నమ్ముదుగాని, కించిత్కాలము నిద్రపట్టినరీతిగా స్మృహతప్పిన స్థితిలోగాని, యెవరో బోధపరచినట్లో యేదోగ్రంథములో తాముచూచినటులనో గోచరించుట లోకానుభవములో నున్నది. దాని సత్యత్వము అనన్తరకాలములో స్పష్టపడుచున్నది. కాని యిట్టి అనుభవము అందరికిఁ కలుగనేరదు. పైన చెప్పిన తీవ్రవైరాగ్యాదులుండినపైని యావన్మనోనైర్మల్యమో తావదధిక ఫలము లభించును. చిత్తశుద్ధిలేనటువంటిన్ని మలినవాసనలతో గూడినటువంటి అంతఃకరణకలవారలకు దైవభక్తియున్నను ఫలాపేక్షతో కూడియుండును, గనుక "అంతవత్తుఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం" అను గీతావాక్యము వారికి వర్తించును. Theosophical theory లో కూడా శ్రీమద్భాగవతము ద్వాదశస్కంధము ద్వితీయోధ్యాయములో జెప్పిన "దేవాపిమరులు" జ్ఞానాభ్యాసపరులకు సహకారులగుదురనగా, మనపురోహితులవలె స్థూలశరీరములో వారువచ్చి జాగ్రదావస్థలోనే మనకు హితబోధచేస్తారనికాదు. పైనచెప్పబడినరీతిగానే స్వప్నావస్థమొదలగు అవస్థలలోనే మనకు మహాపురుషుల సందర్శనమగును. ఇదియంతయూ మాయాకల్పితముగాదా, మనోవికారముగాదా అంటే, బ్రహ్మసాక్షాత్కారమువరకు యావత్తుకూడా అనాత్మభాగమే కేవల నిర్వి

కల్పసమాధ్యవస్థతప్ప తక్కినది యావత్తు "మాయాతీతం" కానే కాదు. మాయను అతిక్రమించినవారికి కృతకృత్యతచేత గురువు అవసరములేదు. ఉపాసన అవసరములేదు. హృదయగ్రంధి విడనంత కాలము మాయలో పరిభ్రమణముతప్పదు. అయితే నిర్మలాంతఃకరణగలిగినవారు శుభవాసనలతో గూడియుందురు. గనుక అట్టివారికి గీతలయొక్క 8 వ అధ్యాయం 14 శ్లోకము, 10 అధ్యాయం 10 వ శ్లోకము వీటిలో జెప్పినప్రకారము ఈశ్వరుడు తోడ్పడి మోక్షముకు త్రోవలోపడేటట్లు కటాక్షించును. మాయావికారమైన అంతఃకరణనుపట్టుకునే మాయను దాటవలెనుగాని మరియొక త్రోవే లేదు. బృహదారణ్యకంలో "మనసైవానుద్రష్టవ్యం నేహనానాస్తి కించన" అని చెప్పబడియున్నది. అది పరిశుభ్రము చేసుకొన్నచో అన్ని త్రోవలు కనపడుతవి. అక్కడను యీ చర్మచక్షుస్సెందుకు నుపయోగించదు, కనుక మనస్సును నిర్మలముచేసుకొనుట జ్ఞానమునకు అత్యావశ్యకమని, యీగ్రంథము చదువుటవల్ల పూర్తిగా స్పృహించకతప్పదు. మనస్సునుగురించిన యీగ్రంథములోని ఉపన్యాసమున్ను అక్కడక్కడ స్వప్నవివరణములలో వ్రాసిన మనోవృత్తులనుగురించిన అంశములున్ను ఆరురుక్షువులకు చాలా ఉపయోగించే భాగములుగ కనబడుచున్నవి. ఈగ్రంథములోని సంగతులు క్రొత్తవికాకపోయినను, స్వానుభవముగలవారివల్ల పదేపదే వినుటవల్ల మనస్సుకు బాగానాటునుగాన గ్రంథము మిక్కిలి ఉపయోగము. శాస్త్రజన్యజ్ఞాన మెంత అధికముగానున్నను పరోక్షజ్ఞానమే కనుక, అపరోక్షానుభవముయొక్క శతాంశకూడా సరికాదు. "వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా సన్యాసయోగాద్యతయః శుద్ధసత్వాః తే

బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే" అని శ్రుతి చెప్పుచున్నది. అట్టిమహాపురుషులకు కూడా సద్యోముక్తి కలుగక కొంతకాలమువరకు ప్రతిబంధకమున్నప్పుడు శుష్కతర్కమును, పురస్కరించుకొని, వేదాంతగ్రంథములను మాత్రము చదివి అనుభవములోనికి వానిసారమును తెచ్చుకొకుండా యున్న వారలను గూర్చి చెప్పనేల. "నతస్యప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవలీయన్తే" అను శ్రుతి అపరోక్షానుభూతివల్ల నిస్సంశయమైన "అభయంప్రతిష్ఠ" "ఆనన్దంబ్రహ్మణోవిద్వాన్ నబిభేతి కుతశ్చనేతి" అని చెప్పినస్థితికి రాకున్నవారల కెట్లువర్తించును. ఇందుకు శ్రుతివాక్యమే ప్రమాణము. "భిద్యతేహృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే." కనుక ముముక్షువు బ్రహ్మ సాక్షాత్కారముకొఱకు సదా సర్వాత్మనా ప్రయత్నించవలెను. శాస్త్రమును చదివి మననముచేసి, దానిసారమును గ్రహించి ఆశాస్త్రమును వదిలి సమాధికి ప్రయత్నించవలెను. "తమేవధీరో విజాయ ప్రజ్ఞాంకుర్వీత బ్రాహ్మణః। నానుధ్యాయాత్ బహూన్ వాచోవిగ్లాపనం హి తత్" కనుక యావజ్జీవము ప్రయత్నించగా యేజన్మలోనైనను పూర్వపుణ్యవశమువల్ల బ్రహ్మసాక్షాత్కారము కాగలదు. అట్టిప్రయత్నముకు ప్రేరేపణ యీగ్రంథము చదువుటవల్ల కలుగగలదు. చాలాసులభశైలితో వ్రాయబడినందున వేదాంతశ్రవణ మెంతకొంచెముచేసినను యీగ్రంథము అట్టివారికి చాలా ఉపకారియగును.

నేనీగ్రంథములోని ప్రతిభాగము శాస్త్రసమ్మతముగా నున్నదా లేదా అనేవిచారణకు పూనుకొనలేదు. మరిన్ని నేనంతపండి

తుడనుకాను. పండితుడనైనను, అట్టిసన్నశల్యపరీక్ష కావశ్యకమే కన పడదు. శాస్త్రపరిచయము కావలెనంటే అసలు శాస్త్రము చదువవ లెను. ఇందులోని అంశములు తప్పుత్రోవను త్రొక్కినవాలంటె అట్టిదిలేదు. ఇట్టి అంశములో అట్టి పరీక్షయొక్క ప్రయోజనము గ్రహీకరించుటకు బుద్ధిగలవారి కావశ్యకముగాని, యితరులకనావశ్య కము. ఈగ్రంథము లోకోపకారకమై యున్నదాలేదా అనేఅంశ మే పరిశీలించతగిన అంశముగా నాకు తోచి, లోకోపకారకమని నాఅభిప్రాయము వ్యక్తపరచినాను.

ఈగ్రంథము చదివి కృతార్థుడనగుటకు అవకాశమిచ్చిన గ్రంథకర్తలైన మ॥రా॥రా॥ నిమిషకవి వెంకయ్యపంతులుగారి కనే క వందనములొనర్చుచున్నాను.

బరంపుర,
30_9_1929,

ఇట్లు,
పోతాప్రగడ వెంకటరమణయ్య.

శుక్లనామసంవత్సర భాద్రపదమాస బ ౬ మంగళవారం
ఆంధ్రపత్రిక.

## గ్రంథ స్వీకారము
## "స్వప్నాలబ్ధ అద్వైతబోధ"

మోడేకుర్రు కాపురస్థులగు నిమిషకవి వెంకయ్యగారిచే ఆంగ్లభాషలో రచింపబడిన పైగ్రంథమును, కృతజ్ఞతతో స్వీకరించితిమి. అద్వైతసిద్ధాంతమంతయు, వీరికి స్వప్నములో గురూత్తమునిచే నెటులబోధింపబడెనో, యీగ్రంథము వివరించుచున్నది. స్వప్న వృత్తాంతము పూర్తిగ ప్రచురింపబడెను. స్వప్నావస్థలో స్థూలశరీరము కదల మెదలకున్నను, సూక్ష్మశరీరము విశేషసంచలనము జూపుటచే, సూక్ష్మశరీరులద్వారా, గ్రంథకర్తగారి కిట్టి దివ్యజ్ఞాన మలవడియుండు ననుటకు సందియములేదు. వీరు వివరించిన స్వప్నముల వృత్తాంతము, అద్భుతానుభవములను వెల్లడిచేయుటచే, పాఠకుల కెంతయు అర్థవంతముగనుండగలదు. అద్వైతతత్వామృతమును చవిగొనదలచువారికిది మిగుల ఆనందదాయకముగ నుండగలదు. ఈ గ్రంథము సర్వమతసమానము జూపుచు, ఎల్లమతములును ఏకసమమునే వెల్లడి జేయుచున్నటుల, స్పష్టపరచుచున్నది. గ్రంథము వలయువారు, తూర్పుగోదావరిజిల్లా రాజోలుతాలూకా యందలి, గ్రంథకర్తగారికి గాని, నిమిషకవి శ్రీరామమూర్తిగారికిగాని వ్రాసిన బడయగలరు.

౬౦

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

11-వ స్వప్నవివరణలోఁ జెప్పఁబడిన పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ వాక్కులలో 'పరా' వాక్కుయొక్క ఉచ్చారణను గూర్చియు, ధ్యానములో నాకు మధ్యమధ్య కలుగుచున్న విఘ్నములగూర్చియు కాశీబుగ్గతీరమందు శ్రీ వ్యాసాశ్రమాధిపతులైన శ్రీ శ్రీ శ్రీ మలయాళ స్వామివారికి నేనువ్రాసిన యుత్తరమును వారిప్రత్యుత్తరమును నీక్రింద వివరింపఁబడినవి.

మో జేకురు

27—10—29.

శ్రీ శ్రీ శ్రీ మలయాళస్వామివారికి—

మహాశయా! వందనములు.

1929 సంవత్సరము అక్టోబరు నెల యదార్థభారతి సంచిక 243-244 పుటలలో పశ్యంతి, మధ్యమా, వైఖరీ(వాచిక)వాక్కుల యొక్క వివరణ చదివి ఆనందించినాను. వాచకము పరశ్రోత్రముల కు వినబడునట్లు వాక్కుతో పలుకునది. ఉపాంశువు యితరులకు వినరాకుండ కొండనాలుక సమీపమున పలుకునది. మానసికము కేవలమనస్సులో తైలధారవలె తట్టునది. సంశయరహితము.

పరా వాక్కుస్థానము వివరింపఁబడలేదు. నాయనుభవమును బట్టి, చిరకాలమునుండి నొకసంశయము బాధించుచున్నది. ఏమన

గా, నేను తొలుత వాచకముగ జపము ప్రారంభించితిని. కాలక్రమేణ వాచకఉచ్చారణ దానంతటనది ఉపాంశువై కొండనాలుకసమీపమునకు చేరినది. తరువాత హృదయములో ననగా మనస్సులో జేరినది. దరిమిలాను నాభిస్థానము చేరినది. పిమ్మట మూలాధారస్థానములోఁజేరి స్థాయిపడినది.

ఇచట వాచకముకంటె యెక్కువస్పష్టముగ మంత్రోచ్చారణగాని యితరస్తోత్రాదులుగాని మనఃశ్రోత్రములకు వినబడుచున్నవి. ఇటుల వినఁబడుచుండగా ప్రత్యగాత్మస్వరూపియైన నామనస్సు శరీరావరణలు, అనగా శరీరపరిణామము దాటి, సర్వవ్యాపియైనటుల దోచుటయేకాక స్థూలశరీరమున్నటుల మనస్సుకు గోచరముకాదు. ఆకాశమువలె సూక్ష్మమై అఖండపరిపూర్ణమై యుండును. ఇట్టి అనుభవము సత్యమా? శాస్త్రసమ్మతమా? లేక మనోవికారమా? యను సంశయము బాధించుచున్నది.

మరియు మూలాధారమందు పరావాక్కుపుట్టి, పశ్యంతి, మధ్యమా, వైఖరీవాక్కులుగ వికసించునని యోగకుండల్యుపనిషత్తు, మహోపనిషత్తులలో జెప్పఁబడినది. పరావాక్కు "శబ్దబ్రహ్మ" మని యోగశిఖోపనిషత్తులోఁ జెప్పఁబడినది. పైనజెప్పినటుల ఆత్మ—మనస్సు సర్వవ్యాపియైనపుడు మూలాధారమందు ఓంకారముయొక్కగాని, మరి యేమంత్రముయొక్కగాని ఉచ్చారణ వలన ప్రయోజనమేమి? "నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే" అనువాక్యముతోనెట్లు అన్వయించును. ఈసంశయములు ప్రతిదినము ధ్యానకాలమందు పీడించుచున్నవి. దయచేసి సత్యబోధచేయ వేడెదను.

మఱియు ధ్యానకాలమందు మనస్సు హఠాత్తుగ చలించి లిప్తకాలము అంధకారముగనుండుటయేగాక, సంధ్యావందనాదికర్మలు జరుపునపుడు అదివరకు యెంతచేసినది, ముందు యేమిచెయ్యవలసినది మఱపువచ్చుచున్నది. ఒకప్పుడు నిద్రకూడ వచ్చుచున్నది. ఇవి కడువృద్ధాప్య (84 సం॥రం) ము వలన గలుగుచున్నవో, యితర కారణములవలన గలుగుచున్నవో తెలియకున్నవి. శరీరపాటవము కొంత తగ్గుటచేత ఆసనస్థిరతకూడ తగ్గినది. ఈబాధ అనగా మనస్సుహఠాత్తుగ చలించుట నివారణకొరకు తగిన సలహా దయచేసి వ్రాయించ వేడెదను.

దివ్యచిత్తమునకు తేవలెను:
విధేయుడు,
ని॥ వెంకయ్య.

---

శ్రీ శ్రీ శ్రీ స్వామివారి ప్రత్యుత్తరము.

శ్రీ వ్యాసాశ్రమం,
2-11-1929.

ఓ పరిశుద్ధమైన జ్ఞానస్వరూపులగు మహాశయా, తాము ఆత్మైకవిశ్వాసముతో వ్రాసిన పుత్తరము చేరినది. బహుజన్మ సంస్కారముచేతను సర్వేశ్వర కరుణచేతను తమకు గలిగిన అనుభవములన్నియు సత్యములు. సంశయింపపనిలేదు. బ్రహ్మాస్మి, అనుమహావాక్యోపదేశమును నిదిధ్యాసనములో యికను కొంత బలపరచి అతిసూక్ష్మములై యుండు హృదయని గూఢవాసనలను రానీయక అవియన్నియు మిధ్యయని భావనచేసి ఆత్మైకబోధము ఒక్కటే సత్యమని దృఢపరచిన చాలును. దృశ్యవ్యవహారము కొంచెమైననుండువరకు హృదయములో అట్టిభావన పొడచూపుచుండును. (1) మూలాధారమునుండి సహస్రారమువరకు సుషుమ్నానాళముద్వారా ఆత్మైకబోధముగా గలుగుచుండు స్వయంవేదితమగు శబ్దము పైచెప్పిన వాచకాది శబ్దములకు సంబంధించినవికావు. అవి స్వబోధాపరమైన ఆత్మశబ్దమగును. ఇట్టి అవస్థకు కుండలీబోధమనియు సుషుమ్నాద్బోధమనియు బ్రహ్మవేత్తలు చెప్పెదరు. "అహమిహమిత్యంతః స్ఫురంతం సదా," నేనునేను అని మహాత్ములకు స్ఫురించుచుండును. ఇదియే "బ్రహ్మాస్మి" యనియు, "శివోహ" మనియు, "సోహ" మనియు వేర్వేరు భావములతో స్ఫురించుచుండును. ఇదియే యదార్థమగు శ్రవణమగును. దీనిని ఒక్కసారి వినినవారికి మరలమరపు గలుగదు. తక్కిన వేదాంతగ్రంథశ్రవణములన్నియు నీటిపై వ్రాసిన

అక్షరముల వలె శ్రవణకాలములోనే మనస్సులో మాయమైపోవు ను. (2) ఆకాశమువలె ఆత్మకు వ్యాపకముగలిగే అవస్థ తురీయాతీతమనంబడును. దీనికి విదేహముక్తియనికూడ వచింతురు. పై చెప్పిన శబ్దబ్రహ్మము తురీయమనియు జీవన్ముక్తిదశయనియు బ్రహ్మవేత్తలు తలంతురు-స్వయముగా శబ్దబ్రహ్మము వినవచ్చినవారికి ఓంకారధ్యానము అవసరములేదు. వస్తుతః స్వరూపస్థితిలో సదా యుండినచాలును. అట్టివారికి ఇకయేదైన నిగూఢతత్వము వికసింపవలసియుండిన అదే స్వయముగా ప్రకాశించును. ఆత్మబోధమునందు శ్రీజగద్గురు శంకర భగవత్పాదాచార్యులు యీలాగున తెలిపియున్నారు.

శ్లో॥ అహమాకాశవత్సర్వం బహిరంతర్గతోఽచ్యుతః।
సదాసర్వసమ స్సిద్ధో నిస్సంగో నిర్మలోఽచలః॥

హఠాత్తుగా మనస్సు ఒక్కొకసమయమున దృశ్యరూపమై పరిణమించును. నిదిధ్యాసనబలముచే నివృత్తిచేయవలెను. ఇదే ఉత్తమపక్షము. లేక దానిని దృశ్యముగా గావించి దృక్కైనతాను విలక్షణుడుగా యున్నానని తలంచుటయు ఒకవిధసాధనమగును. అమనస్కమందు మనస్సు కలదా లేదా అను ప్రశ్నకు సీతారామాంజనేయ సంవాదములో యీతత్వమునే తెలిపియున్నారు, ఐనను యిది కొంతప్రమాదము కలుగచేసే సాధనమేయగును. మందమతులకు పతితమునొందుటకు దీనియందు నిండుకారణము కలదు. (3) మనస్సు వ్యవహారకార్యములో పద్ధతి తప్పిపోవచ్చును. వార్ధక్యపాటవముచే కొందరికిన్ని, దృక్కులో సదా రమించుఆత్మసంధానపరులకు గూడా ఒక్కొకప్పుడు దృశ్యవిస్మృతి గలుగును.

స్వబోధకు ఆవరణముగలుగక చూచినచాలును. అప్పుడు అదేసరి పడును. (4) ధ్యానమందు నిద్రావస్థ చాలామందికి కలుగుచుండును. ఇది యొక అవస్థాభేదము. ఇంకొక అవస్థలో అదియుండదు. శరీర ఉష్ణాధిక్యమే దానికి కారణము. దానిచే నేమియు బాధలేదు. ఆసనపాటవము యింక అవసరములేదు. వస్తుతత్వమందు సుస్థిరతకలుగుటయే అచలమైన బ్రహ్మాసన మగును. దృఢమైన బ్రహ్మచర్యమున్ను ఓషధులచే కాయశుద్ధియు లేనివారికి నిట్లుకలుగునని యోగజ్ఞులు తలంతురు. ఐనను ముక్తికి దీనితో నేలాటిసంబంధము లేదు. సాక్షాత్కారజ్ఞానమొక్కటియే చాలును. ఎక్కువైన గొప్ప సాధన చేయకనే తమకు దైవకృపచేగలిగిన అనుభవము చాలా మహత్తైనదని తలంచుచున్నాను. ఇక దేనియందు సంశయముండినను ధ్యానకాలమందు చింతనచేయవలెను. తరువాత సంశయముండదు. ఓంశివంశాంతమమృతమద్వైతం. లోకాస్సమస్తాస్సుఖినోభవంతు. ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః. ఇట్లు తను అత్యంతప్రేమస్వరూపులగు శ్రీస్వాములవారి అనుమతిప్రకారము—

ఆశ్రమసేవకుడు.

ఓం

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

## తప్పొప్పుల పట్టికనుగూర్చి మనవి.

నేను మోడేకుర్రులో నివసించి గ్రంథమును కాకినాడలో నచ్చువేయించుటవలన ప్రింటుతప్పులసంఖ్య అధికమైనది. నాస్నేహితులైన మ॥రా॥రా॥ కామర్షి వెంకటసుబ్బయ్యగారు వానిని బాగుగా పరిశీలించి యీతప్పొప్పులపట్టిక వ్రాసి, దానిని, అభిప్రాయములను నింపు కరుణాశ్రద్ధలతో పరిశుద్ధముగ నచ్చువేయించుటయేకాక, పుస్తకములలో తప్పులను గూడ కొంతవరకు దిద్దించినందుకు మిక్కిలి యానందించుచున్నాడను. శ్రీపరమేశ్వరుండాయనకు సకల శ్రేయోభివృద్ధినొసంగుగాత. ని॥ వెంకయ్య.

1. మఱి, మఱుగు, వఱకు, కొఱకు, తఱుచు, తఱచు, వేఱు, అఱికట్లు, వెఱ్ఱి. మాఱు, కొందఱు, అందఱు, నఱుకు, మొదలగు శబ్దములయందు సాధారణముగ 'ర' వాడుక లోనున్నను, "ఱ" కారముగనే యెంచవలెను.
2. నిష్ఠ, తిష్ఠ, వసిష్ఠ, శ్రేష్ఠ, అధిష్ఠాన అనుష్ఠాన మొదలగు శబ్దములయందు 'ఠ' కారమునకు బదులు 'ట' కారముగలచోట్ల ఠ కారముగనే చదువవలెను.
3. యథా, తథా, రథ, కథ, అర్థ, సమర్థ, స్థూల, స్థితి, పరమార్థ, అవస్థ, పదార్థ, ప్రార్థన, స్థాన, గృహస్థు, మొదలగు శబ్దములయందు 'థ' కారముకు బదులు 'ధ' కారముగాని 'త' కారముగాని యున్నచోట్ల థ కారముగనే చదువవలెను.
4. "వాక్యసారముగ" అని యున్నచోట్ల "వాక్యానుసారముగ" యని చదువవలెను.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| | విషయసూచిక. | | |
| 2 | 11 | చదుష్టయ | చతుష్టయ |
| 5 | 10 | విక్షేత | విక్షేప |
| | Foreword ఉపోద్ఘాతము. | | |
| ii | 1 | శృతమైనది. జాగ్రిత్తునందు | శ్రుతమైనది. జాగ్రిద్దశయందు |
| iii | 2 | వ్యాపింపజేయు | వ్యాపింపజేయ |
| | 3 | శిదము | సిద్ధము |
| | 13 | జాగ్రిత్తు | జాగ్రిదవస్థ |
| | 14 | యవ్వన | యౌవన |
| | 15 | సుషుప్త్వా | సుషుప్త్యా |
| iv | 1 | సంకొభము | సంక్షోభము |
| | 3 | దిచ్ఛిన్న | దిచిహ్న |
| | 5 | క్షావితస్ఫటిక | క్షాళితస్ఫటిక |
| | 18 | వృపదేశ | యుపదేశ |
| v | 1 | విధులకు | విదులకు |
| | ప్రార్థన | | |
| i | 14 | లగుచేత | లగుటచేత |
| ii | 10 | జూచు | జూచుచు |
| | విజ్ఞాపన. | | |
| 4 | 12 | బాహ్యా | బాహ్య |
| 5 | 18 | నహం | నాహం |
| | ,, | వేచే | వేదే |
| | ,, | శృతి | శ్రుతి |
| | ,, | మనో | మనః |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 7 | యని చెప్పు | యని చెప్పి |
| | పీఠిక. | | |
| 1 | 3 | కౌశిజ | కౌశిక |
| 11 | 16 | రంభాదప్సర | రంభాద్యప్సర |
| 12 | 2 | యోన్న మో | ఓంనమో |
| | స్వాప్నోపదేశములు. | | |
| 1 | 12 | కోరులో | కోర్టులో |
| | 13 | నిరక్ష్య | నిర్లక్ష్య |
| 2 | 3 | పెద గెడ్డము | పెద్దగడ్డము |
| 7 | 10 | జనార్థనః | జనార్దనః |
| 9 | 5 | స్వాస్త్యము | స్వాస్థ్యము |
| 11 | 8 | యపన్యాస | యుపన్యాస |
| 10 | 16 | యుద్వైత | యద్వైత |
| ,, | 23 | శోనస్త్వం | శోచ స్త్వం |
| 12 | 22 | ద్తైవజాన | దైవజ్ఞాన |
| 14 | 20 | బాహులిక | బాహ్లీక |
| | ,, | నావికః | నావికాః |
| 16 | 6 | దానిని | యీమెను |
| 17 | 13 | మెళుకువ | మెలఁకువ |
| 18 | 19 | పెటుట | పెట్టుట |
| 21 | 4 | శతృవు | శత్రువు |
| 22 | 15 | రివతెల | రి యువతల |
| 24 | 6 | వస్త్ర | వస్త్రము |
| | 8 | చార్యులని | చార్యులనని |
| | 9 | చదవ | చదువ |

## తప్పొప్పులపట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 24 | 13 | ఛాయ | చాయ |
| | 22 | శలవిచ్చి | సెలవిచ్చి |
| 25 | 3, 21 | మెళుకువ | మెలఁకువ |
| 26 | 9 | యేత్తే | యత్తే |
| 28 | 18 | మాధాన | సమాధాన |
| 30 | 18 | యదోష్ణ | యధోష్ణ |
| 31 | 15 | తనజ్ఞాన | తనఅజ్ఞాన |
| | 22 | సిది | సిద్ధి |
| | 23 | జానమయ | జ్ఞానమయ |
| | 24 | ర్ద్వైతచే | ర్ధ్వైతచే |
| 34 | 14 | చకములు | చములు |
| 35 | 4 | సంగమము | సంగము |
| | 18 | గాసంఖ్యా | గా నసంఖ్యా |
| | 19 | సదానుండుట | సదా యుండుట |
| 41 | 5 | సరజ్ఞ | సర్వజ్ఞ |
| | 12 | అవిధ్య | అవిద్య |
| | 14 | హోంకార | మోంకార |
| | 15 | ఓన్మమో | ఓన్నమో |
| | 18 | వర్న | వర్ణ |
| | 21 | ఒఁకార | ఓంకార |
| 42 | 23 | బుది | బుద్ధి |
| 43 | 2 | నెన్నే | నేనే |
| | 14 | ఆధిబౌతిక | ఆధిభౌతిక |
| 44 | 17 | దర్శనో | దర్శనో |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 44 | 21 | యెయథా | యేయథా |
| 46 | 23 | శుద్దాం | శుద్ధాం |
| 48 | 15 | జలమువిద్యను | జలము అవిద్యను |
| 49 | 22 | తారసు | తారము |
| 50 | 13 | సర్వే | సర్వే |
| | 14 | సంపనా | సంపన్నా |
| | 23 | పాంచిపంచిక | పాంచిపంచక |
| 51 | 19 | నసంఖ్యము ల్లన | నసంఖ్యములైన |
| 52 | 16 | సుఖదుఃఖ | సుఖదుఃఖ |
| 53 | 18 | సానము | స్థానము |
| | 19 | విజాన | విజ్ఞాన |
| 54 | 5 | చేయచు | చేయుచు |
| | 10 | జన్మయందు | జన్మమందు |
| | 14 | పూర్మకర్మ | పూర్వకర్మ |
| 55 | 19 | విశేశించి | విశేషించి |
| 57 | 5 | బోధిచు | బోధించు |
| | 15 | దాబా | దాబ్ధా |
| 58 | 7 | న్తమోగుణ | స్తమోగుణ |
| | 11 | అదిదో | అపదో |
| | 16 | భ×ద్గీశల | భగవద్గీశల |
| | 18 | కొలవలయు | కొనవలయు |
| 59 | 6 | రజ్జువకు | రజ్జువును |
| | 7 | మగట | ముగుట |
| | 12 | శూ్యతాం | శూన్యతాం |
| | 20 | ములోనుంచి | మునుంచి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 60 | 4 | రూపో | రూప |
| | 14 | సాదృస్య | సాదృశ్య |
| | 21 | అదిశే | అదివిశే |
| | 22 | రవు | రజ్జువు |
| 61 | 10 | అజాన | అజ్ఞాన |
| | 12 | యజ్జాన | అజ్ఞాన |
| 62 | 11 | అవ | అవియ |
| | 15 | దృషాంత | దృష్టాంత |
| 63 | 3 | శమర | శమద |
| | 13 | రజ్జూసహిత | రజ్జూపహిత |
| 64 | 15 | బుధ్యాది | బుద్ధ్యాది |
| | 20 | అస్థి | అస్తి |
| 65 | 1 | అస్థిభాతి ప్రియాయవ్రి) నారో | అస్తిభాతిప్రియమ్మని) [యారో |
| | 22 | ణా హ్మృతం | ణాహుతం |
| 66 | 11 | పదకారికా | పాదకారికా |
| | ,, | ప్రపంచకము | ప్రపంచము |
| | 19 | తస్థుల | తస్తుల |
| | 21 | తస్థూ | తస్తు |
| 67 | 3 | భుంక్తే | భుక్తే |
| | 5 | అ 22 | అ 21 |
| | 11 | విధ్యాన | విద్ధ్యేన |
| 68 | 3 | బుట్టువ | బుట్టువు |
| | 5 | తముల | తములను |
| 69 | 6 | లత్రితీపి | లత్రీపి |
| | 12 | సర్వజాన | సర్వజ్ఞాన |

| పుట | పం<sub></sub>క్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 69 | 13 | చేతనః | చేతసః |
| 70 | 9 | తస్థుల | తస్తుల |
| 71 | 14 | మస్త్రేయం | మాస్త్రేయం |
| | 16 | బాహ్యాంధ్యతర | బాహ్యాభ్యంతర |
| 72 | 7 | పాత | పాప |
| 73 | 12 | మానస | మానసిక |
| | 15 | బిగ్గిరి | బిగ్గర |
| | 21 | వినికి | లినికి |
| 74 | 4 | వినినామ | లినీనామ |
| | 9 | ముత్పనః | ముత్పన్నః |
| | 10 | పశ్యంత్వా | పశ్యంత్యా |
| | 13 | క్రిమాతే | క్రిమాత్ |
| | 23 | శ్రోత్రిత | శ్రోత్రిత్రి |
| 75 | 12 | చెలించదు | చలించదు |
| | 15 | విరాట్టహిరణ్యా | విరాట్ హిరణ్య |
| | 22 | దగినదియు | దగినదనియు |
| 76 | 11 | చకములు | చములు |
| 78 | 6 | ద్వందము | ద్వంద్వము |
| 79 | 5 | సౌహార్థ | సౌహార్ద |
| | 11 | చుండును | చుండుటు |
| | 21 | గురువాజ్ఞ | గుర్వాజ్ఞ |
| 80 | 21 | స్త్రీవిధా | స్త్రీవిధా |
| 81 | 1 | మయూవేశ | మయూరేశ |
| | 4 | శకస్యప | శకస్యప |
| | 7 | బ్రిహ్మైవ | బ్రహ్మైవ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 81 | 17 | నచ్ఛితా | సచ్చిదా |
| 82 | 1 | పిశాచ | పిశాచా |
| | 2 | స్త్థావరం | స్త్థ్వావరం |
| | 10 | నేకాకారేణ | నేకాకారాజగదాకా [రేణ |
| | 15 | గాలము | కాలము |
| 85 | 5 | నంగాలమందు | నకాలమందు |
| 87 | 19 | నచాఽస్తినః | నచాఽస్థినః |
| 88 | 12 | సూద్రులు | శూద్రులు |
| 89 | 5 | శేఖ | శాఖ |
| 90 | 19 | సూజోప | సూచికోప |
| 91 | 5 | దృఢాభాసము | దృఢాభ్యాసము |
| 92 | 15 | కలగ | కలుగ |
| 93 | 7 | ర్గతుం | ర్గంతుం |
| | 9 | సర్మవిఘ్న | సర్వవిఘ్న |
| 96 | 11 | ప్రితృతి | ప్రికృతి |
| 100 | 16 | సంగమే | సంగమో |
| 102 | 10 | ములిగి | మునిగి |
| | 12 | మునగి | మునిగి |
| | 15 | గాసీనుడై | దాసీనుడనై |
| 103 | 3 | కేవలమంచి | కేవలమునుంచి |
| 104 | 14 | విజాన | విజ్ఞాన |
| | 18 | నాత్మజ్ఞాని | ఆత్మజ్ఞాని |
| 106 | 1 | జన్మలలో | జన్మములలో |
| 107 | 17 | నసించి | నశించి |
| 108 | 3 | నిష్టిృయః | నిష్క్రియః |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 109 | 3 | పధార్థ | పదార్థ |
| 110 | 3 | ప్రిపంచకము | ప్రపంచము |
| 111 | 9 | భార్య | భార్యా |
| | 10 | ఇట్లు | ఇల్లు |
| 112 | 11 | దీనికి | వీనికి |
| 113 | 6 | శృతి | శ్రుతి |
| 114 | 8 | మైశరీరి | మైనశరీరి |
| | 13 | శూక్ష్మ | సూక్ష్మ |
| 116 | 1 | ధారోత్స | ధారాత్స |
| | 20 | కలగ | కలుగ |
| | 23 | గలగి | గలిగి |
| 117 | 16 | పూర్మము | పూర్వము |
| | 19 | శత్రు | శత్రు |
| | 21 | చెటు | చెట్టు |
| 118 | 21 | నవస్య | నవశ్య |
| 120 | 2 | సత్వము | సము |
| | ,, | కత్వము | కము |
| | 13 | జడ్డి | జడ్డి |
| | 20 | ,, | ,, |
| 121 | 23 | కలసి | కలిసి |
| 123 | 7 | కారణము | కారము |
| | 14 | ఇటి | ఇట్టి |
| 124 | 9 | నన్నదమ్ములు | అన్నతమ్ములు |
| 125 | 13 | దేరివతల | దేరియువతల |
| | 18 | నసించి | నశించి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 126 | 9 | పై నిద్దరి | పైఋద్దఱి |
| | 14 | నాస్థి | నాస్తి |
| | 15 | య స్సాంతి | యతశ్శాంతి |
| | ,, | రసాంతస్య | రశాంతస్య |
| | 23 | బ్రిహ్మాఅని | బ్రిహ్మానని |
| 127 | 22 | హ్యేసు | హ్యేశు |
| 128 | 11 | సాదముద్ద | సాదపుముద్ద |
| | 23 | నొకగుక్క | నొకక్కుక్క |
| 129 | 22 | నుంచి | నుండి |
| 130 | 8 | యున్నఁగా | యున్నకా |
| | 23 | ధ్యాయేతత్వం | ధ్యాయేత్తత్వం |
| 131 | 1 | ధాన్యనింప | నుధ్యానింప |
| 132 | 1 | బధ్యతే | బద్ధ్యతే |
| | 5 | బుధ్యా | బుద్ధ్యా |
| 133 | 11 | న్యాత్మక | న్యాత్మకా |
| 134 | 11 | సవిసర | సవిసర |
| | 21 | కాసించు | కాశించు |
| 135 | 21 | ననందేహ | ననందేహ |
| | 22 | సకలన్ | సకలగ్ |
| 136 | 3 | జగన్నాస్తి సర్వమాత్మ | జగన్నాస్తి ఆత్మనోన్య త్సుఖంచన, ఆత్మనో న్యాగతిర్నాస్తి సర్వ మాత్మ |
| | 10 | పతి | ప్రితి |
| | 13 | పంచకము | పంచము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| | 16 | తైక్యమన | లైక్యమన |
| | 21 | త్మలై.క్య | త్మల ఐక్య |
| 137 | 1 | తైజగ | తైర్జగ |
| | 12 | విశ్చయ | నిశ్చయ |
| | 14 | ఐశ్చైత్వరం | వశ్యైత్స్వరం |
| | 14 | అహంమేవ | అహమేవ |
| | 15 | క్షీరేష్వ్యతుష్యతే | క్షీరే ఘృతం ఘృతే |
| | 16 | కారరూప | కారరూపా |
| | 17 | నాంగ్ని | నాఽగ్ని |
| | 19 | హేంతుర్మ | హేతుర్మ |
| | 21 | నిర్మమే | స్నిర్మమే |
| 138 | 2 | స్య ఉత్యతే | స్పఉచ్యతే |
| 139 | 11 | ముత్సృదక్య | ముత్సృజ్య |
| 139 | 18 | కొంది | కొద్ది |
| 141 | 9 | బడిన | బడినచో |
| | 11 | బాంత్మల | బాంత్తల |
| | ,, | కొంటి | కొంటు |
| | 21 | మాంగుత్తు | మాంఋచు |
| 142 | 11 | సాయుద్య | సాయుజ్య |
| | 20 | మాయాం | మాయు |
| 143 | 6 | మాతూం | మాయ |
| | 7 | మార్థదశ | మారిక్థదశ |
| | 18 | ఆత్యాఽకాశ | ఆత్మాఽకాశ |
| 144 | 7 | చార్యవా | చార్యులువా |
| 145 | 16 | గీ 9 అ 5 శ్లో | గీ 9 అ 25 శ్లో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 147 | 17 | స్త్రూలా | స్థూలా |
| | 21 | నుంచి | నుండి |
| 149 | 22 | వస్త్రయందు | వస్థయందు |
| 152 | 8 | వాక్యము | వాకము |
| | 9 | తస్మిన్ద్సర్వం | తస్మిన్త్సర్వం |
| 153 | 14 | ద్వ్యాకృతిః | ర్వ్యాకృతిః |
| 154 | 3 | విరాట్చై | విరాడ్డై |
| | 12 | సమస్థ | సమస్త |
| 155 | 2 | పరాకృతి | పరాప్రకృతి |
| | 6 | అపుమేయ | అప్రమేయ |
| | 13 | మాదతై | మాదత్తే |
| | 16 | చారితరాత్మా | చాంతరాత్మా |
| | 18 | మహోరూ | మహీరూ |
| | 20 | వాక్యము | వాకము |
| 156 | 2 | సృషి | సృష్టి |
| 157 | 16 | సర్మవ్యా | సర్వవ్యా |
| 158 | 13 | అజాన | అజ్ఞాన |
| | 14 | వస్త్రలో | వస్థలో |
| | 21 | గాలము | కాలము |
| 159 | 6 | అభాస | ఆభాస |
| | 8 | శేదించు | శేషించు |
| | 15 | కాను | కాదు |
| | 23 | తైత్తిరోప | తైత్తిరీయోప |
| | ,, | ౪ అనువాకము | ౩ అనువాకము |
| | 24 | ఖత్విమా | ఖల్విమా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 161 | 8 | నకు | మనకు |
| | 13 | మహాతత్వ | మహాత్తత్త్వ |
| | 17 | ద్ఞాన | ద్జ్ఞాన |
| | 21 | బుద్గి | బుద్ధి |
| | 22 | పురుషపరః | పురుషఃపరః |
| 162 | 9 | వృక్షమూను | వృక్షముయొక్కమూలము |
| 163 | 21 | నమబుది | సమబుద్ధి |
| 164 | 4 | నిర్వాణ | న్నిర్వాణ |
| 167 | 6 | జానికి | జ్ఞానికి |
| | 23 | నవిష్యతే | నలిప్యతే |
| 168 | 17 | ముపాసితే | ముపాస్తే |
| 169 | 15 | యేశాఖ | మేశాఖ |
| | ,, | యేపని | నేపని |
| | 21 | వరిష్ఠె | వరిష్ఠె |
| 171 | 20 | జాన | జ్ఞాన |
| | 22 | ద్రధ | ద్రఢ |
| 172 | 2 | మెళుకు | మెలఁకువ |
| 173 | 23 | గూర్వొని | గూర్చుండి |
| 175 | 12 | త్మన్యేవ | త్మన్యేవ |

మరిన్ని, అవిద్యా కామకర్మవశమున, శబలజీవుఁడు చిదాభాసుఁడునను నామములు బడసిన నేను—జీవాత్మ నతతము సర్వవ్యక్తిరహిత స్వస్వరూపాను సంధానమువలన, జీవభావము విడిచి, పరమాకాశమం దనిర్వచనీయ తేజోరూప, సత్యాఽనంతాఽనంతాఽద్వితీయ పరిపూర్ణ పరమాత్మైక్యమును పొందునాత, యు

తన ఆత్మను తాను ఉద్ధరించుకొని, అనగా తనకు తాను మనోబలి మి—సుస్థిరతను కలుగచేసుకొని "నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే" యను వాక్యానుసారముగ సర్వచిన్తారహితుండై, నిర్వికల్పసమాధిలో పరమశాన్తినొందవలెననుట యీగ్రంథముయొక్క ముఖ్య తాత్పర్యమని గ్రహించవలయును.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 176 | 11 | తత్త్మాహం | తత్త్వాహం |
| 177 | 1 | గచ్చతి | గచ్ఛతి |
| | 5 | రుదృ | రుద్ర |
| | 9 | థపథస్తితః | థపథస్థితః |
| 178 | 3 | ధ్యాతు్ర | ధ్యాతృ |
| ~~169~~ | 16 | బ్రహ్మే | బ్రహ్మమే |
| | 18 | నసించి | నశించి |
| 180 | 4 | విరాత్ | విరాట్ |
| | 10 | సిఖో | శిఖో |
| 181 | 22 | తత్త్మాహం | తత్త్వాహం |
| 182 | 2 | మానసా | మానసీ |
| 183 | 18 | ఖనకాదు | ఘనకాదు |
| 184 | 3 | యత్నించె | యత్నించ |
| | 14 | బుద్డి | బుద్ధి |
| | 20 | ప్రాప్పి | ప్రాప్తి |
| 185 | 7 | బుధ్యాకేవవై | బుద్ధ్యాకేవలై |
| | 10 | రయేన్ | రయన్ |
| | 20 | ఆబుబుక్షుల | ఆరుబుక్షువుల |
| 187 | 2 | పిన్డస్తోపి | పిణ్డస్తోపి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 188 | 1 | ద్వేష్యోస్థి | ద్వేష్యోఽస్తి |
| | 9 | ఢులు | డలు |
| 190 | 4 | తర్కుర్త్వ | తర్కుర్త్వ |
| | 23 | సౌహార్థ | సౌహార్ద |

2 వ. భాగము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 1 | దామనీ | దాయినీ |
| 2 | 3 | పునాత్వ | పునాత్వ |
| | 8 | శుధ్వతి | శుద్ధ్వతి |
| 4 | 9 | ధర్మరువిద్ధ | ధర్మవిరుద్ధ |
| | 12 | త్పత్యము | శ్చర్యము |
| 5 | 5 | నొక | యొక |
| 6 | 4 | తాత్పత్య | తాత్పర్య |
| 8 | 11 | మెత్నించి | యత్నించు |
| 12 | 2 | శ్రీశుక | శ్రీశుక |
| | 3 | వసిష్ట | వసిష్ఠ |
| | 13 | స్థిరత | స్థిరత వాక్సిద్ధికొఱకు |
| | 20 | వాక్సిద్ధికొరకు | ... |

12. వ పేజీలోని Foot note 11_వ పేజీక్రింద నుండవలెను.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 13 | 2 | మమాల | మతుల |
| | 22 | భిందు | బిందు |
| 14 | 17 | మహాత్ముల | మహాత్ముల |
| 15 | 13 | నల్పుల | నల్పుల |
| 27(17) | 2 | యయపర | యపర |
| 18 | 3 | గృంచి | మృంచి |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 21 | 12 | దుష్టృత | దుష్కృత |
| 22 | 11 | సాయుద్య | సాయుజ్య |
| 23 | 3 | బడనేని | బడేనేని |
| | 6 | కపటి | కపట |
| | 11 | పూజిలు | పూజలు |
| | 14 | వేదాధ్యయ | వేదాధ్యయ |
| 25 | 3 | కంచ | కంచె |
| 26 | 13 | లగుతుండి | లగుచుండి |
| | 19 | విధ్య | విద్య |
| 31 | 2 | స్వేశ్ఛ | స్వేచ్ఛా |
| | 15 | సాఖ | శాఖ |
| 32 | 10 | నాస్త్ర | అస్త్ర |
| 33 | 21 | విదాయక | విధాయక |
| 34 | 17 | సౌహార్ధ | సౌహార్ద |
| 35 | 13 | సాము | సాన |
| 37 | 6 | మరితర | మఱియితర |
| 38 | 1 | స్వరణ | స్మరణ |
| | 7 | యస్త్ర | యస్త |
| | 19 | మొరవిడు | మొఱలిడు |
| 39 | 1 | పార్థితునై | పార్థితుఁడవై |
| | 8 | కుఁడగుట | కుఁడవగుట |
| 39 | 11 | సుఖఃదుఖ | సుఖదుఃఖ |
| | ,, | విషాదముల | విషాదము |
| | 17 | పరిమిదే | పరిమిదమే |
| 40 | 12 | ధనాకార | ధనాధికార |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 40 | 18 | నదియ | యదియ |
| | 19 | కర్త్వ | కర్తృ |
| 41 | 8 | వక్షబట్టి | వక్షతబట్టి |
| 43 | 17 | శీగ్రి | శీఘ్రి |
| | 13 | ర్ఞముదత్యతే | ర్ఞముదచ్యతే |
| 44 | 12 | సద్గోష్టి | సద్గోష్ఠి |
| 45 | 2 | పాలనీర | క్షీరనీర |
| | 10 | వసిష్ట | వసిష్ఠ |
| 46 | 1 | వెర్రి | వెఱ్ఱి |
| 47 | 1 | శతృ | శఘ్రి |
| | 2 | శీర | శీర్ష |



ఓం

శ్రీ గురుభ్యోనమః.

శ్రీ గణేశాయనమః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥

సోదర సోదరీమణులకు విజ్ఞాపన:

నేనీగ్రంథమును, గ్రంథకర్తయను పేరుఁ బడయుటకుగాని ధనార్జన బుద్ధితోగాని వ్రాయలేదు.

పీఠికలో వివరించినటుల బ్రహ్మశ్రీ మొసలకంటి రామారావుగారు శ్రీపరమేశ్వరాజ్ఞనుబట్టి మహాభారతములోని పద్యములు నుపదేశించినపిదప, నచిరకాలములోఁ బ్రత్యక్షముగ స్వప్నోపదేశము ప్రారంభమయినది. అయినను స్వప్నములు సత్యములు కావనెడు లోకవాడుకనుబట్టి, వానిసత్యతనుగూర్చి కొందఱు పండితులగు పెద్దలనడుగ నెవరును దగినసమాధానముఁ జెప్పలేదు. కొందఱు పరిహాసముచేసినారు. మఱికొందఱు స్వప్నములనునమ్మఁదగదని నిరసించినారు. కాని దయామయుఁడగుఁ బరమేశ్వరానుగ్రహముచేత నవి, శ్రీ మహావిష్ణువుయొక్క సగుణబ్రహ్మావతారమగు రామతారకమంత్రముతోఁ బ్రారంభింపబడి సోపానక్రమముగ నుచితకాలములయందు శాస్త్రవిరుద్ధము లేకుండ నిర్గుణ బ్రహ్మోపదేశము వఱకు జీవ

బ్రహ్మైక్య బోధకములయిన మహావాక్యములతోఁగూడ సుమారు నలువది సంవత్సరములలో నుపదేశింపఁబడినవి. ప్రతియుపదేశము వలన మనస్థితికిఁ గొంతమార్పు కలుగుటచేత వీనియందుఁగ్రమముగ సత్యత్వప్రమాణత్వబుద్ధివృద్ధినొంది, తుదకు సంపూర్ణసమ్మకము కలిగినది. ముక్తి హేతువులగునిట్టి స్వప్నోపదేశములొక మనుజునకు మనఃపరిపక్వమునుబట్టి సక్రమముగనుపదేశింపఁబడిన మఱియొకదృష్టాంతమును వినియుండలేదని, యేగ్రంథములోను జదివియుండలేదని కొందఱుపండితులగు పెద్దలు చెప్పుటచేత, నిట్టినిదర్శనము గ్రంథస్థమైయుండుట సర్వజనోపకారమగుననియు, ముందట్టి యుపదేశములు గలవారికి ముందట నాకుఁగలిగిన సంశయములుండవనియు దలఁచి, గ్రంథరచనకుఁ దగినపాండిత్యము లేకపోయినను, "యత్తేశక్తిస్తథా తవచ" యను 25 వ స్వప్నసారముగ 1923 సం॥రం॥న తెలుఁగుభాషలో నాత్మానుభవమను గ్రంథమువ్రాసి యచ్చొత్తించి ప్రచురపఱచినాను. దీనిని అద్వైతశాస్త్రపూర్ణపండితులు ననుభవశాలురునగు బ్రహ్మశ్రీ కే. యస్. రామస్వామిశాస్త్రిగారగు సబ్ జడ్జిగారు చదివి, (They throw a deep and rare insight into our grand and bold Adwaita philosophy) "అతిగంభీరమైన మన యద్వైత వేదాంతశాస్త్రమునకు నీస్వప్నోపదేశములు మిక్కిలి యరుదైనట్టియు నాంతర్యమయినట్టియు బోధనలను, జేయుచున్నవని" యభిప్రాయమిచ్చిరి. మఱికొందఱు పండితులుకూడ నిట్టియభిప్రాయమునే వాక్యబాహుళ్యముతో వ్రాసియున్నారు.

మఱియు నెల్లూరుజిల్లా గూడూరు బోర్డుహైస్కూలు సంస్కృతపండితులగు బ్రహ్మశ్రీ శ్రీమాన్ కాండూర్ కృష్ణమా

చార్యులుగారు "ఆత్మానుభవమును" జదివి స్వప్న సత్యతనుగూర్చి బృహదారణ్యకోపనిషత్తు బ్రహ్మసూత్రములలోనున్న భిన్నాభిప్రాయముల సంక్షేపముగఁ గొంతశాస్త్రచర్చచేసి తుదకు నీక్రింద వ్రాసిన యభిప్రాయము నిచ్చియుండిరి. "తాము నలువదిసంవత్సరముల యనుభవములో మంత్రప్రదానములు శ్లోకప్రదానములు లౌకిక వైదిక ఫలసూచకములునగు స్వప్నములెన్నియో కాంచి, ప్రత్యక్షఫలములఁ బొందినటుల నీగ్రంథము తెలుపుచున్నది. పై వివాదాంశములఁ, బరమపురుషుఁడు తమవంటి విలక్షణజీవాత్మల నధిష్ఠించి తీర్పవలసియుండును గాన, నీపరమరహస్యమగు స్వప్న సత్యతాసిద్ధాంతమును 'దైవంమానుషరూపేణా' యనునట్లు తమచే వెల్లడిచేయించి సర్వజనోపయోగ మొనర్చుచున్నాఁడని తోఁచుచున్నది. ఈగ్రంథము సర్వశక్తికృపచే సదావిజయమునొందుఁగాత" యనివ్రాసిరి—

మఱియు ఆ 1928 వ సంవత్సరములో "స్వప్నలబ్ధాద్వైతబోధ"యనెడు నింగ్లీషుగ్రంథమువ్రాసి యచ్చొత్తించి ప్రచురించినాను. పైనఁజెప్పిన బ్రహ్మశ్రీ కే. యస్. రామస్వామిశాస్త్రిగారును, విద్యాభూషణ వేదాంతరత్న శ్రీమాన్ ఆర్. కొండవిల్లి గోవిందాచార్యస్వామి, C. E. M. R. A. S. గారును, పెన్షన్డ్ డిస్ట్రిక్టుజెడ్జిగారగు బ్రహ్మశ్రీ వావిలాల వెంకటశివావధానులుగారు మఱికొందఱు మహనీయులు చక్కఁగఁబరిశీలించి మంచియభిప్రాయములను వ్రాసినారు.

మొదటఁబ్రచురించిన యాత్మానుభవముయొక్క తెలుఁగు

ప్రతులు సరిపోయినందున “స్వప్నలబ్ధాద్వైతబోధ” యను పేరున నీగ్రంథము వ్రాసినాఁడను.

ఈయుపదేశములలో నేదియు మనుజుని నిత్యకృత్యములకు వ్యాపారములకు నభ్యంతరముగల్గునట్టి పద్ధతులను జెప్పియుండలేదు. “తానుచేయుచున్నాను.” “చేయించుచున్నా” నను నంతఃకరణముయొక్క స్వాభిమానవృత్తులను విడిచి, సర్వకర్తృత్వము భోక్తృత్వము శ్రీపరమేశ్వరునివేయని, తాను శ్రీపరమేశ్వరునికంటె వేఱు కాదని, సదాస్వానుభవపూర్వకముగఁ, బరమేశ్వర తాదాత్మ్యబుద్ధిఁ గలిగియుండుమని బోధించును. ఇట్టిస్వానుభవముతోఁగూడిన తాదాత్మ్యబుద్ధివలన, సృష్టిలో భ్రాంతివశమున వేఱుగాఁ గనిపించు పదార్థములలో నిమిడియున్న జీవచైతన్యము-ప్రత్యగాత్మ-అంతర్యామి బాహ్యాకాశమందున్న బ్రహ్మము నొకటియే యనఁగాఁ దానేకాని యన్యముకాదని సంశయరహితముగ మనస్సులో స్థిరపడును. ఇదియే స్వానుభవము. ఇట్టిస్వానుభవమునే వేదములు, నుపనిషత్తులు, భగవద్గీతలు, నితర వేదాంతగ్రంథములు బోధఁజేయుచున్నవి. ఇదియే పూర్ణాద్వైతబోధ. “ద్వైతముద్దలు తినవద్దు అద్వైతామృతము త్రాగవలసినద” ని ఆఱవ స్వప్నములో శ్రీగురువు బోధించినది యిదియేయని తలఁచెదను.

ఇంతేకాక „అహంబ్రహ్మాస్మి” యను మహావాక్యోపదేశకాలమున నాయింటిలో మఱియొకగదిలో నతియుత్సాహముతోఁ జేయబడుచున్న యమ్మవారిపూజ ప్రదర్శనమువలన లోకములో నాచరణలోనున్న నితరమతములుగూడ సత్యములని తెలియఁజేయును.

గాన నీస్వప్నోపదేశములు బోధించు నద్వైతమునకు నితరమతము లకు శాఖలకుఁ బరస్పరవిరోధ మెంతమాత్రములేదు.

ప్రతిస్వప్నమునకు నేను గ్రహించినయర్థమునుఁ దెలుపుచు వివరణవ్రాసి, యందున కుపనిషత్తులనుండి కొన్నివాక్యములను, భగవద్గీత శ్లోకములసంఖ్యను, బ్రమాణములుగ వ్రాసియున్నాను.

తెలుఁగుగాని ఇంగ్లీషుగాని నేనుబాగుగాఁ జదువుకొన్నవాఁ డనుగానందున స్వప్నోపదేశములకుఁ బూర్వముగాని, పరమందుగాని మతసంబంధమగు గొప్పగ్రంథములేమియుఁ జదువలేదు. అందువలన నీగ్రంథములో విశేషముగఁ దప్పులుండవచ్చును. పండితులగు చదు వరులు దయాపూర్వకముగ వానినినాకుఁ దెలియఁ జేయుటకుఁ బ్రార్థించెదను.

గొప్పపండితులు మహాయోగులు వేదాంతబోధనుగూర్చి వ్రాసినగ్రంథము లనంతమైయుండ, నీవు వ్రాసిన యీగ్రంథము నెవరుచదివెదరని కొందఱు ప్రశ్నఁజేసిరి. నేను పండితుఁడనుగాను, యోగియుఁగాను. అయినను నిట్టిబోధ కలిగెడువారికి మొదటనాకుఁ గలిగిన సందేహ నివారణకొఱకు వ్రాసినాను.. గాని దైవజ్ఞానసంప న్నుఁడనను నభిప్రాయముతోఁగాదు.

మఱియు, ,, నహంమన్యే సువేదేతి " (శ్రుతి) ,, నతత్ర చక్షు ర్గచ్ఛతి నవాగ్గచ్ఛతినో మనోన విద్మోన విజానీమః." (కేనోప నిషత్తు) వాక్యములు చెప్పినటుల అవాఙ్మానస గోచరమైన బ్రహ్మ నుగూర్చి యెవరు పూర్ణముగవ్రాయగలరు ? గీతల 10 అ ములో శ్రీకృష్ణస్వామి, తనమహాత్మ్యముల కంతములేద

మైన కొన్నిటినిమాత్రమే యజ్ఞునకుఁ జెప్పియున్నారు. శ్రీమద్భాగవతముఁ దెనిఁగించిన మహనీయుఁడు బమ్మెర పోతనామాత్యుఁడు గ్రంథప్రారంభములో „భాగవతము దెలిసిపలుకుట చిత్రంబు శూలికైనఁ దమ్మిచూలికైన, విబుధజనులవలన విన్నంతఁ గన్నంతఁ దెలియవచ్చినంతఁ దేటపఱతు," ననీ, „పలికెడిది భాగవతమఁట, పలికించెడివాఁడు రామభద్రుండఁట, నేఁబలికినభవహరమగునఁట, పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా, యని చెప్పి" గ్రంథము రచించినారు. అటులనే „యత్రైశక్తి తథాత్రవచ" యను 25 వ స్వప్నవాక్యసారముగఁ బరబ్రహ్మస్వరూపుఁడయిన శ్రీ గురుకటాక్షముచే గ్రంథము పూర్తి చేసినాఁడను.

మొదటవ్రాసిన తెలుఁగుగ్రంథములోకంటె దీనిలోఁ గొన్ని స్వప్నముల వివరణలు చాలవిపులముగఁ వ్రాయఁబడినవి. ఇంతియగాక నిత్యాభ్యాసమునకొఱ కప్పుడప్పు డుపదేశింపఁబడిన, యేడు మంత్రములయొక్క సముదాయ తాత్పర్యముఁగూడ చివర వ్రాయఁబడినది. మొదటి తెలుఁగుగ్రంథము 500 ప్రతులు, ఇంగ్లీషుగ్రంథము 300 ప్రతులు అద్వైతజ్ఞాన ప్రచారణనిమిత్తము నాకుఁ దెలిసినంతవఱకు మహనీయులకుఁ బంపినాను.








ఓం
శ్రీ గురుభ్యోనమః
శ్రీగణేశాయనమః

## నావంశము - జన్మస్థానము.

నేను నిమిషకవి వెంకయ్యయనెడు వ్యవహారిక నామముగల ఆఱువేల నియోగిశాఖ బ్రాహ్మణుఁడను. హారితస గోత్రికుఁడను. పుణ్యనదియగు గోదావరినదియొక్క శాఖయైన కౌశికతీరమందున్న మోడేకుర్రు గ్రామనివాసుఁడను. నాపూర్వు లెప్పుడెక్కడనుండీగ్రామమునకు వచ్చినది తెలియదు. చిరకాలమునుండి వారీగ్రామ మిరాసిదార్లుగ నుండుటవలనఁ బ్రాచీనులని యెంచవచ్చును. నాపితామహుఁడు నిమిషకవి చలమన్నగారు. తండ్రి వెంకన్నగారు. తల్లి లక్ష్మీదేవమ్మగారు. నేను వీరిరువురకు ద్వితీయ పుత్రుఁడను. 1846 సంవత్సర మాగష్టునెలలో ననఁగాఁ బరాభవనామ సంవత్సర శ్రావణ బహుళ చవితి బుధవారమున జన్మించినాను. బాలపాపచిన్ని (convulsions) మొదలగు కాయిలాలవలన బాల్యావస్థ బహు నికృష్టముగ నుండెను.

ప్రపంచజ్ఞానము తెలియఁదగిన వయస్సురాఁగా, నెల్లప్పుడు పనిఁ జేయుటయందును బెద్దలవలనఁ బురాణములలోని కథలవినుటయందు విశేషాసక్తియుండెడిది. ఆకాలములో నిప్పటివలె ప్రభుత్వ

మునా శేర్పఱచిన పాఠశాలలులేవు. మోడేకుర్రు మిక్కిలి చిన్న గ్రామమవుటచే విశేషవిద్యాప్రాచుర్యముగాని పండితులుగాని లేరు. నాతండ్రిగారుకూడ గొప్పపండితులుకారు. గొప్పజపిత. నిండు దైవ భక్తి, అద్వైతశాస్త్ర పరిజ్ఞానముగలవారు. అందువలన నేను స్వభాష యగు తెలుఁగులోఁగాని మఱియేభాషలోగాని విశేషముగఁ జదివిన వాఁడనుగాను. నాతండ్రిగారు పాలగుమ్మి వెంకప్పగారిని యుపాధ్యాయునిఁగ నేర్పఱచి తెలుగుఁజెప్పించినారు. ఈభాషలో నాకుఁగలిగిన స్వల్పజ్ఞాన మాయనవలనఁ గలిఁగినది.

నాబాల్యావస్థయందు సంభవించిన కొన్నిచిక్కులును, శ్రీపరమేశ్వరానుగ్రహముచేనవి నివారణమయినవిధము నిచటవ్రాసెదను.

నాబాల్యములో నప్పుడప్పుడు దైవమునుగూర్చి స్వప్నములు గలుగుచుండెడివి. రమారమి పండ్రెండు సంవత్సరముల వయస్సున, నొకరాత్రి ముగ్గురుపురుషులు స్వప్నములోఁ గనిపించిరి. మీరెవరని యడుఁగగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులమని ప్రత్యుత్తరమిచ్చినారు. సాధారణ మనుష్యులవలెఁ గనిపించుచుఁ బెద్దదేవులమని యేలచెప్పెదరని తిరిగి ప్రశ్నచేసినాను. తాము పెద్దదేవులమే యని, సామాన్యమనుష్యులము కామని సమాధానము చెప్పినారు. మీనిజస్వరూపములు గనఁబఱచిన, మీమాటలనమ్మెదనని తిరిగి చెప్పినాను. శివకేశవులు వారి నిజస్వరూపము లగుపరచి నన్ను దీవించి యేవో వరములిచ్చినారు. ఇప్పుడవి జ్ఞాపకములేవు. బ్రహ్మ యొకముఖముతోనే స్వరూపమును మాన్పెనుగాని బ్రహ్మ ,, నలువ" యని తెలిసియుండుటచేత నొకముఖముతోఁ గనఁబఱచిన స్వరూపము బ్రహ్మ కాదని నిరాకరించఁగా నాలుగు ముఖములుగల స్వరూ

షమును జూపి నన్ను దీవించెను. నేను వారిముగ్గురకు సాష్టాంగ నమస్కారములు చేసినాను. పిమ్మట వారువెళ్ళినారు.

తఱచు సంభవించు వ్యాధులేకాక, పెద్దపెద్ద త్రాచుపాములు నాకడ్డమువచ్చుట, శ్రీపరమేశ్వరకృపచే వానివలనఁ బ్రమాదము లేకుండఁ దప్పిపోవుటయుఁ, బలుమారు తటస్థించినది.

మోడేకుర్రులో నాబాల్యమందు నివసించినయిల్లు గ్రామమునకు కొంచెముదూరమున నొకపొలములో నుండెను. పొలములో వ్యవసాయమునిమిత్తము చాలాకాలముక్రిందట కట్టఁబడిన యిటికనుయ్యియొకటి యింటికి నేఁబదిగజముల దూరములో నున్నది. నాకు 12 లేక 13 సంవత్సరముల వయస్సులో నొకదినముదయమున వీధి వసారాలో వ్రాసికొనుచుండఁగా నాతల్లిగారు చల్దియన్నము తినుటకు రమ్మని లోపలినుండి పిలిచినారు. మామూలుప్రకారము లోపలికివెళ్ళి పాదప్రక్షాళనఁ జేసుకొనుటకు బదులు విధిపాశమున నూతియొద్దకు వెళ్లితిని. అది నేలబారునుయ్యి. భూమిపైన రక్షణగోడ లేదు. నీరు తోడుకొనుటకు దగ్గఱకువెళ్లఁగా నూతిలో నీరుమట్టమునకు రమారమి మూఁడంగుళముల యెత్తుననున్న యిటికమొలత్రాసు మీఁద నొకపాము (త్రాఁచుకాదు) పడుండి కనుపించినది. నూతిలోఁ బెద్ద వెదురుగడకూడ నున్నది. ఆగడతోఁ బామును జంపతలఁచి దానిమొదటను బాముమెత్తిమీఁదఁబెట్టి నొక్కుచుండఁగా కళ్లు చీకట్లుక్రమ్మి చేతిలోనున్నగడ జారిపోయినది. ఏమియు నగుఁబడుటలేదు. ఇక నిక్కడనిలచితే నూతిలోఁ బడెదను అవతలకువెళ్లుదమని వృత్తికలిగినది. కాని ముందు నుయ్యియున్నది, వెనుక భూమియున్నదని తోఁచలేదు. తిన్నగా నూతివైపునకు మెల్లగా నడచినాను.

మూఁడడుగులు వేయునప్పటికి స్వాధీనముతప్పి నూతిలోఁ బడితిని. అపుడు చూపు కనుపించినదిగాని లాభము లేకపోయినది. నూతిలోఁ బడునపుడు నీరు త్రాఁగఁగూడదని తోఁచినది. భూమినుండి నూతిలో నీటిమట్టముకు రమారమి 7-8 యడుగులు మాత్రమగుటవలనఁ బతనము విశేషదూరముగాదు. నూతిలోఁ బడగానే తొలుత 8-9 అడుగులలోతువఱకు మునిఁగి తేలవేసినది. రెండవమారు 5-6 అడుగులుమునిఁగి తేలవేసినది. మూఁడవసారి 3-4 యడుగులు మాత్రమే మునిఁగి తేలవేసినది. అప్పుడు నాయెడమచేతికి నూతిలోనున్న గెడదొఱకినది. దానిని బట్టుకొనుటవలనఁ దిరిగిమునుఁగుటగలుఁగలేదు. రమారమి మొలలోతు నీటిలో నూతి ధర్మఱాయి కాలికిఁ దగిలినందున దానిమీఁదనిలబడి, గెడనొకచేతితోఁ బట్టుకొనియున్నాను. నూతిలోనున్న పాము విశేష నీటికదలికచేఁ దఱచు నామీఁదకు వచ్చుచున్నందున రెండవచేతితోదానిని త్రోసివేయుచుఁ బ్రాణరక్షణ జేసుకొనుచుంటిని. గాని నేను దానిలోఁ బడుటెవరుజూడలేదు. మాతండ్రిగారు గ్రామములో లేరు. మాతల్లిగారింటిలో నున్నారు. ఈప్రమాదము సంగతి తెలియదు. భూమిపైకి వచ్చుటెలాగని నేనాలోచించుచుండఁగా నదృష్టవశమున నొక యరఘంటలో గంధము తిరుపతి యను కాపు నూతిసమీపమునుండి వెళ్ళుచుండఁగా నడుగులచప్పుడు విని నూతిలోనుంచి బొబ్బలుపెట్టినాను. అతను వచ్చిచూచి నాతల్లిగారి కీసంగతిఁజెప్పి నిచ్చెన మొదలగువానిని దెచ్చి నూతిలోనికి వెయ్యగా నేను పైకివచ్చినాను. ఈప్రకారము పరమేశ్వరుఁడు గొప్ప యాపదనుండి నన్ను రక్షించెను. (వివరణచూడుము.)

మఱికొన్ని సంవత్సరముల కనగా 18౬౩ సంవత్సరములో ఇంగ్లీషు చదువుకొనుటకుఁ గాకినాడ నా మేనమామగారగు బాలాం

త్రపు శ్రీరాములుగారింటికి నన్ను మాతామహుడు వీర్రాజుగారు తీసుకు వెళ్లినారు. అక్కడ త్రాచుపాములవలన పలుమారు చిక్కులు తటస్థించినవి. వాని నన్నిటిని వివరించనవసరము లేదు. ఒకరోజు సాయంకాలము గోధూళిసమయమున బజారువీధినుండి యొకవిశాలమైన వీధిలోకి మరలి వెళ్లుచుంటిని. శరీరస్వస్థత లేనందున క్రిందుజూడక బహునెమ్మదిగా నడుచుచుంటిని. నాపాదములకు రమారమీ రెండడుగుల దూరమున క్రింద నేదో తట్టినటులు జప్పుడు వినబడి, చూచేవఱకు రమారమి 8 యడుగులు పొడవు యందుకుదగిన లావుగలనొక త్రాచుపాము చుట్టజుట్టుకొని భూమిపైన నొకగజ మెత్తున బడగవిప్పి యతిభయంకరముగ గనుపించినది. దానిని జూచువఱకు నిశ్చేష్టుడనై నిలబడిపోయినాను. పాము పడగవిప్పుకొని నిలబడినది గాని యేమియు జేయలేదు. ఈస్థితిని రమారమి యిఱువది మినిట్లకాలము నిలబడి జ్ఞప్తి దెచ్చుకొని మెల్లగా వెనుకకు నడచినాను. పాము తలవాల్చుకొని వెళ్లిపోయినది. ఈప్రకార మొకమారు తణుకులోను, మఱియొకమారు సీతానగరములోను దటస్థించినది. ఎప్పుడును సర్పదష్టము కాలేదు. "శివునియాజ్ఞలేక చీమైన గుట్టదను" లోకోక్తి రుజువైనది.

ట్రెజరి డిప్యూటీకలెక్టరు కాదంబరి జగన్నాథముగారు కాకినాడలో 1883 సంవత్సరమున శ్రీ పిఠాపురము రాజావారి కాలేజీ నేర్పరచినపుడు దానిలో బ్రవేశించి 1887 యేప్రిల్ నెలలో ప్రథమ మెట్రిక్యులేటుగా ప్యాసైనాను. పరీక్ష ప్యాసైనవెంటనే యహర్నిశము ఎడతెగని తలనొప్పియు, యేమాత్రమాహారము దినినను గడుపునొప్పి ప్రారంభించి మూడు సంవత్సరములుపైగా బాధించినది. అవుషధసేవవలన గుణముకలుగలేదు. నాతండ్రిగారు

విశేషదైవభక్తిగలవారు గాన వ్యాధినివారణకొఱకు సూర్యారాధన జేయుమని సలహానిచ్చి, యింద్రగంటి సుబ్బావధానులుగారిని నాకు సూర్యారాధనక్రమము నేర్పుట కేర్పాటుచేసినారు. వ్యాధిపీడ, నీరసమువలన కొన్ని దినములవఱకు సూర్యారాధన జేయుటకు నా కిష్టముగలుగలేదు. ఒక దినముదయమున నతిబలవంతముమీఁద నొక గదిలో సుబ్బావధానులుగారియొద్దఁ గూర్చుంటిని. ఆదినమున వెనుకటికంటె మిక్కిలి బద్ధకముగాను నీరసముగాను నుండెను. సుబ్బావధానులుగారు పూజాద్రవ్యములు తెచ్చి సూర్యయంత్రము వేసి పూజనారంభించుమని చెప్పఁగా విశేషకోపముగలిగి పూజాద్రవ్యముల నుంచిన బల్లెము గిరాటువేసి యంత్రమును జెరిపి గోడకుఁ జేర్లబడి నిండఁగప్పుకొని కూర్చుంటిని. సుబ్బావధానులుగారు మిక్కిలి శాంతస్వభావము గలవారగుటచేత నేమియు ననక కొంతసేపటికి "నీచేయునది నీక్షేమముకొఱకే కాదా" యని నెమ్మదిగా బలికెను. ఈమాటలు నాకమృత తుల్యముగ వినుపించి, నాదుస్థితిని, దురాగ్రహముతో నేజేసిన పని, నాయన చెప్పినమాటల యర్థము, పూర్తిగా నాలోచించుకొని పూజాద్రవ్యములతోఁ బల్లెమును గిరాటువేయుట, యంత్రమును జెరిపివేయుట, గొప్పతప్పని గ్రహించి క్షమాపణ చెప్పి, యంతటనుంచి శ్రద్ధగా నారాధన చేసెదనని పూజ ప్రారంభించితిని. సూర్యారాధన మంత్రములలో మొదట శరీరపీడలను దొలగించుటకు ప్రార్థనామంత్రమున్నది. విశేషబాధపడుచున్నను నేనుచేయు స్వల్పపూజ కాయిలా నివారణకొఱకు వినియోగపడ కూడదని తలఁచి యామంత్రమును దీసివేయుమని కోరగా, నాయన యంగీకరించెను. అంతటనుంచి మిక్కిలి భక్తిశ్రద్ధలతోఁ ద్రిచవిధానమున సూర్యారాధన కొన్ని సంవత్సరములు విడువక చేసినాను.

ఒకసంవత్సరమునకు శరీరస్వస్థత కలిగినది. ఈతరుణములో నొక సన్యాసి పెదతిరుమలనుండి శ్రీ వెంకటేశ్వర మంత్రమును కవచమును బంపినారు. కాకినాడలో నీమంత్రముల నుపదేశించువారు లేక శ్రీ వెంకటేశ్వరస్వామినే గురువుగా నెంచుకొని మంత్ర పురశ్చరణ ప్రారంభించినాను. నాటిరాత్రి కలిగిన స్వప్న మేమనగా "నేను మఱు నాఁడుదయమున లేచువరకు నాయరిచేతులలో లక్ష్మీనారాయణ విగ్రహముల సహజరేఖలు కనుపించినట్లు, యీ మంత్రపురశ్చరణ ఫలితముగ నాకు డిస్ట్రిక్టు మునసబుహోదా లభించునట్లు స్వప్నమైనది. (వివరణ 2 పేరా చూడుము.)

పిమ్మట వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్ర ముపదేశమొంది, కొంతకాలము జపించి గురువుగారి యాజ్ఞనొంది విడిచిపెట్టినాను.

పైనజెప్పినటుల ద్వైతబుద్ధితో నుదయసాయంకాలములు శక్తి కొలది మంత్రపురశ్చరణ చేయుటమాత్రమే జరిగినది. కాని దైవ జ్ఞానమునుగూర్చి ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత మతసాంప్రదాయముల విచారణ లభించలేదు.

1872 లేక 1873 సంవత్సరములో నొకసాయంతనము విజన, స్థలమందు నొంటరిగా శ్రీవెంకటేశ్వరమంత్ర పురశ్చరణ చేయుచుండ, ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతములలో నేది సత్యమని నాకు శంకకలిగినది. ఆవెంటనే విద్యుత్కాంతి కంటె నెక్కువైన గాంత్రికలిగి చంద్రకాంతికంటె నెక్కువ చల్లనై, భూమిమొద లాకాశమువరకు నఖండాకారముగ నావరించియున్న మహాతేజస్సు నాకిరువదిగజముల దూరములోఁ గనుపించి, క్రమముగా సమీపించి నన్నావరించినది. నేనామహాతేజస్సులో నొకటి రెండు నిమిషము లున్నపిమ్మట, నేమి జరుగునో చూతమని మనస్సులోఁ దలచితిని. వెంటనే తేజస్సదృశ్య

మైనది. జపమాల త్రిప్పలేనంత నీరసమును గలిగినది. జపముఁ జాలించి మెల్లఁగ నింటిలోనికివెళ్లి భోజనము జేసి పరుంటిని. ఆ రాత్రి బహుసుఖముగా నిద్రించి మఱిదినముదయమున మామూలు కంటె నెక్కుడుసుఖముగ లేచితిని. ఈప్రదర్శనమునుబట్టి పరమేశ్వరుఁడు జ్యోతిస్స్వరూపమని, యద్వితీయమై సృష్టిలోపలను వెలుపలను బూర్ణముగ నిండియుండునని, యందువలన బ్రహ్మ యొకఁడేయను నద్వైతవాదము సత్యమని గ్రహించితిని.

1874 సంవత్సర మేప్రిల్ నెలలో ననగా చైత్రశుద్ధ చతుర్దశి రోజున నాతండ్రిగారు స్వర్గస్థులైరి. అప్పటినుండి జపము పూజయు పూర్వమువలె నిర్విఘ్నముగ జరుగలేదు. ఒకదినముదయమునఁ బాలకిమీఁదఁ గాకినాడనుండి యమలాపురము వెళ్లుచుంటిని. ద్రాక్షారామ దాటిన పిమ్మట కోటిఫలిలో నాగి శ్రీసోమేశ్వరస్వామికి నభిషేకము జేయుదలంపు కలిగి బోయీలతోఁ జెప్పఁగాఁ దిన్నఁగా నమలాపురము వెళ్లుట కభిప్రాయమిచ్చిరి. కోటిఫలి చేరినపిమ్మట నాలోచించవచ్చునని తలఁచి, చదువుకొనుచుండ, గొంచెము నిద్రమకత కలిగినది. ఆమకతలో శరీరమంతయు భస్మమును, కంఠమందు రుద్రాక్షమాలలను, ధరించిన నొకబ్రాహ్మణుఁడు స్వప్నములో దర్శనమిచ్చి చిన్న విభూతిముక్కను నాకుడిహస్తములో నుంచి చేతినిమూసి వెళ్లినటుల గనుపించినది. నాకుడిహస్తము బరువుగదోచినది. నేను కోటిఫలిలో నాగి యభిషేకముచేయుట దైవసంకల్పమని ప్రయాణము నిలిపి నిండుభక్తితో నభిషేకము చేసితిని.

1882 సంవత్సరములోఁ గాకినాడ కలక్టరాఫీసులో హెడ్డు అకౌంటెంటుగానుంటిని. ఆపని మిక్కిలి క్రొత్తగానుండెను.

కలక్టరుగారి జీతములోఁ గొంత ముందు నెల బిల్లులో మినహాయించుమని పైయఫీసరు నొద్దనుండి చిన్న కాగితపుముక్క వచ్చినది. దానిని యాపనిచేయు గుమాస్తాకు బంపినాను. అతనా ముక్కను సరిగాఁజూడక చిత్తుకాగితముల బుట్టలోఁ బడవేసెను. ఆ నెలాఖరు దినము రాత్రి రమారమి 12 గంటలకు స్వప్నములో నొక పురుషుఁడు కనుపించి యాముక్కను వెదకి మరిదినమున వ్రాయబడు బిల్లులో సవరణచేయుమని చెప్పెను. నేను వెంటనే లేచి జ్ఞాపకార్థ మాసంగతి కాగితముమీద వ్రాసికొని తిరిగి నిద్రించినాను. మరి దిన ముదయమున మామూలుకంటె వేగముగఁ గచేరికివెళ్లి యా ముక్కనుగూర్చి వెదకఁగాఁ జిత్తుకాగితముల బుట్టలో దొరికినది. దానిప్రకారము బిల్లు తయారుచేయించి ట్రెజరీ డిప్యూటీకల క్టరుగారి సంతకముకొరకు బంపినాను. ఆయన నన్ను బిలిపించి “మినహాయించుమని చెప్పిన మొత్తమును దగ్గించినారా?” యని యడిగి సంతకముచేసినారు. కలక్టరుగారుకూడ నన్ను బిలిపించి యడిగినారు. శ్రీపరమేశ్వరుని కృపచే నారోజున నిద్దరు పైఆఫీసర్ల దగ్గర నవమానము తప్పినది. శ్రీపరమేశ్వరుఁడు ప్రతిజీవుని బ్రతి క్షణము ప్రతికార్యమునను దప్పక రక్షించుచుండును, కాని మనుజుఁడవిద్యచేఁ గప్పబడి, రజోగుణ ప్రేరితుఁడై, పాపభూతమైన కామమువలన దనయథాస్థితిని మరచి గర్వితుఁడై తానే కర్తయని తలంచుచుండును.

1881 సంవత్సరమునుండి 1887 సంవత్సరమువరకు గృహసంబంధమగు చిక్కులచేతఁ గ్రమముగా జపనిష్ఠ తగ్గినది. 1886 సంవత్సరమున నాపెద్దల్లుఁడు, 1887 లో నాయన్నగారు చనిపోయిరి.

మరికొన్ని చిక్కులుగూడ గలిగినవి. విశేషవిచారముగనున్న నీసమయమునఁ గాకినాడవాస్తవ్యుఁడు మొసలగంటి రామారావుగారొక దినము సాయంకాలమున నాయింటికివచ్చి శ్రీ పరమేశ్వరుఁడు నాతోఁ జెప్పుమని కొన్ని వచనములు చెప్పినందువలన తాను వచ్చితిననియు, ఆవచనములలో నాకు మంచిరోజులు రానైయున్నవనియు, తాను పరమేశ్వరుఁడు స్వయముగా నుపదేశించుటకుఁ దగినస్థితికి నేనురాగానే తానే యుపదేశించెదననియు, యంతవఱకు ప్రతిదినము పఠించుటకుఁ గొన్ని పద్యములను నాకుపదేశించుమని నాజ్ఞ తమకు నిచ్చినట్లుజెప్పి నన్ను దనతో దీసుకవెళ్లినారు. మధ్యమార్గమున వర్షమును మమ్ము నిర్మలోదకముతో స్నానమొనరింపించినది. రామారావుగారు తనయింటివద్ద నాకు ధౌతవస్త్రములనిచ్చి యిూక్రింద వివరించిన ధ్యానపద్యముల నుపదేశించిరి. ఈపద్యములను ప్రతి దినము ప్రాతఃకాలమున బఠించుచున్నాను.

శ్రీ మదాంధ్రమహాభారతము.

అను శాశనిక పర్వము.

వ॥ అని యిట్లు భీష్ముం డుమామహేశ్వరసంవాదంబను బుణ్యకథజెప్పిన ధర్మజుండు సోదరసహితంబుగా బ్రమోదరసభరితుండై,

సీ॥ అతనికి బ్రీణమిల్లి యనఘ పరప్రాప్తి
యెద్దాన సమకూరు నెరుగజెప్పు।
మనిన నతండు నారాయణధ్యాన పూజా
స్తుతి తత్కథా శ్రవణనిరతి।

యమ్మేలుగావించు నధిప విద్వజ్జన
సంరక్షణము కల్మషముల బాపు।
వేశ్యయొక్కతె తొల్లి విద్వాంసు నొకరిని
మృచ్ఛని తలవరుల్ మోవజూచి ॥

గీ॥ యితడు మావాడు మీరిది యేటికాగ।
డంబు జేసెదరని మోక్షణంబుచేసి।
యాసుకృతమున బ్రాహ్మణియైజనించె।
దగగ నర్చింపు మీవు విద్వజ్జనముల॥

వ॥ అనిన విని యుధిష్ఠిరుండు దారిద్ర్య వ్యాధి శోకంబులకు శాంతి సంపాదింపంజాలు జపంబెయ్యది జెప్పవే యనుటయు, నని మిషనదీనందనుండు బ్రహ్మ విష్ణుమహేశ్వరులను, వినాయక విశాఖ వహ్ని వాయు చంద్రాదిత్యులను, శక్ర వరుణ యమ కుబేరులను, సురభి సముద్రంబులను, గంగాది మహానదులను, మరు దశ్వినీ వసు రుద్రాది దేవతలను, పితృదేవతలను, వాల ఖిల్యాది సిద్ధులను, వేద వ్యాస వాల్మీకి నారదాగస్త్య గౌతమ కశ్యప కణ్వాది మహామును లను, రంభాదప్సరస్త్రీలను, ధర్మ తపస్సత్యంబులను, నహోరాత్రం బులను, దారాగ్రహంబులను, నశ్విన్యాదితారకంబులను, మాసర్తు వత్సరంబులను, వైనతేయ కాద్రవేయులను, గాశీక్షేత్ర కురుక్షేత్రాది పుణ్యక్షేత్రంబులను, నైమిశారణ్య దండకారణ్యాది పుణ్యారణ్యంబు లను, మేరు హిమవత్కైలాసాది పర్వత శైలంబులను, దిజ్నాభో భూములను, బుణ్య భూరుహంబులను, భూసురులను, జక్రవర్తులను, రాజులను, బరమభక్తిం దలంచి కీర్తించి నమస్కరించి, యీసమూ హంబంతయు నన్నురక్షించి, నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి

పరమానందంబునభివందన పూర్వకముగానిచ్చ్ంగావుతమని యిచ్చం గోరి యోన్నమో భగవతే వాసుదేవాయ, నమః పురుషోత్తమాయ, నమస్సర్వలోకగురవే, నమస్సర్వలోక సాక్షిణే, నమస్సర్వలోకపిత్రే, నమస్సర్వలోక పితామహాయ, నమస్సర్వలోక ప్రపితామహాయ, నమస్సర్వలోక ప్రధానాయ, నమస్సర్వలోకేశ్వరాయ, నమస్సర్వ లోకవిశిష్టాయ, నమస్సర్వలోక సుఖప్రదాయ, నమస్సర్వలోకకర్త్రే, నమస్సర్వలోక భర్త్రే నమస్సర్వలోక హర్త్రే, నమస్సర్వలోక నిధయె, నమస్సర్వలోక నిధానాయ, నమస్సర్వలోకహితాయ, నమస్సర్వలోక హితకరాయ, నమస్సర్వలోకోద్భవాయ, నమస్సర్వలోకోద్భవకరాయ, నమోవిష్ణవే ప్రభవిష్ణవే యని పఠించుబ మహాజపంబు.

క॥ పాపంబులను భయంబుల।
నాపదలంబాయు నిమ్మహాజపమున ధా।
త్రీపాలోత్తమ శుభములు।
ప్రాప్తించును ధర్మ తత్పరత సిద్ధించున్॥

ఓం తత్సత్.





# దివ్యస్వప్న సత్యత.



ఈగ్రంథముయొక్క యంశము నాకప్పుడప్పుడు కలిగిన దైవజ్ఞాన బోధకములగు స్వప్నములుఁ గాన దొలుత స్వప్నసత్యతను గూర్చిఁ గొంత యోచించవలసియున్నది.

లోకవ్యవహారమునుబట్టి స్వప్నములు, సామాన్యముగ సత్యములుకానందున, వానినిగూర్చి వ్రాసిన నీగ్రంథమునకు సత్యపరిపాటియుండదని కొందరు తలంచెదరు. కాని "మిథ్యేతిమన్యతే స్వప్నం జాగరం సత్యమీక్షతే, బుద్ధేర్విలాస వైచిత్ర్యం అహో అజ్ఞ జనాజ్ఞతా" యని శ్రీ శంకరులవారు చెప్పినటుల జాగ్రత్స్వప్నములు రెండు సత్యతయందు సమానములేయైనను, మనస్సు జాగ్రదవస్థలోఁ గర్మేంద్రియములతోఁ గూడి మనోమయకోశములోను, స్వప్నావస్థలో జ్ఞానేంద్రియములతోఁగూడి విజ్ఞానమయకోశములో నుండును. కాన తత్త్వదర్శినులగు మహాపురుషులు విజ్ఞానమయకోశములో నుపదేశము లొనర్చిరి. ఆయుపదేశములు మహామన్త్రములు, మహావాక్యములు, ఛందోబద్ధమైన శ్లోకములుగను, యితరవాక్యములుగ నుండుటయేగాక, దైవసంపద్గుణములు పూర్ణాద్వైతబోధకములై యుండుటవలన, వాని సత్యతనుగూర్చి యనుమానమించుకయులేదు. అంగనాలింగనాది స్వప్నములలోఁ దచ్ఛిహ్నా

ములు జాగ్రదవస్థలోఁ బ్రత్యక్షముగఁ గనుపించుచుండుట లోకానుభవమే. ఇంతేకాక రోగపీడితులగు వారిలోఁ గొందరికి సేవించవలసిన యౌషధములను స్వప్నములలో దెలుపుటయు, వానిసేవవలన వెంటనే రోగనివారణ మగుటయుఁ దరుచుగ జూచుచున్నారము.

బ్రహ్మజ్ఞానమునుగూర్చి స్వప్నములలోని యుపదేశములు శశశృంగములవలె కేవలము లేనివైనచో, పతాంజలి ఋషియోగ సూత్రములలో "స్వప్ననిద్రాజ్ఞానావలంబనంవా" యను సూత్రము వ్రాసియుండరు. అనాదినుండి సకృత్ గా స్వప్నోపదేశములున్నవని, వానినిఁబడసినవారు వెల్లడిచేయక గుప్తపరచియుందురని తలంచవలసియున్నది.

మరిన్ని క్రైస్థుమతవేదమైన, బైబిలులో (Bible New Testament, Mathew, Chapter 1, Para 20.) దేవునియాజ్ఞచేత నొక మహాపురుషుఁడు (Angel) 'జీసస్సు' తండ్రియగు 'జోసఫ్కు' స్వప్నములో దర్శనమిచ్చి "మేరీ" యను నామెను భార్యగా స్వీకరించుమని, యామెగర్భమందానందమూర్తి (Holy-Ghost) యున్నాఁడని చెప్పెనని, 2 అధ్యాయః 12 పేరాలో జీసస్సు శిశువును జూడ వచ్చినఁ దూర్పుదేశస్థులకు "రాజైన హేరడ్డును తిరిగి చూడక వెళ్ళుము" ని స్వప్నములో నాజ్ఞాపించెనని, 13 పేరాలో "జీసస్సు శిశువును హేరడ్డు చంపఁదలఁచెను గాన శిశువుతో నీజిప్టుదేశము పారిపొమ్ము" ని, 19-20 పేరాలలో, "హేరడ్డురాజు చనిపోయినందున శిశువును తల్లిని యిజ్రాయెలు దేశము, తీసుకు వెళ్లుము" ని తండ్రియగు జోసఫ్కు స్వప్నములలోఁ జెప్పినటుల వివరించబడినది. ఈస్వప్నములేకాంశము అనఁగా, జీసస్సు శిశువుయొక్క రక్షణనుగూర్చి వేరువేరు కాలముల

యందుఁ గలిగినవి. కాని యొకేకాలమందుఁ గలిగినవికావు. క్రైస్తవులీస్వప్నములను నిండు సత్యములుగ స్వీకరించిరి.

మహాభారతము, బ్రహ్మవిద్యాదర్పణము మొదలగు గ్రంథములలోఁ బారమార్థిక స్వప్నముల సత్యతనుగూర్చి దృష్టాంతములతోఁ జెప్పబడినది. ఇంతేగాక "బృ-3-10" నతత్రరథాః నరథయోగానపన్థానోభవన్తి. అథరథాన్ రథయోగాన్పథ సృజతే॥ "సహికర్తా" బ్ర. సూ. 3 అ 2 పా. 1వ సూ. "సన్ధ్యే సృష్టిరాహహి" అను శ్రుతి సూత్రములచే స్వప్నపదార్థము లితరపదార్థములవలె సర్వజనగోచరములు గాకుండునట్లును, ఆయా యాత్మలకు మాత్ర మనుభూతములగునట్లును, ఈశ్వర సృష్టములుగాఁ బ్రతిపాదింపఁబడుటచే స్వప్నము సత్యమని కొందరివాదమని బ్రహ్మశ్రీ శ్రీమాన్ కాండూర్ కృష్ణమాచార్యులుగారను సంస్కృత పండితు లభిప్రాయమిచ్చినారు.

శ్రీరామకృష్ణ పరమహంసచరిత్ర 393 వ పుటలో రామచంద్రుఁడను నొకమనుజునకు స్వప్నములో శ్రీరామకృష్ణ పరమహంసరూపమున నొక మహాపురుషుఁడు కనుపించి స్నానముచేయుమని, పిమ్మట మహామంత్రమొకటి ఆతనిచెవిలో నుపదేశించి ప్రతిదినమున కొన్ని పర్యాయములు జపముచేయుమని చెప్పినటులను, దరిమిలాను శ్రీరామకృష్ణ పరమహంస యీసంగతివిని స్వప్నములో నుపదేశము మంచియదృష్టమని చెప్పినటుల వివరింపఁ బడినది.

ఈకారణములవలన నీగ్రంథములో వివరించిన స్వప్నములు దైవజ్ఞాన బోధకములని, మహాపురుషుల యుపదేశములని నమ్మెదను.

---



# స్వప్నోపదేశములు.

శ్రీ గణేశాయనమః

శ్లో॥ ఓం గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః।
గురు స్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ విశ్వోద్భవస్థితిలయాదిషు హేతుమేకం।
మాయాశ్రయం విగతమాయమచింత్యమూర్తిం।
ఆనందసాంద్రమమలం నిజబోధరూపం।
సీతాపతిం విదిత తత్వమహం భజామి॥

పీఠికలో జెప్పిన బద్యములఁ బఠన ప్రారంభించిన కొలది మాసములకు నేను కాకినాడ సబుమేజస్ట్రీటుగా నున్న కాలములో నొకరాత్రి నీక్రింద వివరించిన స్వప్నములో బ్రథమ మంత్రోపదేశమైనది.

— 1 స్వప్నము —

డిస్ట్రిక్టు మేజస్ట్రీటు నాయందసూయగా నుండెను. ఆయన కోర్టులో నొక మనిషి నాపైన లంచపు ఫిర్యాదు చేసెను. అది కేవల మబద్ధపు ఫిర్యాదగుటచేత నేను నిర్లక్ష్యముగ నుంటిని. విచారణ ప్రారంభమునకుఁ బూర్వము చాలా గొప్ప దివ్యమైన చావిడిలోనికి వెళ్లితిని. దానిలో నెత్తైన గుండ్రని బల్లచుట్టూ కుర్చీలు (వానిలో నొకటి చాలా పెద్ద మంచికుర్చి) యమర్చబడి

యున్నవి. పెద్దకుర్చీని ఖాళీగానుంచి తక్కిన కుర్చీలలో నెవరెవరో కూర్చుని యుండిరి. నేనుకూడ నొకకుర్చీలో కూర్చుని వారితోఁ మాటలాడుచుండగాఁ దెల్లని పెదగెడ్డము, జటలుగానున్న శిరోజములతోఁ గాషాయవస్త్రములు ధరించి పొడవు లావుగానున్న నొకమహాపురుషుడు విచ్చేసి పెద్దకుర్చీలోఁ గూర్చుని నన్నుఁ దన వద్దకుఁ బిలిచి "నీమీదవచ్చిన లంచపు ఫిర్యాదునుగూర్చి భయపడుచున్నావు. ఈమంత్రపురశ్చరణ చెయ్యి. నీకు స్వేచ్ఛకలుగునని" చెప్పి "రామ శ్రీరామ రామ" యనుమంత్ర ముపదేశించెను. వెంటనే నేనాయన కుర్చీవద్దనే కూర్చుని జపమారంభించితిని. గురువుగారు, తక్కినవారు అక్కడనుండెప్పుడు వెళ్ళినది తెలియదు. తరువాతఁ గొన్నిదినములకు నాపైనవచ్చిన ఫిర్యాదు విచారణ నిమిత్తము డిస్ట్రిక్టు మేజస్ట్రీటుకోర్టుకు వెళ్ళితిని. మేజస్ట్రీటు విచారణ ప్రారంభించెనుగాని ఫిర్యాదులేదు. సాక్ష్యములేదు.. నాయందాయనకున్న నసూయతనుబట్టి నన్నుగురించి గవర్నమెంటుకు రిపోర్టుచేసెదనని చెప్పెను. "గవర్నమెంటువారు నన్ను నిర్దోషిగా నెంచి, యనవసరముగ రిపోర్టు చేసినందుకు నిన్నుఁ జీవాట్లు వేయుదురని తిరస్కార ప్రత్యుత్తరమిచ్చి కోర్టుగుమ్మముదాటి యివతలకువచ్చినాను." నిద్ర మెలకువవచ్చినది.

ఉపదేశించిన మంత్రము బాగా జ్ఞాపకమున్నది. కాని "శ్రీ" కారము మంత్రారంభమున గాక మధ్యనుండుటచేత సంశయముగలిగి వెంటనే పురశ్చరణ ప్రారంభించలేను. కొద్దిదినములలోఁ గస్తూరి శివశంకర శాస్త్రిగారి నీసంశయమునుగూర్చి యడిగినాను. మొదటి "రామ" శబ్దము రామునివారెనని, మధ్యనున్న

“శ్రీరామ” శబ్దములు లక్ష్మణ శత్రుఘ్నులను, మూడవ “రామ” నామము భరతుని దెలియజేయునని, లక్ష్మణశత్రుఘ్నులు రెండవ భార్యయగు సుమిత్రకుఁ గవలపుత్రులగుటచే, వారిని మంత్రమధ్య మునంచుట క్రమమని, లోకనాయకయె దప్పుగానుండునని బోధించిరి. అప్పటినుండి నేనామంత్ర పురశ్చరణ భక్తిశ్రద్ధలతోఁ జేయుచుంటిని. వివరణ చూడుము.

## —♦ 2 స్వప్నము ♦—

పై స్వప్నమున కచిరకాలములో నీరెండవస్వప్నము కలిగినది.

నేను బహుభక్తిశ్రద్ధలతో రామమంత్రజపము చేయుచుంటిని. జపకాలమందు మనస్సు మిక్కిలి చలించుచుండుటచేత మనస్థిరత్వము కలుగఁజేయుమని యొకదినమునఁ బ్రార్థించితిని. ఆరాత్రి రెండవస్వప్నము కలిగినది.

“నేను నాయింటివసారాలోఁ గూర్చునియుండఁగా నొక బ్రాహ్మణుఁడు వచ్చి నాదగ్గిరఁ గూర్చుండెను. దొడ్లో పాతనుయ్యొకటిన్ని, క్రొత్తనుయ్యొకటిన్ని యున్నవి. నాతల్లిగారు నీటికొరకు వచ్చి పాతనూతి నీరుకంటెఁ గ్రొత్తనూతి నీరు బాగున్నదని చెప్పి క్రొత్తనూతిలో నీరు తోడుకొనుచుండెను. నాదగ్గిరఁ గూర్చుని యున్న బ్రాహ్మణుఁడు “సప్తమహాఋషులను యేకముచేసి చూడుము, మనస్సు నిలుస్తున్నదని” చెప్పెను. నాకు వెంటనే మెలకువ వచ్చినది.

ఈ స్వప్నార్థమును గూర్చి పారుపల్లి లక్ష్మీనారాయణ గారిని యడుగఁగా సప్తమహాఋషులు మూలాధార స్వాధిష్ఠాన,

మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారచక్రము లధిష్టాన దేవతలగు విఘ్నేశ్వర, బ్రహ్మ, విష్ణు, రుద్ర, శివ, సదాశివ, పరమ గురులని, వారి యుపాసనయనఁగా నజపామంత్రమును ప్రాతఃకాల మందు బఠించుమని యామంత్రోపదేశము చేసిరి. పిమ్మట 3-4 సంవత్సరములకు నిక నీమంత్ర జపమవసరములేదని మానుపించిరి. వివరణ చూడుము.

—♦ 3 స్వప్నము ♦—

రెండవస్వప్నము దరిమిలాను గొన్నిమాసములకుఁ "బుత్రుడు కలుగుతాడు, ప్రమోషను అవుతున్నది, స్వస్వరూపదర్శన మవుతున్నది" యని స్వప్నమైనది. ఈస్వప్న ఫలితములను గూర్చి నాకు సంశయ నివృత్తికొరకుఁ గాబోలు గ్రమముగాఁ గొన్నిదిన ములవరకీ స్వప్నమే కలిగినది. పుత్రోత్పత్తికొరకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, విఘ్నేశ్వరులఁగూడ నారాధనచేయుమని స్వప్నములో నాజ్ఞాపించినందున, లక్ష్మీనారాయణగారివలన గణపతి మంత్రము, శివపంచాక్షరి మంత్రముల నుపదేశము నొంది జపముచేసినాను. ఏకారణమువలన గాని జపము సరిగా జరగనపుడు నాయశ్రద్ధను గూర్చి స్వప్నములలో మందలింపు గలుగుచుండెను. వివరణ చూడుము.

—♦ 4 స్వప్నము ♦—

ఒకరాత్రి స్వప్నమందు భగవద్గీతలఁ జదువుమని యాజ్ఞని చ్చిరి. నాకుబోధకాదని ప్రార్థించఁగా "జదువ బోధయగునని" స్వప్నములోఁ బ్రత్యుత్తరము కలిగెను. ప్రతిశ్లోకమునకుఁ దెనుగర్థము

గల నొకపుస్తకమును సంపాదించి చదివితిని. కాని సరిగా బోధ కానందున, తిరిగీ చదువుమని యాజ్ఞనిచ్చిరి. తిరిగీ చదివినను సందేహనివృత్తి కాలేదు. స్వప్నగురువు తానేజెప్పెదనని స్వప్నములో నుడివెను. నేను తృప్తినొంది యట్టియుపదేశ సమయముకొరకుఁ గని పెట్టి యుంటిని. ఉపదేశపూర్తికొరకు ముందు చూడుము.

—♦ 5 స్వప్నము ♦—

ఆకాలములో ననగా 1887 సంవత్సమురలో విష్ణు సహస్రి నామావళి పలుమారు స్వప్నములలో నుపదేశించిరి. దానిని ప్రతి దినము స్నానకాలమందుఁ బఠించెదను. ఉపనిషత్తులు చదువుమని కూడ 2-3 స్వప్నములలో నాజ్ఞనిచ్చిరి. ఒకరాత్రి స్వప్నములో "అజ్ఞానాద్భాసతే సర్వం త్వయిరజ్జౌ భుజంగవత్। ప్రజ్ఞా నాల్లీయతేసర్వం త్వయి రజ్జౌ భుజంగవత్" యను శ్లోకము నుపదేశించి రాత్రి 12 ఘంటలు మొదలుదయము 5 ఘంటలవరకు స్వప్నములో దాని యర్థమును బోధించిరి. కాని మెలకువ వచ్చేవరకు శ్లోకము మాత్రము జ్ఞాపకమున్నది. అర్థము మరచిపోయితిని. వివరణ చూడుము.

—♦ 6 స్వప్నము ♦—

పైస్వప్నమునకుఁ గొలది కాలములో నొకరాత్రి నొక గురువు శిష్యునకు స్వప్నములో దర్శనమిచ్చిరి. గురువు నాయింటి వసారాలో సన్నము వండుకొనెను. నేనాయన దర్శనమునకు వెళ్లి వసారాదిగున నిలబడియుండ గురువుగారు శిష్యునిచేత మూడన్నపు ముద్దలను నాకుఁ బంపెను. నేనాముద్దలను దినుచుండ గురువుగారు

"ద్వైతముద్దలు తినవద్దు, అద్వైతామృతము త్రాగవలసినది" యని యాజ్ఞాపించిరి. వివరణ చూడుము.

—♦ 7 స్వప్నము ♦—

ఒకరాత్రి స్వప్నములో, గుమ్మములకు కిటికీలకు నెర్రటి యద్దము లమర్చి యేడంతస్తులుగల మేడ లేక గోపురము నిర్మాణము చేసినటులను, దానిలో నేను ప్రవేశించక, వెలుపలనే యుండినటులఁ గనుపించినది. వివరణచూడుము.

—♦ 8 స్వప్నము ♦—

పై స్వప్నమునకుఁ గొలది కాలములో నొక మహాపురుఁషు డొక రాత్రి స్వప్నములో నగుపడి నాశరీరమునుండి పాపములను దీసి దూరమున నొక వెదురుకర్ర దండెముమీద వ్రేలాడవేసి "నీ పాపములను దీసివేసినానని" శలవిచ్చెను. నేను వానిని జూచితిని. మిక్కిలి యెర్రగా పనికిరాని మాంసఖండములుగాఁ గనుపించినవి. వివరణ చూడుము.

—♦ 9 స్వప్నము ♦—

పైస్వప్నమునకుఁ గొద్దిరోజులకే నేను దూరమునుండి జూచు చుండగాఁ నాశరీరము బూడిద కింద దహన మగుచున్నటుల చితిని మంటలను జూచినటుల స్వప్నమైనది. ఈ స్వప్నము కలిగిన పిమ్మట, నాకాకాలమందు గురువుగానున్న బొరుపల్లి-లక్ష్మినారాయణగారి స్వప్నమువలన దేహాత్మబుద్ధి నశించినదని ప్రతిమలయందు బాహ్య పూజ సిక జేయుఁదగదని మానుపించిరి. వివరణ చూడుము.

ఈకాలములో నొకటి రెండు రాత్రులలో స్వప్నమందు నీక్రింద వివరించిన ధ్యానశ్లోకము లుపదేశింపబడినవి. నిద్రలేచు వరకు ఖండములుగా జ్ఞాపకమున్నవి. సామాన్యముగఁ దరుచు జనులు ధ్యానకాలమున పఠించే శ్లోకములు గాన వానిని సంగ్రహించి ప్రతిదినము జపారంభకాలమునను రాత్రి నిద్రించునపుడు, లేచునపుడు పఠించుచుంటిని. అవి యేవనఁగా.

శ్లో॥ యశ్శివోనామరూపాభ్యాం। యాదేవీసర్వమంగళా। తయోస్సంస్మరణాత్పుంసాం। సర్వతో జయమంగళం। లాభస్తేషాం జయస్తేషాం। కుతస్తేషాంపరాభవః। యేషామిందీవరశ్యామో। హృదయస్థో జనార్థనః ॥

శ్లో॥ ఆపదామపహర్తారం । దాతారం సర్వసంపదాం । లోకాభిరామం శ్రీరామం । భూయోభూయో నమామ్యహం॥ సర్వమంగళ మాంగల్యే। శివే సర్వార్థసాధకే। శరణ్యేత్రియంబకే దేవి। నారాయణి నమోస్తుతే। లక్ష్మీనారాయణాభ్యాంనమః। ఉమామహేశ్వరాభ్యాన్నమః। వాణీహిరణ్యగర్భాభ్యాన్నమః । శచీపురందరాభ్యాన్నమః। అరుంధతీ వసిష్టాభ్యాన్నమః । సీతారామాభ్యాన్నమః। సర్వేభ్యోదేవేభ్యో మహాజనేభ్యోన్నమః ॥

యాసాపద్మాసనస్థా । విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ। గంభీరావర్తనాభి। స్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా। లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైః స్నాపితాహేమకుంభైః। నిత్యం సాపద్మహస్తా మమవసతుగృహే సర్వమాంగళ్యయుక్తా॥

విఘ్నములను దొలగించుటకుఁ బ్రారంభమున విఘ్నేశ్వరునే ప్రార్థించవలెనా, లేక ముందుగా మరియొక దేవుని ప్రార్థించ

వలెనా యను సంశయ మొకదినమున గలిగినది. నాటిరాత్రి స్వప్న
ములో నొకమనిషి మిక్కిలి విలువగల లోహవిశేషముతోఁ జేయ
ఁడి చిన్నడబ్బీని నాకిచ్చెను. దానిని విప్పిచూడఁగా మేలిమి బం
గారముతోఁ జేయబడిన శ్రీకృష్ణవిగ్రహ మందులో గనుపించెను.
ందువలన శ్రీకృష్ణమూర్తి ప్రారంభపూజనీయుఁడని నిశ్చయించి
ముదయ సాయంకాల ప్రార్థనలు శ్రీకృష్ణస్తవముతో నారంభించి
మనఁగా "కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే । ప్రణ
క్లేశనాశాయ గోవిందాయ నమోనమః" యనుశ్లోకము మొదట
ఠించి, పిమ్మట "గజాననం భూతగణాధిసేవితం । కపిత్థజంబూఫల
ారభక్షిణం । ఉమాసుతం శోకవినాశకారణం । నమామి విఘ్నే
శ్వరపాదపంకజం ॥ మొదలగు శ్లోకములఁ బఠించెదను.

## —• 9 (ఎ) స్వప్నము •—

నేను కాకినాడ సబుమేజస్ట్రేటుగా నుండగా నొకరాత్రి
కలగుంపు నాయింటివద్ద విశేషముగ నార్చి నిద్రాభంగము జేసి
. మలిరోజుదయమున మునిసిపలోవరసియ్యరుతో నీసంగతి ప్ర
వవశమునఁ జెప్పితిని. నేను కచేరీకి వెళ్లినపిమ్మట నాశలవులేకుండ
రసియ్యరొకటి రెండు కుక్కలను జంపించెను. ఈసంగతి నాకెవ
ు చెప్పలేదు. ఆరాత్రి "కుక్కలను చంపించవద్దని" స్వప్నమై
వెంటనే ఓవరసియ్యరును బిలిపించి నాశలవులేకుండఁ జంపించి
మకు మందలించి యికనెపుడు నాయింటివద్దఁ గుక్కలను జంపవ
ని యుత్తరువుచేసినాను. వివరణ చూడుము.

1890 సంవత్సరము మే నెలలో నాయన్నకుమారుని వివా
ముకొరకు రామచంద్రపురము వెళ్లినాను. పెండ్లి మూడవరోజుద

యమున నాకుజబ్బుచేసి స్నానము జపము మాని పరుండినాను. వెంటనే నిద్రమకతవచ్చినది. ముగ్గురు పురుషులు నిద్రలోఁ గనుపించిరి. వారిలో నొకరు మంగలికత్తివంటి కత్తితో మంత్రించి చిన్నబెత్తపు ముక్కతో నాహృదయము, మెడవెనుక, భుజములపై భాగములను స్పృశించి లేచి జపముచేసుకొమ్మని యాజ్ఞనిచ్చిరి. శరీరస్వాస్థ్యము పూర్ణముగ గల్గినందున వెంటనే స్నానముచేసి జపముచేసుకున్నాను. కాకినాడలో నొకమారు జ్వరపీడ కల్గినపు డీప్రకారమె జరిగినది.

## —♦ 10 స్వప్నము ♦—

1884 సంవత్సరములో నాకు మూలశంక ప్రారంభించి 1890-1891 సంవత్సరములలో దానిబాధ హెచ్చినది. ఆసనశుద్ధిగా గూర్చుని జపముచేసుకొనుటకు వీలు లేకపోయినందున నెట్టిపాపముచే నీబాధనివారణ కాలేదని దైవమునుగూర్చి ప్రార్థించగా నా టిరాత్రి „ సతత్రియక్ష్మణాపాపి। అత ఎవమమాంశికః ” యని స్వప్నములో జెప్పిరి. దీని తాత్పర్యమేమన, జీవాత్మ పరమపురుష అంశయగుటచేత రాజయక్ష్మ (మూలశంక) చేత బాధపడువాడు పాపికాడని స్పష్టముగ జెప్పబడెను. వివరణచూడుము.

## —♦ 11 స్వప్నము ♦—

1891 సంవత్సరమున జూలై నెలలో నాకుమారుడు జన్మించిన నైనవరాత్రి స్వప్నములో రమారమి 35 సంవత్సరముల వయస్సు, బంగారమువలె దేహకాంతి, మంచి వర్చస్సుకలిగి ధౌత వస్త్రములను ధరించిన బ్రాహ్మణుడు దర్శనమిచ్చి నన్ను స్నా

నముఁజేయుమని చెప్పెను. వెంటనే స్నానము జేసినాను, నాకా యన తెల్లటి వస్త్రములనిచ్చి ధరించుమని చెప్పెను, నేను వానిని ధరించినపిదప, తాను కూర్చునియున్న పీటకెదురుగానున్న పీట మీదనన్నుఁ గూర్చుండనియమించి, నారెండు హస్తములను దన పాదములమీద నుంపించి తన కుడిహస్తమును నాశిరస్సుమీద నుంచి „ఓం శ్రీపరమేశ్వర సుప్రసన్నోభవ” యను మంత్ర ముపదేశించి, ప్రతిదినము జపముచేయుమని శలవిచ్చిరి. పిమ్మట నాకుమారునికి శ్రీరామమూర్తి నామ మివ్వవలసినదని చెప్పినారు. అప్పటినుండి నేనామంత్రమును జపము చేయుచున్నాను. వివరణ చూడుము.

1892 సంవత్సరము శెప్టెంబరు నెలాఖరున జీతవృద్ధిమీద నరసాపురం డిప్యుటీ మేజస్ట్రీటుగా వెళ్లినాను. కాకినాడలో నేను భగవద్గీతలు చదివినపుడు బోధకానందున, స్వప్నగురువు తానే బోధించెదనని యొకస్వప్నములోఁ జెప్పియుండెను. నరసాపురం వెళ్లి నపిమ్మట రేమెళ్ల బ్రహ్మన్నశాస్త్రిగారు గొప్ప పండితుఁడని, యద్వైత మతవేత్తయని తెలిసి భగవద్గీతల నుపదేశించుమని కోరి తిని. ఆయన నంగీకరించి ప్రారంభించుటకు 1893 సంవత్సరము జన వరు నెలలో నొక దినమేర్పాటుచేసినాను. తొలిదినమున రాత్రి యొక వృద్ధబ్రాహ్మణుఁడు స్వప్నములో దర్శనమిచ్చి కొంతసంభా షణ జరిగినపిమ్మట భగవద్గీతలు చదువుమని చెప్పిరి. నేను పుస్త కము తెచ్చినాను. ఆయన తెలిసోప్పు యద్దములవంటి యద్దపు బిళ్లల నమర్చబడియున్న తన పెద్దనులో చనములను దెప్పించి ధరించి „అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చభాషసే । గతాసూన

నల్లటి దేహకాంతిగల నొకపురుషుఁ డేదో యుపనయనోత్సవములోఁ దాంబూలము పుచ్చుకొనుట కని నన్నింటిలోనుంచి మరియొక స్థలమునకుఁ దీసుకొనివెళ్లినాడు. కాని యచ్చట, యుపనయనోత్సవము జరుగుట లేదు. రెండు పెద్దసావిళ్లు మోచేతివసుపుగా నున్నవి. మేము మొదటిసావిడిలో గూర్చునియున్నాము. వెంటనే తెల్లయద్దము కాంతిగలిగి తెల్లటి యింగిలీషుదుస్తులను ధరించిన యొక పురుషుఁడు, పసిడివర్ణముగల మరియొక బ్రాహ్మణుఁడు వచ్చినారు. నన్నిఁటినుంచి తీసుకువచ్చిన నల్లటి బ్రాహ్మణుఁడంతయు సిద్ధముగా నున్నదని ధావళ్యపురుషునకుఁ జెప్పినారు. వెంటనే నన్ను రెండవసావిడిలోనికిఁ దీసుకొనిపోయి, యదివరకే భూమియందు బియ్యపుపిండితో బ్రితివైపున రమారమీ రెండుగజముల బారుగున వేయబడిన నొక గొప్పయంత్రము (మంత్రసంబంధమైన పట్టు) లో నన్నుగూర్చుండబెట్టినారు. పిమ్మట పసిడివర్ణముగల బ్రాహ్మణుఁడు కొన్నిమంత్రములు పఠించి నాశరీరముమీద కొన్ని పరిశుద్ధ సంస్కారములు జరిపినారు. తరువాత ధావళ్యపురుషుఁడు యంత్రముయొక్క యొక మూలకు నన్ను రప్పించి కుడిచేతిలోనున్న సెమలికుంచెను నాశిరస్సు చుట్టూ రెండు లేక మూడుసాగులు త్రిప్పి "Cofirmed Chala" స్థిరశిష్యునిగ నేర్పరచినట్లు చెప్పినారు. పిమ్మట ధావళ్యపురుషుఁడు, పసిడివర్ణముగల పురుషుడు వెళ్లిపోయినారు. నన్నింటిలోనుంచి తీసుకువచ్చిన నల్లటి పురుషుడు తిరిగి నన్నింటికి దీసుకొనివచ్చెను. వెంటనే నాకు మెళుకువచ్చినది. స్థిరశిష్యునిగ నేర్పరచినందుకు సంతసించినాను. కాని దైవజ్ఞానముయొక్క యేసంఘము లేక భాగములో జేర్చుకొనఁనది తెలియలేదు. వివరణచూడుము.

## —♦ 14 స్వ ప్న ము ♦—

1894 సంవత్సరము ది 20 అక్టోబరు రాత్రి స్వప్నములో నొక మహాపురుషుఁడు దర్శనమిచ్చి కొంతసంభాషణ జరిగినపిమ్మట „సోహంఈశః" యను మహావాక్యోపదేశము చేసి దానియర్థము కొంతవరకు జెప్పి నేనాయుపదేశమున కింకా దగియుండలేదని యైన నుపదేశించితినని శెలవిచ్చిరి. వివరణ చూడుము.

## —♦ 15 స్వ ప్న ము ♦—

18౹5 సంవత్సరము జూను నెలలో నొక రాత్రి స్వప్నములో నొక పురుషుఁడు దర్శనమిచ్చి నేను సరిగా జపముచేయుటలేదని తాననుకొన్నంత వృద్ధికి నేనింకా రానందున జాగ్రదవస్థలో దర్శనమిచ్చి యుపదేశించ వీలులేదని మందలించిరి. జాగ్రదవస్థలో నుపదేశమున కెపుడు తగియుందునని యడుగఁగా „పూర్ణాద్వైత భావన" కలుగువరకు వీలులేదని, త్వరగ దానిని లభింప జేసుకొమ్మని శెలవిచ్చిరి. అది యెపుడు లభించునని నేను తిరిగి ప్రశ్న చేయగా యిప్పటి నాస్థితినిపట్టి నాలుకమీాద బీజాక్షరములువేసిన కలుగుతున్నదని వానిని వేసితే రోజుకొక్క పావలా డబ్బులైన తెచ్చుకోలేవని ప్రత్యుత్తరమిచ్చినారు. నాకుటుంబము నిమిత్తము నేనేమియు నిక సంపాదించనక్కరలేదని, యుద్యోగము చాలించిన పిమ్మట దినముకు రెండు రూపాయి లుపకారవేతన మిచ్చెదరని, భూముల శిస్తువలన రెండు రూపాయిలు వచ్చునని, కాన బీజాక్షరములు వేయుమని కోరినాను. ఆమహాపురుషుఁడు రేపు వేసెదనని చెప్పి వెళ్లినారు. వెంటనే మెళుకువ వచ్చి పెన్షనుకోరుట కూడ దని విచారించితిని. వివరణ చూడుము.

## —♦ 16 స్వప్నము ♦—

ది 14 ఫిబ్రివరు 1896 తేది రాత్రి యనగా నరుణోదయ పూర్వము కలిగిన స్వప్నము.

నేనొకఁడనె శ్రీరామ దర్శనార్థ మొక దివ్యస్థలము సేవించుటకు బయలుదేరినాను. ఆరాత్రి యొక గ్రామముచేరి యొక బ్రాహ్మణుని యింటిలో నున్నాను. ఆకలి వేసినది. ఒక బ్రాహ్మణుఁడు (బ్రహ్మన్న శాస్త్రిగారని జ్ఞాపకము) యదివరలో నాకొరకు జాగ్రితచేసియుంచిన నన్నము కొరకు వెదకినాను. చాలా వెదకఁగా నొకగుడ్డమూటలో దొరికినది. మూట విప్పుకొని, యింటి వసారాగదిలోఁ దినబోవుచుండఁగా నాయింటి బ్రాహ్మణుఁడు లోపలకు వచ్చి తినుమని కొన్ని వ్యంజనములిచ్చిన జ్ఞాపకము. అన్నముమూట విప్పినాను కాని తిన్నానో లేదో తెలియదు. మఱిరోజుదయమున లేచి కాలువదాటి శ్రీరామాలయమునకు వెళ్లుటకురాగాఁ బడవ దొరక లేదు. అప్పటికియుదయము 8_9 ఘంటలైనది. అక్కడొక మనిషికనపడి, యిపుడుపడవదొరకదని మధ్యాహ్నమువరకు కనిపెట్టి యుంటే, సాయంత్రమువేళఁ దన ప్లీడరుమీదఁ గాలువ దాటించెదనని జెప్పెను. మధ్యాహ్న భోజనముకొరకు దిరిగి యింటికివెళ్లుట కిష్టములేక సాయంత్రము వరకుఁ బడవ దొరకని విచారముతోఁ గాలువ గట్టుమీద గూర్చుని యుండగా నొక బ్రాహ్మణుఁడు కనుపించి ‹‹ మాయామారీచ బాహుక నాయకా మమనావిక ›› యను మంత్రము జపముచేయుమని, పడవ శీఘ్రముగ లభించునని జెప్పెను. నేనామంత్రమును జపము చేసినాను. వెంటనే నేను దాటవలసిన కాలువలోకిఁ గలిసియున్న

కాలువలోనుంచి యొక బహు విశేషమయిన స్టీమరువంటి స్వయముగా వెళ్లతగ్గ పెద్దపడవ వచ్చినది.

నేను స్టీమరులో నెక్కకపూర్వము మలవిసర్జన జేసుకోవలసి, యక్కడనున్న బ్రాహ్మణునితోఁ జెప్పినాను. ఆయన చెంబుతో నుదకము దెచ్చి యిచ్చి మలవిసర్జనకొక యున్నత ప్రదేశము కనపరచెను. నేనచ్చటికి వెళ్లగా మలవిసర్జన కాలేదు. వెంటనే బ్రాహ్మణుఁడున్న స్థలముకు వచ్చి పాదప్రక్షాళనఁ జేసుకొన్నాను. పిమ్మట బ్రాహ్మణుఁడు నన్నుఁ బడవయొద్దకుఁ దీసుకొని పోవుచుండెను. మధ్యనొక యుదకప్రదేశము దాటవలసి యున్నది. ఆత్రోవ చాలా చిక్కగా నున్నది. వెనుక గచ్చుతోఁ గట్టబడి ప్రస్తుతము ముక్కలై యిటూ అటూ పడి నీరు పైనుంచి పోతూయున్న నిటుకగోడ ముక్కల మీదనుంచి సులభముగానుండు మెరకమార్గము వెదకుచూ బ్రాహ్మణుఁడు మధ్యమధ్య నన్నుఁ బడిపోకుండఁ బట్టుకొనుచూ నాయుదక ప్రదేశమును దాటించెను. పడవ దగ్గరకు వెళ్లుటకు రమారమీ 50 గజముల బొడవు యెత్తు అరగజము వెడల్పు యరగజం లోతు గలిగి గచ్చుతో గట్టబడి యెల్లప్పుడు నిర్మలమగునీరు వేగముగ బైనుంచి క్రిందకు బ్రవహించుచున్నట్టిన్ని దానికి మొనటననఁగాఁ బైన మనిషి దూరుటకు మాత్రము రంధ్రము కలిగి చాలాయేటవాలుగ నడుచుటకు సాధ్యముకాని త్రోవనుండా పైకి యెక్కవలసి యున్నది. నేను దానిని స్వతంత్రించి యెక్కలేనని భయముతోచి, బ్రాహ్మణుని సహాయముఁ జేయుమని కోరినాను. "ఎక్కలేవా" యని యడిగి సహాయము చేయువానివలె గనపించెను గాని చేయలేదు. ఏమిజరిగినదో తెలియదు. సన్నమార్గములోఁ

క్కుపడకుండఁ బైకి వచ్చినాను. పిమ్మట పడవెక్కినాను. బ్రాహ్మ
ఁడు కూడా పడవెక్కి కాలువ యవతల యొడ్డుకు నాతో దాటిన
ాపకము. కాలువ యివతల యొడ్డుకు రాగా నాతల్లి, భార్య, కుమా
డు నన్ను గలుసుకొన్నారు. నాభార్య యాసమీపములో నున్న
రియొక్క కాలువలోకి నీరు నిమిత్తముదిగి మునిగిపోయినది. ఎవరో
ంటనే మునిగి దానిని పైకితీసినారు. పిమ్మట వీరిసంగతి యేమి
ినదో నాకుఁ దెలియదు. నేను వెంటనే శ్రీరామయనఁగాఁ బర
శ్వరాలయమునకు బయలుదేరినాను, మార్గమున వెళ్లినాను.
ివలో 2-3 రు బ్రాహ్మణులు దర్భాసనములతోఁ గనుపడినారు.
రున్ను పరమేశ్వర దర్శనమునకు వెళ్లుచున్నారు. నన్ను చూచి
ివల మంచి యాచారములేని నాకుఁ బరమేశ్వర దర్శన మవుతు
దా" యని యొకరున్ను "పూర్వజన్మ సుకృతము యుంటే కావ
ునని" యొకరున్ను అన్నారు. కొంత దూరము వెళ్లగా నొక
 కాలువ దాటవలసి వచ్చినది. దానికి బహు జారుగానుండే
ుమైన యొక కర్రవంతెనగానున్నది. దానిపైనుంచి నేను సులభ
గా బ్రాహ్మణులకంటె, ముందుగా దాటి, యవతలకు వెళ్లినాను.
ి యవతలనే పరమేశ్వరాలయము కొంచెము దూరములో ను
ది. ఇది దాటగానే అక్కడ కాపలామనిషి కొంచెము రాకూడ
 యడ్డు చెప్పెను, కాని మరియవరో రావచ్చునని చెప్పినారు.
నాను. తాంబూలము వేసి చుట్ట కాల్చుచు ఆలయ సమీప
రకు వెళ్లినాను. తాంబూలమువేసి చుట్ట కాల్చుచూ వెళ్లడము
ంచి కొందరు నాకుఁ బరమేశ్వర దర్శనము కాదని, యనాచార
గా వెళ్లుచున్నానని పరిహాసము చేసినారు. ఆలయమునకు వెళ్ళగా
-డయుండే కొందరు నన్ను గౌరవముతో జూచినారు. కొంద

రుపేక్షగానున్నారు. పరమేశ్వర దర్శనము కొరకు నిరీక్షించి యుండ గా "వారు వచ్చుచున్నారని, అదేసమయమని వెంటనే యెదురు గా వెళ్లి దర్శనము చేయుమని," యక్కడవారు చెప్పినారు. నేను యెదురుగా వెళ్లినాను. పరమేశ్వర్లు నల్లగా మనిషి ప్రమాణముగా నున్నారు. 2-3 సన్నిధాన వర్తులతో వారి గది దాటి సన్నహాలు లేక నడవలోనుంచి వచ్చుచుండఁగా నేను వారిని జూచి సాష్టాంగ పడినాను, వారున్నా అదేప్రకారము చేసినారు. నా బాహువులు వారి బాహువులతో బట్టుకొన్నారు. నాలోనుండే సత్వము వారి లోకి పోయినది. ఆ పోయేటప్పుడు నా కుడితొడ లాగినది. కుడిగజ్జ లో నొప్పి కలిగినది. నాలోనుండే యావత్తు సత్వము వారు ఆక ర్షించగా వారిలోఁ బ్రవేశించి నా శరీరము అక్కడ పడిపోయినది. నాకుయికను వ్యక్తిగాని శరీరాభిమానముగాని లేకుండా పోయినది.

ఇంతలో మెళుకువ వచ్చినది. లేచేవరకు కాకులు కూసినవి. ఉదయము 5½ ఘంటలైనది. వెంటనే జ్ఞాపకమున్న పై సంగతులు వ్రాసినాను. వివరణ చూడుము.

## —♦ 17 స్వప్నము ♦—

ది 18-1-1901 యనగా శార్వరి సంవత్సర పుష్య బ ౧౩ శుక్రవారము రాత్రి కలిగిన స్వప్నము.

నా తండ్రిగారు చాలా వృద్ధు. నాయన్న మంచివాఁడని నేను దుర్మార్గుఁడనై, తనను నిందించినానని యందువలనఁ దనకుఁ గాయిలా వచ్చినదని, నేనిల్లు విడిచి లేచిపోతేకాని కాయిలా కుద రదని యన్నట్టు నాకుఁ దెలిసి చాలా విచారమై యేడుపువచ్చి

నన్నీపరిహారమనవచ్చునా? నేనేమిచేసినానని తండ్రిగారి నడిగితిని. ఆయన తాను చెప్పినమాట సత్యమేయని, యెవరో శాస్త్రివద్ద నేను తనను దూషించినట్లు తాను విన్నానని చెప్పినారు ఈ మాటలు విని, వానినింతలుచుకొని యేమ్చుచుం గాశీ లేచిపోతానని ప్రయాణ మైనాను. నాతల్లి నన్నాదరించి, యింట్లో నుండుమనుటకుం బదులుంగాలేచి వెళ్లుట కంగీకరించి కాశీలో నా కేవస్తువ కావలసినను రాజుతోం జెప్పి తెప్పించుకోవలసినదని బజారులోంగొనవద్దని చెప్పినది. అప్పటికి ఝాము ప్రొద్దెక్కినది. ఇల్లు వదలి వెళ్లిపోతానని నాబట్టలు వగైరాలు మూట కట్టుమని బంట్రోతుతోం జెప్పినాను. తండ్రి నన్నన్యాయముగాం నిందంజేసెనని దుఃఖించుచుండంగాం దల్లి యాదరించక, యింట్లోనుంచి వెళ్లిపోవుటకు యంతమాత్రమభ్యంతరముపెట్టక, కాశీలో నేను, కావలసిన వస్తువులను రాజుతోం జెప్పి తెప్పించుకొమ్మని మాతృసలహా యిచ్చినందుకుం గోపము కూడం గలిగి వెళ్లిపోవుటకు నిశ్చయించుకొని, తలిదండ్రిల నిరాదరణకుం బలుమారు దుఃఖించుచు నాసామాను సర్దుబాటు చేయించుకొనుచుండంగా మెళుకువవచ్చినది. వెంటనే "ఈస్వప్నము సత్యమని తండ్రియనంగా కూటస్థుండని అనగాం బ్రత్యగాత్మయని, యీమధ్య నేను ధ్యానము జపము మాని మనస్సును స్వేచ్ఛగాం దుచ్ఛ ప్రపంచక వృత్తులయందుం, గోరికలయందు విడిచిపెటుటచేత నా తండ్రి తనను నిందించినట్లు చెప్పెనని అందువలనం దల్లియైన చిత్తము, నేను కాశీ వెళ్లుట కంగీకరించి కాశీలో, నాకుం గావలసిన వస్తువను రాజుయైన బుద్ధితోం జెప్పి తెప్పించుకొమ్మని నన్ను బజారునకు వెళ్లవద్దని అనంగా మనస్సును స్వేచ్ఛగాం దుచ్ఛకోరికలయందు వద

లిపెట్టవద్దని సలహాయిచ్చెనని స్వప్నముయొక్క తాత్పర్యమైనట్లు నాబుద్ధికిఁ గోచరించినది. వివరణ చూడుము.

—♦ 18 స్వ ప్న ము ♦—

ది 3-2-1901 శార్వరినామసంవత్సర మాఘ శు ౧౫ ఆది వారము రాత్రి నా జన్మస్థానమగు మోడేకుర్రునుంచి బండిమీద నరసాపురము వెళ్లుచుండగాఁ గలిగిన స్వప్నము.

“నేను ప్రయాణముచేయుచున్న బండిని బంట్రోతతి విశాలమగు నొకయింటి యెదరాపించెను. ఆ యింటిలో మితిలేని గదులును, మితిలేని క్రొత్తజనులుండిరి. ఆ యింటియొక్క వెలుపలిభాగమనఁగా వెలుపలహద్దు తెలుసుకొనలేక, నన్ను తమసమూహములోఁ జేర్చుకొమ్మని యక్కడనున్నవారి నడిగితిని. వారందుకంగీకరించిరి. వారిలో నొక నల్లటి మనిషి నన్ను వెంటనే స్నానముచేయించి నడుము జెబ్బలు పట్టుకొని యొకటి లేక రెండు నిమిషములు పొగ వచ్చుచున్న గుండముమీదఁ ద్రిప్పి తన సమీపములోఁ గూర్చుండఁబెట్టి “శిః-శివః” యను మంత్ర ముపదేశించెను. ప్రణవము నెందు కుపదేశించలేదని యడిగితిని. అది ఆర్షికమంత్రమని ప్రణవమక్కఱలేదని ప్రత్యుత్తరమిచ్చిరి. అక్కడనున్నవారందరదే ప్రకారము చెప్పినారు. ఆ వెంటనే సమీపములో గుండ్రముగానున్న మూడు రంధ్రములుగల మట్టిపొరతోఁ గప్పఁబడిన గోతులో వెల్లగితులఁ బరుండిన బురుషునియొద్దకు నన్నుఁ దీసుకువెళ్లినారు. ఆ మూడురంధ్రములగుండా గోతులో శయనించి యున్న బురుషుని ముఖము, స్వరూపము బాగాఁ గనుపించుచున్నది. ఆయనతోఁ బైన

జెప్పినప్రకారము నేను ప్రశ్నచేసినానని మంత్రోపదేశము జేసిన బ్రాహ్మణుఁడు మనవి చేయఁగా నట్టి ప్రశ్నలు చేయఁగూడదని మంత్రమార్మికమని ప్రత్యుత్తరమిచ్చినారు. నే నాయనకు నమస్కరించి తడిబట్టలతో మంత్రపునశ్చరణ జేయుచునుండఁగా నా తండ్రిగారు దర్శనమిచ్చి "మంత్రమార్మికమనియె ప్రశ్నలు చేయఁగూడదని యనుమానము కూడదని" చెప్పి వెళ్లినారు. పిమ్మట నాకు మెళుకువ వచ్చినది. స్వప్నము చాలాపెద్దది. కాని పైసంగతులు మాత్రమే జ్ఞాపకమున్నవి.

మంత్రాక్షరములు "శి-శివః" లేక "శిః-శివః" యని సంశయము కలిగినది. పిమ్మట 2-3 దినములలో నొకరాత్రి స్వప్నములో నల్లటి యొక గొప్ప (బోర్డు) బల్లమీద నెరుపురంగు సిరాతో "శిః- శివః" యని పెద్దక్షరములుగా వ్రాసి కనపరచిరి. వివరణ కూడను.

1901 సంవత్సరము సెప్టెంబరు నెలలో నేను బెనారసు Theosophical Society లో మెంబరుగాఁ జేరితిని.

—♦ 19 స్వ ప్న ము ♦—

ది 5-2-1905 సంవత్సర మనగా క్రోధిసంవత్సర మాఘ శు ౧ ఆదివార ముదయము 4 ఘంటల కొక గొప్ప స్వప్నము కలిగినది. దరిలేమవరకు నీక్రింద వివరించిన సంగతులు జ్ఞాపకమున్నవి. మనగా—

"నేను మరికొందరితో నా నారింజతోట జూచుటకు వెళ్లినాను. అది నేనదివరలో జెంచినస్థలముగాక మరియొక స్థలముగాఁ

గనుపించినది. దానిలో నేదో పనిచేయించుచుండఁగా నా పినతాత భార్య యచ్చమ్మగారు వచ్చి యవరో నాతాలూకు చెట్టును సగను నరికినారని చెప్పినది. నేను వెళ్లి చూచేవరకు 2-3 పెద్దకొమ్మలు గలిగి పూయుచున్న పెద్దచెట్టును యవరో శత్రువులు భూమికి రమా రమీ రెండడుగులెత్తున రంపముతోఁ జుట్టూ గోసినట్లు కనుపించినది. చెట్టుక్రింద బడలేదు. దానిస్థితి చూడఁగా మరియొకచోట నరుకు వరకు తిరిగీ పాతించినయెడల బ్రతికి పనికివచ్చేటట్టు తోచినది. అందువలనఁ గొందరు నౌకర్లు లేక కూలీలను బిలిచి చెట్టునుదీసి గ్రామమువద్ద మరియొక స్థలమందు బాతుమని చెప్పి తోటలోనున్న నాయన్నగారితో నీ సంగతి చెప్పినాను. ఆయనకూడ చెట్టునరకడము మంచిదికాదని, యింతేకాక తోటసమీపములోనున్న సన్నపాటి నది కూడ తోటవైపున యొడ్డువిరిచినదని చెప్పినారు. నేనా నదిని జూడఁగాఁ గొంతతోటకు 10 గజముల దూరములోను, కొంత 3-4 గజముల దూరములోను గనుపించినది. కాని దానియొడ్డున నాతోటవైపున నితరులు పాతుకున్న లేత పనసమొక్కలు మొదలైనవి బాగా కనుపించుచున్నందున తోటకు నదివలన త్వరలో నష్టమున్నట్టు తోచలేదు. ఇంతలోఁ గూలీలు చెట్టును ద్రివ్వి బడ్డీలమీద క్రొత్తస్థలమునకు మోయుచున్నారు. నేను, నాయన్న, తోటలోనుంచి యింటికి వెళ్లుచున్నాము. ఆయన తీసిన త్రోవను నేను పోవుచున్నాను. కాని రాజు లిళ్లవద్దకు రాగా నతఁడు రాజుల యింట్లో దిగబడినాడు. నేను చెట్టును బాతించుటకుఁ దిన్నగా నింటికి వెళ్లుచుంటిని. మధ్యత్రోవలో జరువులమీద మోయబడుచున్న చెట్టును గలిసినాను. తోటలోఁ జూచిన దానిరూపు కొంత

మారినది. కొమ్మలు కొంతవరకు నల్లబడి కొన్ని శిథిలమై రాలి పోయి, మోడువలె కనుపించినది. దానిలోనుండి మనిషి మాటల వలెఁ గొన్ని మాటలు వినుపించినవి. అవి బాగా జ్ఞాపకము లేవు. కాని, „తాను చైతన్యమేయని, యిప్పుడీ యవస్థలో నున్నానని, త్వరగా బాతించుమని కొంతకాలము ప్రారబ్ధవశమున నిందులో నుండవలసి యున్నదని" చెప్పినట్లు జాపకము. ఈమాటలువిని చెట్టుతోఁగూడ వచ్చుచునుండఁగా నన్నదమ్ములిద్దరు బ్రాహ్మణులు నాతోఁ గలిసినారు. చెట్టులోనుంచి వినపడిన మాటలు వారితోఁ జెప్పఁగా వారిలోఁ బెద్దవాడు నన్నాక్షేపించుట, తమ్ముఁడు నన్నుఁ బట్టుకొని త్వరగా నడిచిపోకుండఁ బీడించుట ప్రారంభించిరి. పట్టు విడిపించుకొనుటకుఁ దమ్ముని 2-3 సార్లు కరిచి మొట్టకేలకు బట్టు తప్పించుకొని యింటికి వచ్చినాను. నేనువచ్చేవరకుఁ గూలీలు చెట్టును బాతిపెట్టక యింటివసారాలో బడ్డీపైన వ్రేలాడఁదీసినారు. నేను దానియొద్దకురాగా నందులోనుంచి యొక పురుషుఁడు బయలుదేరివత్తలకు వచ్చి, నన్నుఁ దనతోరమ్మని చెప్పినారు. నేనాయనతో వెళ్లుచుంటిని. ఆరోజు శివరాత్రి ఉదయము 5-6 ఘడియలఁ బ్రొద్దెక్కినది. కొంతదూరము వెళ్లేవరకుఁ బైయిద్దరు సోదరులు మాతోఁగలిసి వచ్చుచున్నారు. కొంతదూరము రాగా వృక్షనిర్గత పురుషుఁడు మమ్మును చాలా నేటవాలుగానున్న నొక యున్నత ప్రదేశముమీద కెక్కి రమ్మని చెప్పినాడు. నేనెక్కలేకపోతే పైని ద్దరిలోఁ జ్యేష్ఠుఁడు నాచెయ్యిపట్టి సహాయము చేసినాడు. ఆమహా పురుషుడు, నేను, తక్కిన యిద్దరు 1-2 యున్నత ప్రదేశముల గుండా బాగా యున్నతముగాను, నలుచదరముగానున్న మరియొక

స్థలము చేరినాము. అక్కడందరము కూర్చున్నాము. మహాపురుషుఁడక్కడ నిప్పుమీద కుండపెంకులో నేదోవేసి వండి గోధుమ వర్ణముకంటె కొంచెము తెల్లగానుండిన పదార్థము పట్టెడు ముద్దను నన్నుఁ బెంకులోనుంచి తీసుకొని మ్రింగుమని చెప్పెను. నేను సంశయించక వెంటనే నొకముద్దను దీసికొని తినుచుండఁగాఁ ద్వరగా మ్రింగుమని చెప్పెను. ఆప్రకారము మ్రింగినాను. వెంటనే నా మనస్సుకు మార్పుకలిగి, పెద్దలయందు వినయము, గురుభక్తి, నమ్రత హెచ్చినది. శరీరముగూడ గొంత రూపుమారినది. అక్కడనుంచి యందరము బయలుదేరి వెళ్లుచున్నాము. పైయిద్దరు సోదరులలో జ్యేష్టుఁడు మహాపురుషునకొక కుక్కను గనపరచి దానికి మారురూపము కలగజేయుమని కోరఁగా జేసేవానివలె నటించి తుదకు జేయక నన్ను మాత్రము తనతోఁ దీసుకుని వెళ్లుతూ, నీవు యోగ్యుఁడవు గాననీకుఁ గనపడి ప్రసాదమిచ్చినానని, తక్కినవారు కోరినది చేయనని యనిరి. ఇద్దరము కలసి యొక వీధిగుండా వెళ్లుచున్నాము. ఉదయ సమయముగా నున్నది. నేను తనతోఁ గలసి యెంత కాలమైనదని యడిగినారు. ఆరోజు శివరాత్రియని, యంతోఁ గాలము కాలేదని చెప్పినాను. రెండు మాసములైనదని, తిరిగీ దర్శనమిచ్చెదనని చెప్పినారు. నన్ను రక్షించవలసినదని నేనుకూడా వస్తానని చాలా వినయముగ బ్రార్థించినాను. కొంతదూరము తీసుకొనివచ్చి ఆయన వీధిలో నొక బండిమీదఁగూర్చుని, నన్నేదో తెమ్మని కొన్ని బారలదూరము పంపినారు. నేను తిరుగ వచ్చేపరకాయన యదృశ్యమై కనుపడలేదు. నేనాయన కొరకు వ్యర్థముగా గొంతసేపు వెదకి, తిరిగీ దర్శనమిస్తానని చెప్పిన మాట జ్ఞాపకము చేసుకొని యింటికి వచ్చినాను. అప్పుడింటిలో వడ్డన సమయముగ

నున్నది. విస్తళ్లు వేయబడినవి. అది శివరాత్రి వెళ్లిన మలిరోజని నానమ్మకము. నాయన్నగారిని నేను వెళ్లి యెంత కాలమైనదని యడిగితే 4 మాసములైనదని చెప్పినారు." ఇంతలో నిద్ర మెళుకువ వచ్చినది. వివరణ చూడుము.

## —♦ 20 స్వ ప్న ము ♦—

ది 26-6-1911 తేది రాత్రి స్వప్నములోఁ గాషాయ వస్త్రములధరించిన యొక మహాపురుషుఁడు దర్శనమిచ్చి తాను శంకరాచార్యులని "యుపదేశసహస్రి" యను గ్రంథమును దెప్పించి చదవ వలసినదని యాజ్ఞాపించి యొకటి రెండు శ్లోకములు తాను జదివి యర్థము చెప్పినారు. నిద్రనుంచి లేచేవరకు శ్లోకములు యర్థము జ్ఞాపకము రాలేదు. వివరణ చూడుము.

## —♦ 21 స్వ ప్న ము ♦—

ది 10-8-1915 తేదీ రాత్రి మంచి బంగారుఛాయ, దీర్ఘబాహువులు రమారమీ 90 సంవత్సరములు వయస్సు కలిగి పీత వస్త్రములను, నుదుటఁ బట్టివర్థనములను ధరించిన నొక మహాపురుషుఁడు స్వప్నములో దర్శనమిచ్చి "అహం బ్రహ్మాస్మి" యను మంత్రముపదేశించి దాని యర్థము రాత్రి 11 ఘంటలు మొదలు 3 ఘంటలవరకు బోధచేసి యేదుదినములీ మంత్ర మనుష్టానముచేసిన బహు విశేషము కలదని యానతిచ్చిరి. నేనదివరకేమేమి గ్రంథములు చదివినావని యడిగి గంగలకుర్రు మునసబు గారి యొద్ద నేదో పుస్తకము పేరుజెప్పి దానినిదెచ్చి చదువుమని దానియర్థము తాను స్వయముగ బోధించెదనని శలవిచ్చినారు. ఆకాలమందు నేనున్న

యింటిలో నేనున్న స్థలమందుగాక మరియొక స్థలమందు "నమ్మ వారు పూజను వారతి యుత్సాహముతోఁ జేయుచున్నటుల గనుపించినది." నాకు నిద్ర మెళుకువ వచ్చేవరకుఁ బుస్తకము పేరు మరుపు వచ్చినది. ఉపదేశించిన మంత్రము జ్ఞాపకమున్నది. వివరణ చూడుము.

—♦ 22 స్వప్నము ♦—

ది 27-4-1916 తేదీరాత్రి యొక మహాపురుషుఁడు స్వప్నములో దర్శనమిచ్చి కొంత సంభాషణ జరిగిన బిమ్మట "సంవిత్కారణాయనమః" యను మంత్రముపదేశించి యుదయము 4 ఘంటల వరకు దానియర్థము బోధించినారు. కాని నిండ్రనుండి లేచేవరకు మంత్రము మాత్రము జ్ఞాపకమున్నది. వివరణ చూడుము.

—♦ 23 స్వప్నము ♦—

పై స్వప్నము దరిమిలాను చాలా కాలమువరకు గురుదర్శనములేదు. నాజపమును సరిగా జరగలేదు. 1922 సంవత్సరాంతము లేక 1923 సంవత్సర ప్రారంభ మందొక రాత్రి స్వప్నములో నొక మహాపురుషుఁడు దర్శనమిచ్చి గొంత సంభాషణ జరిగిన బిమ్మట "మహాత్మాహం మహాత్మ తత్వాహం" యను మంత్రము జపము చేయుమని యుపదేశించెను. నేనా మంత్రాక్షరములను సరిగా గ్రహించలేక "మహాత్మాహం మహాత్మ తత్మాహం" యని బలికితిని, గురువుగారు వెంటనె తప్పుదిద్ది "మహాత్మాహం మహాత్మ తత్వాహం" యని స్పష్టముగఁ జెప్పినారు. నిద్ర మెళుకువ వచ్చేవరకు మంత్రము జ్ఞాపకమున్నది. ఉపదేశ కాలమందు జెప్పిన యర్థము జ్ఞాపకములేదు. వివరణ చూడుము.

—♦ 24 స్వప్నము ♦—

ది 17-11-23 రాత్రి యొక గురువు స్వప్నములో నగుపడి „ననభవతి రోహితః" యను మంత్రముపదేశించి దాని యర్థము చెప్పినారు. నిద్రనుండి లేచేవరకు మంత్రము మాత్రము జ్ఞాపకము వచ్చినది. అర్థము మరపువచ్చినది. వివరణ చూడుము.

—♦ 25 స్వప్నము ♦—

ది 23-12-1923 రాత్రి పరుండే సమయమున నీపుస్తకము ను వ్రాయుటకు నాయసమర్థతను గూర్చి తీవ్రముగ నాలోచించి తిని. నిద్రనుండి లేచుసమయమున „యేత్తేశక్తి తథాతవచ" యను శబ్దములు యెవరో చెప్పినటుల నామనస్సులో దట్టినవి. నాయసమ ర్థతను గూర్చి కలిగిన సంశయమునకు సమాధానమని తలచినాను. “తవచ" నీవు వ్రాయు పుస్తకము „యత్తేశక్తి" నీశక్తి యెంతో, „తథా" అంతకు సరిగా నుండునని చెప్పెను. శక్తి శబ్దమునకు జ్ఞాన మని యర్థము కలదు. గాన నీవు వ్రాయు పుస్తకము నీజ్ఞానమునకు సరిగా నుండునని చెప్పినటుల దలచినాను.

—♦ 26 స్వప్నము ♦—

ది 11-1-1924 రాత్రి యొక మహాపురుషుడు స్వప్నములోఁ గనుపించి „అద్వైతే బోధితె తత్వేపరంబ్రహ్మణి లీయతే" యని నుపదేశించి దానిభావము కొంత బోధించిరి. నిద్ర లేచేవరకు మూ లవాక్యములు మాత్రము జ్ఞాపకమున్నవి. వివరణ చూడుము.

—♦ 27 స్వప్నము ♦—

ది 8-10-1925 క్రోధన సంవత్సర ఆశ్వీజ బ ౯ గురు వారము రాత్రి 1 ఘంటకు స్వప్నములో నొక పురుషుడు కనుపించి

నేను వ్రాసిన గ్రంథమునుగూర్చి యంగీకారముగ సంభాషణచేసి, పిమ్మట „ మంత్రార్థి కారిస్యా త్సగుణః । యస్య నిష్ఠాపరికీర్తితా ” యను వాక్యము నుపదేశించి దానియర్థము చెప్పినారు. వెంటనే మెళుకువ వచ్చినది. కాని మంత్రార్థము మరచిపోయినాను. వివరణ చూడుము.





# మనస్సు.

వేదాంత పరిజ్ఞానమునకు మనోజయము ముఖ్యముగాన, స్వప్నోపదేశములయొక్క అర్థము వ్రాయక పూర్వము మనస్సును గూర్చి కొంత యోచించు టవసరమని తలంచెదను.

1 ఇహపర సుఖదుఃఖ కారణమగు మనస్సు ఎట్లుకలిగినది?

2 పంచీకరణములోఁ బంచభూతమేళనమువలనఁ గలిగిన నొక శక్తియైయుండునా? లేక యనాదిగా సాక్షాత్స్థితి కలదై యుండునా?

3 సాక్షాత్స్థితి కలదైనయెడల చంచలస్వభావము కలదియగుటకుఁ గారణమేమి?

4 చంచలస్వభావముగల దీనిని బ్రహ్మమని చెప్పుటకుఁ గారణమేమి?

5 ఎట్టిస్థితిలోనిది బ్రహ్మమని, ఎట్టిస్థితిలో లోకవ్యవహార మనస్సని చెప్పబడును?

6 ఏసాధనములవలన నిది చంచల రహితమగును?

ఇట్టి సంశయములు ముముక్షువునకుఁ బ్రారంభమునఁ గలుగును. ఈప్రశ్నలకు సరియగు ప్రత్యుత్తరములు, గొప్పవిద్వాంసులు విశేషయనుభవశాలురు చెప్పవలయును. అయినను నాశక్తికొలది సమాధానములు వ్రాసెదను.

1 శుద్ధ బ్రహ్మయనఁగ నిర్గుణ బ్రహ్మయందు అవ్యక్తము- మూలప్రకృతి—అనాద్యవిద్యయను పరమేశ్వర శక్తి సత్వ/తెలుపు, రజః/ఎఱుపు, తమో/నలుపు గుణముల/రంగులతోను— మాయా/శుద్ధము, అవిద్య/మలినము (సమష్టి—వ్యష్టి) లను ద్వంద్వములతోనుగూడి, అగ్నియందుష్ణమువలె, అభిన్నముఁగా నణగియున్నది. లయకాలమందు సర్వము నశించగా ననగా పరమేశ్వరుని యందు లీనమైనబిదప, తిరిగిజీవులయొక్క భోక్తృకాలము తటస్థించు నపుడు, బ్రహ్మమునకు సృష్టిసంకల్పముదయించును. అనఁగా బ్రహ్మ ప్రతిబింబించియున్నఁ జిదాకాశమందుఁ గించచ్ఛలనము కలుగును. అట్టి చలనమువలన. రజ్జువందు సర్పభ్రాంతి దోచినటుల, బ్రహ్మ చిచ్ఛక్తి అనంతశక్తులతో సమష్టిని ఈశ్వరుఁడుగను, వ్యష్టిని అనంత జీవులుగను బ్రకాశించును ఈశ్వరుఁడు ప్రకృతియొక్క మాయా— సత్వాంశతోఁ బ్రతిబింబించిన బ్రహ్మముగాన, మాయను స్వాధీన ముందుఁ గలవాఁడై, ఈశ్వరనామము నొంది సర్వజీవరక్షకుఁడా యెను. జీవులు అవిద్యకులోబడినవారుగాన నీశ్వరరక్షితులయ్యిరి. ఇది పరాప్రకృతి. గీతలు 7 వ అ. 5 శ్లోకము.

పిమ్మట "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" యని భూతసృష్టినిగూర్చి బ్రహ్మచిచ్ఛక్తితో సంకల్పముగలిగి అపరాప్రకృతి (ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, భూమి, మనస్సు, బుద్ధి, అహంకారములయొక్క తన్మాత్రల) సూక్ష్మాణువులుదయించెను. శ్లో॥ "ప్రకృతిః పరమాశక్తిర్వికృతిః ప్రతిబింబితా" యనునట్లు ఇవి వికృతినొంది యొకటితోనొకటి (పంచీకరణము) కలియుటవలన జడ స్వరూపముగు స్థూలసృష్టి, దేశకాలములుగలిగినవి. (శ్రుతి "తదే

తజ్జడం మోహాత్మకం".) మాయజడరూపము మోహరూపము. ఈస్థూలసృష్టి మూలప్రకృతియొక్క అవిద్యాంశలోనిదియగుటవలన, దీనిలోఁ జేరిన జీవులు రజ్జుసర్ప దృష్టాంతముగ, బ్రహ్మయందు భ్రాంతివశమునఁ గనపించు విశ్వములో బహువిధనామరూపములను ధరించి, తమ నిజస్వరూపమును మరచి, కించిజ్ఞులమని, కర్మబద్ధుల మని తలఁచెదరు.

శ్రుతి॥ "అయమాత్మావాఙ్మయోమనోమయః ప్రాణమయః" అనెడి వాక్యసారముగ, పైనచెప్పిన బ్రహ్మసంకల్పము వృత్తిజ్ఞాన మని రూపజ్ఞానమని రెండువిధములు. వృత్తిజ్ఞానము సంకల్ప వికల్ప స్వభావమైన మనస్సు. రూపజ్ఞానము బుద్ధి-వివేకము-నిశ్చయించేది.

సృష్టిక్రమములో ద్వంద్వములు (సత్యము అసత్యము, సన్యము అసన్యము, ఆత్మా-అనాత్మా, మొదలగునవి) అనఁగా వ్యతిరేకములు (Positive-Negative) అని వార్యములై యున్నవి. సత్యసంకల్పము (Positive) నకు అసత్య సంకల్పమనఁగ వికల్పము (Negative) వ్యతిరేకమై యుండుటచుబట్టి వృత్తిజ్ఞానమువలన గలిగిన మనస్సుకు సంకల్పము వికల్పము అనఁగా చంచలత్వము సహజ ధర్మమైయున్నది. "చంచలత్వం మనోధర్మోవహ్నా ధర్మో యథోష్ణతా." మహోపనిషత్తు. కాన మనస్సు ఆగంతుకముకాదు.

ఇట్టిమనస్సు (శ్లో॥ మనోవృత్త్యాత్మకో జీవసంకల్పో భోగ సాధనం) స్థూలసృష్టిలో భోగసాధనములైన జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను, స్థూలదేహమును ధరించి, అహంకార సహితమై ప్రాణము (ప్రాణవాయువు) తోను, పూర్వకర్మ సంస్కార

ములు—వాసనలు—జ్ఞాపకములతోనుఁ గలసి యనఁగా, నవి నాభావముగ మిళితమైనందున నతిచంచల స్వభావము గలదై, క్షణికకాలములో సముద్రములు, నదులు, పర్వతములు మొదలగు సర్వదృశ్యములయందు సంచరించుచు, స్వస్థానమునుఁ జేరుచు, వెంటనే తిరుగఁబోవుచు, యెందునగాని కించత్కాలమైన నిలుకడలేక, యవశముగఁ బట్టుకాయలోఁ జిక్కుకొనినఁ బట్టుపురుగు చందంబున, దేహమను వలలోఁబడి భ్రాంతిరూపములైన యనంత సుఖదుఃఖముల ననుభవించుచుండును. ఇదియే సంసారము. ఎట్లనఁగా ప్రతి ఉపాధిలోనుండు జీవుఁడు నిర్గుణబ్రహ్మయొక్క అంశము—లేశము అయినను, లోకవ్యవహారదశలోఁ బ్రకృతి సంబంధమగు రజస్తమోగుణములతో గూడి (finite) ఆద్యంతములనఁగా జననమరణములు సుఖదుఃఖములు గలవాఁడనని తలచుటయే సంసారము. పారమార్థిక దశలోననఁగా స్వస్వరూప (infinite) ధ్యానములో ఆద్యంతములు మొదలగు నేవికారములులేని ఈశ్వరుఁడై యుండును. (ధ్యానమనఁగా. శమదమాదిసాధన బలముచే తనజ్ఞానమునుఁ బారద్రోలి, కేవల సాత్వికాంశమగు బ్రహ్మాకారవృత్తి పరంపరచేఁ బరిపూర్ణబ్రహ్మ స్వరూపమైయుండుట, అనఁగా త్రికరణ శుద్ధితోఁ జేయవలెను. లేనిచో సంబంధములేక వేరువేరు స్థలములనున్న ప్రమిద, వత్తి, చమురులవలన దీపము వెలిగించుట సాధ్యముకాని యటులనే మనస్సులో నొకటి ఆలోచించుచుఁ జేతులతో వేరొక పనిఁజేయుచు, పెదవులతో భగవన్నామము పలుకుచుండుటవలన ధ్యానసిద్ధి జ్ఞానప్రకాశము గలుగదు. ధ్యాతయొక్క మనస్సు ధ్యేయాకారమై నిండుశాంతి, జ్ఞానమయమై యుండవలెను. ధ్యానదార్ఢ్యతచే నిగూఢముగ నున్నమనశ్శక్తుల వికసింపఁజేయవలెను.)

ఇటుల జీవ ఈశ్వరనామములు అవస్థాభేదమువలనఁ గలిగి అంతరలాపియై యున్నవి. లోకవ్యవహార దశలో మనోవృత్తులు కామక్రోధయుక్తమై చంచలస్వభావము గలవిగాన మలినమనస్సని, పారమార్థిక వృత్తులు శుద్ధమనస్సని చెప్పఁబడును. మనస్సునకు రూపములేదు. దేశమువలె నంతటనుండునది, లేనిది, దృశ్యపదార్థములే రూపముగాఁ గలది. సంకల్ప, వికల్ప వృత్తులతోఁగూడినపుడు మనస్సనియు, నిశ్చయించునపుడు బుద్ధియనియు, తన నిజస్వరూపమును మరచియుండునపుడు అహంకారమనియు, చింతించునపుడు చిత్తమనియుఁ బేరువహించుచున్నది. దీని (మనస్సు) యొక్కశక్తి అపారము, అద్భుతము, అచింత్యపరిణామము గలదిగనున్నది. శబ్ద స్పర్శ రూప రస గంధము లనంబడు విషయములను గ్రహించునపుడు, త్వక్, చక్షు, శ్రోత్ర జిహ్వాఘ్రాణము లనఁబడు పంచేంద్రియములుగ మారుచున్నది. ఈమనస్సే సర్వకార్యములకు ప్రేరణవస్తువై వెలయుచున్నది. గాన మనుజులు పూర్వవయస్సునుండి మనోనిగ్రహమును గూర్చి ప్రయత్నించవలయును. పరవయస్సునఁగా వృద్ధాప్యదశలో మనోనిగ్రహము మిక్కిలి దుస్సాధ్యమని నా యనుభవమువలన నొక్కిచెప్పెదను. చిత్తచాంచల్యమే ధ్యానప్రతిబంధకము. చిత్తనిరోధవిఘ్నకారులు అజాగ్రత, వ్యాధి, సంశయము, సోమరితనము, విషయభోగేచ్ఛయు మొదలగునవి.

పైనఁ జెప్పినకారణములవలన మనస్సు పంచభూతముల మేళనవలనఁ గలిగినదికాదని, బ్రహ్మసంకల్పమేయని చంచలత్వము దానిధర్మమని స్పష్టమగుచున్నది.

భ్రాంతిరూపమైన సంసారమునుండి తరించుటకు మనుజుఁడు తనయొక్క (నిజ) స్వరూపమును తెలియవలెను. ఇది లభించుటకు

మనస్సు చంచలత్వమునుండి స్థిరతనొందవలయును. లేనిచో, చలించు నట్టి దర్పణమందు ముఖప్రతిఫలనము సరిగా లభించనటుల సదా చలించు మనస్సునకు, అంతఃకరణదర్పణములో స్వస్వరూప ప్రదర్శనము సరిగా లభించదుగాన, ముముక్షువు సర్వప్రకారముల మనోజయము నొందవలయును. ఇది మిక్కిలి దుస్సాధ్యమైనను, దృఢాభ్యాసము, వైరాగ్యమువలన సాధ్యమగును. బాణమును బాణముచేతను, విషమును విషముచేతను, శత్రువును శత్రువుచేతను, మురికిని మురికిచేతను, బోగొట్టునటుల మనస్సును మనస్సుచేతనే స్వాధీనముచేసుకొనవలయును. మారుసాధనములేదు.

మలినమనస్సును శుద్ధమనస్సుచేత నణచవలెను. మలినవృత్తులు వాసనలు (Electric sparks) మెఱుపులవలె అకాత్తుగ (తెఱచు ధ్యానకాలములో) శుద్ధమనస్సునకుఁ దట్టి విఘ్నమొనర్చుచుండును. అట్టివి కలిగినవెంటనే ముముక్షువు జాగరూకుఁడై శుద్ధమనస్సనఁగాఁ బ్రతికూలవృత్తులవలన వానినిఁ బారదోలవలయును. దృష్టాంతము. వ్యభిచరించుటయందు మనస్సులో సంకల్పము—వృత్తి—బుట్టినపుడు వివేకబుద్ధితో వ్యభిచారమందలి దోషము, బాధలు, రోగములు, బలహీనత, ధనవ్యయము, లోకనింద మొదలగుఁ బ్రతికూలవృత్తుల ప్రబోధముచే మొదటగలిగిన వ్యభిచారవృత్తి తప్పక నశించును. ఇటులనే మనస్సులో నుదయించుఁ బ్రతిమలిన వృత్తి, వాసనకు వ్యతిరేకవృత్తులు వాసనలు పెక్కులుండును. కాన ముముక్షువు సకల మలినవృత్తులను వాసనలను ప్రతికూలవృత్తులచే నశింపచేయవలెను. ఇట్లు చేయుటవలన మలినవృత్తులు వాసనలు క్రమముగ తగ్గి తుదకు నశించును. కాన నిది మిక్కిలి సులభసాధనమని భగవద్గీతల

6 అ. 35 వ శ్లోకములో శ్రీకృష్ణస్వామి చెప్పిన "అభ్యాస" శబ్ద తాత్పర్యమిదియేయని తలఁచెదను. మలినవృత్తులు వాసనలు నశించగా, శుద్ధవృత్తులు వాసనలు మోక్షహేతువులగును. మనోజయమును గూర్చి ముందు గ్రంథములో శాస్త్రసమ్మతమైన మఱికొన్ని యుక్తులు వ్రాయఁబడును. మనస్సు చేయుచేష్టల నేకాంతముగ కూర్చుండి జాగ్రత్తతో పరీక్షించుచుండిన మనోజయము త్వరలో సిద్ధించును. ముఖ్యసాధనమేదియనఁగా ధ్యానకాలమందు బద్ధాసనముఁనఁ గూర్చుని శరీరమును, కంఠమును, శిరమును, సమముగ నిలిపిన, ప్రాణవాయువుయొక్క చలనము తగ్గును. అది తగ్గినకొలది మనఃచాంచల్యముతగ్గును.

సర్వప్రపంచములు జ్ఞానస్వరూపములు. మిక్కిలి కఠినమగు మనోనిరోధపాటవము 'అసంవేదన' యని చెప్పబడును. విధ్యుక్తమైన సర్వకర్మలను ఫలాపేక్షరహితముగఁ జేయుచు, తాను చేయుచున్నానని, చేయించుచున్నానని, తలంచక, సర్వప్రపంచకములు, అద్వితీయ తేజోరూపబ్రహ్మమనఁగా తానేయనునిశ్చయబుద్ధితో సదాధ్యానించుచుండుట సర్వకర్మత్యాగమగును.

జ్ఞానమనఁగా సర్వభూతసమదర్శనము. ఇట్టి సమదర్శత్వము వృద్ధినొందినకొలది శుద్ధవృత్తులు, వాసనలు కూడఁ గ్రమముగఁ దగ్గి, ఆత్మధ్యానములో మన స్సేకాగ్రతనొంది, చిన్మాత్రస్వరూపమనఁగా స్వస్వరూపానుసంధానములోఁ బూర్ణానందమనుభవించును. ఇదియె నిర్వికల్పసమాధి. ఇట్టి యుత్తమస్థితిలో మనస్సు—(ప్రత్యగాత్మ) బ్రహ్మమైయుండును. తదితరకాలములు లోకవ్యవహారమనస్సని చెప్పబడును.

ఇట్టి యుత్తమజ్ఞానము, అనుభవములు, సజ్జనసేవ, సద్గురోపదేశము, సచ్ఛాస్త్రపఠనము వలన లభించును, సాధుజనసాంగత్యమువలన లభించని యర్థమేదియులేదు. గ్రంథవిస్తరభీతిచే విపులముగ వ్రాయలేదు. ఇక్కాలికాలమున సాధుజనసంగమము మిక్కిలి యరుదుగాన, ముముక్షువు సదా వేదాంతశాస్త్ర పఠన విచారణ చేయవలయును. సాధుజనమనఁగా గీతల 4 అ. 34 వ శ్లోకములోఁ జెప్పబడిన తత్వదర్శినులు—ప్రత్యగభిన్నబ్రహ్మసాక్షాత్కారవంతులని గ్రహించవలెను.

## మోక్షసిద్ధికి మూడు మార్గములు.

1. తాను, అకర్తయనఁగాఁ గర్మచేయువాఁడును, చేయించువాఁడునుకానని, సర్వపదార్థములు తానేయని, తానుకాని పదార్థమేదియులేదని, నేను, నీవు, అది, ఇది, యనెడు భేదములులేవని, దేహము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, బుద్ధి, అహంకారము, మలినమనస్సు, పంచప్రాణములు తానుకానని, తాను అక్రియుఁడైన శుద్ధబ్రహ్మమేయని నిశ్చయముతో సదాయుండుట, ధ్యానించుట, అనగాఁ ధ్యాతయగు తాను ధ్యేయమాత్రముగా భావించుట.

2. తాను సర్వకర్తయని, యనఁగా, సంఖ్యాకమగు సర్వపదార్థములు తానే యను నిశ్చయముతో సదా నుండుట. చలనరహితముగ ధ్యానించుట.

3. పై రెండు మార్గములలో నేదిగాని, నీమనస్సునకు తృప్తిగానుండనిచో, నేను కర్త, అకర్తకానని, ఈ రెంటిపైన అవాఙ్మానసగోచరమైయుండునదియె, అనఁగా నద్వయ బ్రహ్మమేనేనని, సర్వ

వాసనలను, ద్వంద్వములను, సర్వసంకల్పములను, వృత్తులను, మలిన మనస్సును వదలి, సదా యచంచల శుద్ధమనస్సుతో నుండుట, ధ్యానించుట, "జీవేశ్వరౌమాయికావితివిజ్ఞాయ, సర్వశేషం నేతినేతీతివిహాయ యదవశిష్యతే తదద్వయంబ్రహ్మ" అద్వయతారకోపనిషత్తు, సర్వవాసనలు, సంకల్పములు, నశింపుచేసినవారికి వేదాంత శాస్త్ర విచారణ యవసరములేదు. మౌనము ప్రధానముగా ముఖ్యము. వీరే జీవన్ముక్తులు.

ప్రకృతి గుణములచేతఁ జేయఁబడు సర్వకర్మలను, "అంతస్సర్వపరిత్యాగీ బహిః కురుయథాగతం" యని అన్నపూర్ణోపనిషత్తులోఁ జెప్పినటుల, మనస్సుచేత వదలిపెట్టి, నేను కర్త, కారయితయని తలఁచక, ఇంద్రియరూపములైన గుణములు, విషయరూపములైన గుణములయందు వర్తింపుచున్నవని తెలుసుకొని, వానియందించుకైన నాసక్తియుంచక, శత్రువునువలె విసర్జించి, నిర్మల మనస్సుచేత సదా ఆత్మధ్యానము చేయవలయును.

పైనఁ జెప్పినటుల నింద్రియగోచరములగు సర్వవిషయములను, సంకల్పవికల్పములను, వృత్తులను, వాసనలను, మలినమనస్సు చిత్తమును విడచి చలనరహితముగ నిండు శ్రద్ధతో ధ్యానమొనర్చుచుండిన, మొదట మనస్సులో నంధకారముతోచును. వివేకబుద్ధితో దానిని పారదోలవలయును. పిమ్మట, వెల్తురు, నిద్ర, మోహము, యొకటి తరువాత యొకటి కలుగును. వీనినిఁ గూడ వివేకముచే నివారించఁగా, నిర్వికల్పసమాధిలో నథమము క్షణకాలమైనను శుద్ధమనస్సు పూర్ణశాంతినొంది, సంపూర్ణానంద మనుభవించును. ఇట్టి నిరంతర ధ్యానాభ్యాసవశమున, జ్ఞానము వృద్ధినొంది

సర్వవ్యాపినై ప్రాణాకాశమందు చిత్తైకాగ్రతనొందును. ఇదియే జీవన్ముక్తావస్థ. "దేహేజ్ఞానేనదీపితే, బుద్ధిరఖండాకారరూపాభవతి" "పిండస్థోపిపరిత్యగాత్మా సర్వవ్యాపీభవతి" పైంగలోపనిషత్తు.

లోకములో మనుజులు మూడు తరగతుల మనస్సుగలవారు గనుందురు. మొదటితరగతివారు గాఢాంధకారమువలె సద్వృత్తి శూన్యులైయుందురు. రెండవతరగతివారు సద్వృత్తి దుర్వృత్తి గల వారై యొకప్పుడు మంచిగుణములు మఱియొకప్పుడు చెడుగుణములు గలవారైయుందురు. మూడవతరగతివారు సదా ఆత్మధ్యానమునే జేయుచు నాత్మక్రీడలోఁ బూర్ణానంద మనుభవించుచుందురు.





# స్వప్నముల వివరణలు.

శ్రీ గణేశాయనమః.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

హరిః ఓమ్.

శ్లో॥ శ్రీమత్సదానంద మచింత్యమవ్యయం।
శ్రీమత్సదానందమరూప మద్వయం।
శ్రీమత్సదానందమఖండ మచ్యుతం।
శ్రీమత్సదానంద గురుంనమామ్యహం॥

— పీఠికలోఁ జెప్పినఁ గొన్ని హాంశముల వివరణ. —

1. నేనా యుదయమున పాదప్రక్షాళనమిషమీద నూతిదగ్గఱకు వెళ్లడము, దానిలోఁ బడిన విధానము "బుద్ధిః కర్మానుసారిణీ" యను లోకోక్తికి దృష్టాంతముగానుండెను. "హరిణాపిహరేణాపి బ్రహ్మణాపి సురైరపి। లలాటలిఖితారేఖాపరిమార్ష్టుం నశక్యతే" యను శ్లోకము ప్రకారము, నూతిలోఁ బడవలసిన ప్రారబ్ధము, వెనుకటిచర్యకు వ్యతిరేకముగ, నన్ను నూతియొద్దకు దీసుకుపోయినది. దానినుండి బైకివచ్చుటకుఁ గారణమైన మనుజుఁడు శ్రీ పరమేశ్వరప్రేరణచేఁ దటస్థించెననియు; సృష్టిలోనుండు సర్వజీవుల రక్షణ సదా జేయుననియును దెలియవలెను. ద్రౌపది, గజేం

ద్రిను, శ్రీహరినిగూర్చి ప్రార్థించిన బిదపఁ రక్షింపఁబడిరి. నా బాల్యావస్థలోనట్టి ప్రార్థనలేకనే రక్షణనొసఁగెను.

2 డిస్ట్రిక్టు మునసబుద్యోగము లభించలేదు. కాని, న్యాయాధికారము—సబుమేజస్ట్రీటుద్యోగము లభించి రమారమీ యిరువదిమూడు సంవత్సరములు (స్వశ్లాఘనకాదు) పక్షపాతముగాని స్వలాభముగాని లేకుండ మనస్సాక్షిని నమ్మి న్యాయపరిపాలనచేసి, 1902 సంవత్సర ఏప్రిల్ నెలలో నుపకార వేతనము (pension) పొందితిని. శ్రీ పరమేశ్వరకృపవలన నా కెన్నడును పరస్త్రీ పరధనాదులందు బుద్ధిపుట్టలేదు.

3 పెదతిరుమలనుండి శ్రీ వెంకటేశ్వర మంత్రములభించుటకు దైవమేకారణమని చెప్పవచ్చును. ఆ మంత్రమును బంపిన సన్యాసి నేనెరిఁగినవారుకారు.

## —♦ 1 స్వప్న వివరణ ♦—

స్వప్నోపదేశప్రారంభమున రామమంత్రమనఁగా సాకార సగుణ బ్రహ్మోపదేశముచేయుటకుఁ గారణమేమనఁగా—

ముండకోపనిషత్తులో "ద్వేవిద్యేవేదితవ్యే" యని విద్యావిద్యాభేదముచేత, బ్రహ్మము, నిర్గుణము, సగుణమని ద్విరూపముగఁ జెప్పబడినది. అందు నిర్గుణబ్రహ్మజ్ఞానమే ముఖ్యఫలదాయకమైనను, నదిసాక్షాత్తుగ,—వెంటనే గలుగుట (గీ 12 అ 5 వశ్లో) కష్టముగాన, ముందుగావివిధఫలములుగల సగుణోపాసన, చిత్తైకాగ్రత గలుగుటకు సాధనమని, శ్రుతివాక్యానుసారముగ గురువు తొలుత సగుణబ్రహ్మమంత్రముపదేశించెనని తలఁచెదను.

స్వప్నపదములను బట్టి నా యుద్యోగకాలములో డిస్ట్రిక్టు మేజస్ట్రేటు కోర్టులో నాపైన లంచపు ఫిర్యాదు చేయబడెనని తలంచవలదు. అట్టి ఫిర్యాదెన్నడుఁగాని రాలేదు.

"డిస్ట్రిక్టు మేజస్ట్రేటుశబ్దములు చనిపోయిన జనులను విచారణచేసి తీర్పునొసగు" యముని 'దెలియఁజేయు' నని తలంచెదను. శ్రీ భాగవతము పంచమస్కంధములో నరకలోకవర్ణనము చూడుము. శ్రీరామమంత్రజపఫలితముగ నట్టి విచారణలో నన్ను యముఁడు శిక్షించుట కవకాశముండదని, భావిసూచన నీ స్వప్నములోఁ దెలపెనని నమ్మెదను. ఇందుకు దృష్టాంతముగ నేను శ్రీ పరమేశ్వర దర్శనార్థము శ్రీ రామాలయ యాత్రచేయుటకుఁ బయనమై మార్గములోఁ గురుకటాక్షమువలన సర్వవిఘ్నములను జయించి శ్రీ పరమేశ్వర దర్శనముచేసినటులఁ నప్పుడు నా సత్వము—అంశను శ్రీ పరమేశ్వరుఁడాకర్షించినటుల 16 వ స్వప్నము కలిగినది. నాకు స్వప్నములో రామమంత్రోపదేశము కాకపూర్వము శ్రీరామదేవునియందు విశేషభక్తియుండేది. ప్రతి పునర్వసు నక్షత్రదినము దైవదినమని బ్రాహ్మణునకు రామునిఁ దలచి భోజనము పెట్టుచుండేవాఁడను.

రామతాపన్యుపనిషత్తు రామరహస్యోపనిషత్తులలో, రామశబ్దముయొక్క 'రా' అక్షరము నారాయణాష్టాక్షరీ మంత్రము నుండి 'మ' అక్షరము 'నమశ్శివాయ' మంత్రమునుండి తీయబడెనని, అందువలన 'రామ' శబ్దము శివకేశవుల కన్వయించునని చెప్పఁబడినది. 'రామఏవ పరంబ్రహ్మ రామఏవ పరంతపః । రామ ఏవపరంతత్వం శ్రీరామోబ్రహ్మతారకం ॥ రకారోవహ్నివచనః

ప్రకాశః పర్యవస్యతి, సచ్చిదానంద రూపోస్య । పరమాత్మార్థ ఉచ్యతే । మకారోభ్యుదయార్థ త్వాత్సమాయేతిచ కీర్త్యతే, ఆద్యోరా తత్పదార్థ స్యాన్మకార స్త్వంపదార్థవాన్ । తయోస్సంయోజన మసీత్యర్థేతత్వవిదోవిదుః," రామరహస్యోపనిషత్తు 'తత్వమసి' యను మహావాక్యములో 'తత్' యను పదము సర్వజ్ఞత్వాదిలక్షణములు గలిగి సృష్టికి నాదికారణమై వాఙ్మనస్సులకుఁ గోచరము గాక భూతసృష్టికి, గారణమైన—యోనిగానున్న ప్రకృతిస్థానీయుఁడై 'అహం' పదలక్ష్యార్థమైన బ్రహ్మమును తెలుపును. ఇదియే జీవోపాధియొక్క అంతఃకరణములో 'త్వం', నీవు, యనుశబ్దమునకు లక్ష్యార్థమైయుండు బ్రహ్మము—ప్రత్యగాత్మనుఁ దెలుపును. ఈ 'తత్', 'త్వం' పదములనఁగా—పరమాత్మ జీవాత్మలకు పాధిగానున్న మాయా, అవిద్యలనుఁ దోసివేయఁగా మిగిలియుండునది బ్రహ్మము యొకటియేయని 'అసి' పదము తెలుపును. రామతాపన్యుపనిషత్తులో రామశబ్ద యోంకార ప్రతిపాదకమని చెప్పబడినది.

మరియు ఋగ్వేదములో జెప్పిన ఓన్నమో నారాయణాయ, యను తారకమంత్రముయొక్క 8 అక్షరములు తెలియఁజేయు బ్రహ్మ, విష్ణు, శివ, బిందునాద, కలాంకలాతీత పరమ పురుషులను యెనిమిదిరూపములు తత్వ, మంత్ర, వర్ణ, దేవతా, చంధస్సు, ఋక్కు, కాల, శక్తి, సృష్టి, భూత, వర్తమాన, భవిష్యత్తుల కతీతమైన ఓంకారముయొక్క అంగములగుటవలన రామశబ్దము అంగములు ఓంకారమని తారసారోపనిషత్తులోఁ జెప్పబడినది. ఎట్లనఁగా

1. అకారము. జాంబవంతుఁడు—బ్రహ్మ.
2. ఉకారము. ఉపేంద్రుడు—విష్ణు, హరినాయకుడు.

3. మకారము. శివుడు. హనుమాన్. శివాంశలలో నొకటి యగు వాయువుయొక్క పుత్రుడు.
4. బిందువు. శత్రుఘ్నుడు—ఈశ్వరుడు, చక్రధరుడు.
5. నాద. భరతుడు. శంఖనామకుడు.
6. కలా. లక్ష్మణుడు. పురుష. భూమిని ధరించువాడు.
7. కలాతీత. సీత. చిత్తు.
8. తత్పరః. పరమపురుష, సత్యపరిపూర్ణ, పరమానంద,

అద్వితీయ ఆద్యంతరహితమైన సాక్షిచైతన్యము పురుషోత్తముడు. గాన రామస్వరూపము పంచమహాభూత పంచీకరణము కాదు. మరి చైతన్యము, శాంతాత్మ, సచ్చిదానందమూర్తి. సీతా రామాంజనేయ సంవాదములో శ్రీరాములవారు హనుమంతునకుఁ జేసిన యుపదేశములోఁ బార్వతీపరమేశ్వరులు మొదలుగా సర్వ దేవతలు, ఋషులు, మునులు, సర్వజ్ఞానులు „ అహంబ్రహ్మాస్మి " యను వృత్తిచే సర్వకాలములను తనయందుఁ (రమయతి రమంతే అస్మిన్ ఇతివా రామః) గ్రీడించుచుండుటంగాన, బ్రహ్మశబ్దమునకు రామ నామముకలిగెననియు, జ్ఞానులంతర్ముఖులై దేహమనోబుద్ధ్యహంకా రముల, నిరాకరింపఁగ జీవరూపుఁడనై యనఁగా గూటస్థరూపుఁ డనై శేషింతుననియు నుపదేశించెను.

ఇక నీ రామశబ్దమును ముమ్మారుచెప్పుటకుఁ గారణమేమ నగా? బుద్ధివృత్తికి నెప్పుడును సాక్షియై నిర్వికారుఁడై కూటస్థరూప ముతోనున్న తన భావమును సూచించుటకై మొదటి 'రామ' పద మును, బ్రహ్మవిద్యకు "శ్రీ" యని పేరుండుటవలన బహ్మాకార బుది వృత్తి జ్ఞానులకు సదా కలిగియుండుటచేతను, మాయాసహిత

మగుఁ బరబ్రహ్మమే సకల ప్రపంచమని బోధించుటకు "శ్రీరామ" పదములును కూటస్థరూపుడనైన నేనే పరబ్రహ్మంబని నిశ్చయించి సదా భావించుటకై మూడవ „రామ" నామము చెప్పంపడెనని యుపదేశించిరి. „సదా రామోహమస్మీతి తత్వతః ప్రవదంతియె । న తే సంసారిణో నూనంరామఏవ నసంశయఓమ్." యని రామరహాస్యోపనిషత్తులోఁ జెప్పఁబడెను.

మరియు „రామశ్రీరామరామ" యను నామత్రయము క్రమముగ ఓంకారముయొక్క అఉమ్ వర్ణముల దెల్పుచు మూర్తిత్రియ, గుణత్రయ, శక్తిత్రయ, సృష్టిస్థితి లయకారణత్రయములై తురీయావస్థలో బిందునాదకళల నతిక్రమించిన „సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" యని వేదములోఁ జెప్పఁబడిన బ్రహ్మరూపమును దెల్పునని తలఁచెదను.

ఇదిగాక ఆగామి, సంచిత, ప్రారబ్దము లనెడు కర్మలయొక్కయు, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములనెడు తాపములయొక్కయు నివారణకొరకు మంత్రములో ముమ్మారు రామనామము చెప్పఁబడెనని నా నిశ్చయము.

రామమంత్రమున కంగములెవ్వియని ఋషులడుగఁగా, "వాయుపుత్రం, విఘ్నేశం, వాణీం, దుర్గాం క్షేత్రపాలకం, సూర్యం, చంద్రం, నారాయణం, నరసింహం, వాయుదేవం, వరాహం, తత్సర్వాన్ సమాతాన్ సీతాం, లక్ష్మణం, శత్రుఘ్నం, భరతం, విభీషణం, సుగ్రీవ, మంగదం, జాంబవంతం, ప్రణవమేతాం, రామస్యాంగాని జానీథా" యని అంగములను వినాగా రామ ధ్యానము

విఘ్నకారి యని హనుమంతుఁడు రామ రహస్యోపనిషత్తులో నుడి వెను. గాన రామభక్తులు రామాంగములను ధ్యాన కాలమందు పఠించవలయును.

దైవధ్యానమును గూర్చి ప్రకారాంతము లుపనిషత్తులలో ను, నితర గ్రంథములలోనుఁ జెప్పబడినవి. మనోనిగ్రహము కొరకుఁ గొందరు విగ్రహారాధనను, గొందరు మూర్తిధ్యానమునుఁ జెప్పిరి. కొందరు అమూర్తధ్యానము ముఖ్యమనిరి. ఇవియన్నియు సాధ నములేకాని ప్రతి మనుజుఁడు తన మనస్సుయొక్క నిర్మలత్వము, స్థితిని సరిగాఁ దెలుసుకొని, తనకు సాధ్యము, సాధనమని తోచిన మార్గమవలంబించవలయును.

పాషాణ లోహ మణి మృణ్మయ విగ్రహములఁ బూజ పు నర్జన్మములను భోగములను గలుగఁజేయునని, పునర్జన్మ రాహిత్య ముకొరకు బాహ్యార్చనవిడిచి, స్వహృదయమందు స్వస్వరూపధ్యాన ము చేయవలెనని మైత్రేయోపనిషత్తున్ను, మూర్తిధ్యాన మసత్య మని, మూర్తరహిత ధ్యానము సత్యమని మైత్రాయిణ్యుపనిషత్తు బోధించుచున్నది. "అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః- దర్శనోపనిషత్తు.

ధ్యానఫలములనుగూర్చి, అర్థవాదములు ప్రతిగ్రంథములో నుఁ జెప్పఁబడినవి. ధ్యానఫలము, ధ్యానకాలమందుఁ, జేయువాని మనఃస్థైర్యము, చాంచల్యరాహిత్యమును బట్టియుండును. గీతల 4 అ. 11 శ్లోకములో శ్రీకృష్ణుడు "యెయథామాం ప్రపద్యంతేతాంస్త థైవభజామ్యహం" అని చెప్పియున్నారు. భక్తునియొక్క ధ్యాన

దార్ఢ్యత మనోనిర్మలత పరమేశ్వరునికే తెలియునుగాని చేయువానికిఁగాదు. భోగైశ్వర్యములను గోరుజనులకు స్థిరమైనబుద్ధి గలుగదని గీతలయొక్క 2 అ. 44 శ్లోకము చెప్పుచున్నది. ఎవ్వఁడేని ప్రియాప్రియములు లేక, యింద్రియములను మనస్సును స్వాధీనముచేసుకొనునట్టి వాఁడు శరీరపోషణకొరకు నింద్రియ విషయముల ననుభవించినను, నిర్మలత్వమునుబొందును. గీతల 2 అ. 64 శ్లోకము.

"బ్రహ్మవేదన మాత్రేణ బ్రహ్మాప్నోత్యేవ మానవః"

అని కఠోపనిషత్తులోఁ జెప్పినటుల, బ్రహ్మయందు నిండుభక్తి విశ్వాసము కలిగి సదా బ్రహ్మను దనమనస్సులోఁ జ్ఞాపకముంచుకొనుట శ్రేయస్కరమని నా నిశ్చయము.

## 2 స్వప్న వివరణ

పాతక్రొత్త మాతల తాత్పర్యము తెలియలేము. రామమంత్రోపదేశమునకుఁ బూర్వము చేయబడిన యుపాసన పాతది య్యై యని దరిమిలాయుపాసన క్రొత్తదయ్యెయనియు, నీ రెంటిలో రెండవది మొదటిదానికంటె మంచిదని తెలియుటకుఁ దల్లియైన బుద్ధి చైతన్యము క్రొత్తమాతి నీరు మంచిదని చెప్పి త్రోడినట్లూహించదగియున్నది.

సప్తమహాఋషులనగాఁ బంచజ్ఞానేంద్రియములు, మనస్సు, అహంకారములని, వీని వానివిషయములయందుఁ బ్రవర్తింపనీయక నిరోధించిన, మనస్సుయొక్క చంచలత్వము నశించునని వెలివేటి భాస్కరశాస్త్రిగారు, రేమెళ్ల బ్రహ్మన్నశాస్త్రిగారు చెప్పినారు.

"శబ్దాదివిషయాన్పంచ । మనశ్చైవాతిచంచలం । చింతయె దాత్మనోరశ్మీన్ప్రత్యాహారస్స ఉచ్యతే" యని అమృతనాదోపనిషత్తు, విషయేష్వాత్మతాం దృష్ట్వామనసశ్చిత్తరంజకం । ప్రత్యాహారస్సవిజ్ఞే యోభ్యసనీయోముహుర్ముహుః యని తేజోబిందూపనిషత్తు ప్రథమాధ్యాయములోను "విషయేభ్య ఇన్ద్రియార్థేభ్యో మనోనిరోధనం ప్రత్యాహారః" యని మండలబ్రాహ్మణోపనిషత్తులోను జెప్పుటచేత నీ స్వప్నము ప్రత్యాహారమును దెలియఁజేయుచున్నది. కాని మనోనిగ్రహము బహుదుర్గమము. ఇంద్రియముల నిగ్రహముకొరకే యమ, నియ మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన సమాధి, మార్గముల యోగాభ్యాసము లేర్పఱచఁబడినవి, పూర్వమునుంచి పుణ్యపురుషులు వానిని జయకరముగ నభ్యసించి తరించుచుండిరి. మనోనిగ్రహముకొరకుఁ బ్రతియుపనిషత్తులో నేదోయొక మార్గము చెప్పఁబడినది. "చంచలంహిమనః కృష్ణ । ప్రమాథి బలవద్దృఢమ్, తస్యాహం నిగ్రహం మన్యేవాయోరివసుదుష్కరం," అని అర్జునుఁడు శ్రీకృష్ణునిఁ బ్రశ్నించెయ, అసంశయంమహాబాహోమనోదుర్నిగ్రహంచలం । అభ్యాసేనతు కౌంతేయ, వైరాగ్యేణచగృహ్యతే" యని శ్రీకృష్ణుఁడు ప్రత్యుత్తరమిచ్చెను గీ. 6 అ. 33-34 శ్లోకములు.

"స్వాత్మన్యేవ సదాస్థిత్వా మనోనశ్యతియోగినః," యని తురీయాతీతావధూతోపనిషత్తులోను, "ఏకం బ్రహ్మ చిదాకాశం సర్వాత్మక మఖండితం । ఇతిభావయయత్నేన చేతశ్చాంచల్యశాంతయే" యని మహోపనిషత్తులోను, నశక్యతేమనోజేతుం వినాయుక్తి మనిందితాం । శుద్ధాం సంవిదమాశ్రిత్య వీతరాగస్థిరోభవ" యని

అన్నపూర్ణోపనిషత్తు 4 వ అధ్యాయములోను జెప్పఁబడినవి. ఇవి మనోనిగ్రహాభ్యాసమునకు సులభసాధనములు.

ఇచట "మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః। రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కలికి రేవచ" యను శ్లోకములో శ్రీ మహావిష్ణువుయొక్క దశావతార క్రమమును గూర్చి ఆలోచించుటవలన, జీవుఁడు నిర్గుణబ్రహ్మమునుండి వెడలినఁ బిమ్మట సృష్టిక్రమములో నెటి రూపములు ధరించి, తుదకుఁ బ్రహ్మములోఁ దిరుగ చేరునది తెలియునని, ముముక్షువునకు మనోనిగ్రహ ప్రయత్నములోఁ గొంతసాధనమగునని తలఁచెదను.

జీవుఁడనగ నిర్గుణబ్రహ్మయొక్క అంశ—లేశము—ప్రత్యగాత్మ—కూటస్థచైతన్యము—స్వస్వరూపము—మనస్సు.

జీవులు నిర్గుణబ్రహ్మమునుండి వెడలుటలో సృష్టికి యోని యగుఁ (గీతల 14 అ. 3 శ్లో.) బ్రకృతియొక్క సత్వ రజ స్తమో గుణములతోఁ ననివార్యముగఁ బూయఁబడినందున "చైతన్యము" "జడము" లేక "ఆత్మా" "ఉపాధి" యను వ్యతిరేకములు—ద్వంద్వములు యేర్పడినవి. ఈ ద్వంద్వములు, స్వస్వరూపమును మరుగు పరచి మోక్షహానికరములుగా నున్నందున వానినిఁ దప్పించుకొనుటకు జీవులు ప్రయత్నించును. ఈ ప్రయత్నములోఁ బ్రకృతిగుణములు బహువిధబంధములనఁగా విఘ్న పరంపరలఁ గలుగఁజేయును.

జీవులు మొదట అణువుల రూపమున ఖనిజములలోఁ బ్రవేశించును. అప్పుడు మనస్సు బీజరూపమున నుండును. పిదప వృక్షములుగా నేర్పడును. వీనియందు మనస్సు మిక్కిలి గూఢమై

యుండును. ఇందుకు దృష్టాంతము మన మొక మొక్కను నొక చెట్టు క్రిందగాని, సమీపమునగాని పాతినయెడల, దానిపైన వ్యాపించి యుండెడు ఆచ్ఛాదనమనఁగాఁ గప్పును దప్పించుకొనుటకు మొక్క యొక వైపునకు వాలి పెరుగుట కారంభించును. ఆచ్ఛాదనము తీసివే యఁబడినచో, మొక్క తిరుగ నిలబడి తిన్నగాఁ బెరుగును. విశే షించి, వాని సుఖస్థితి, కాయిలాస్థితి గూడ పైస్వరూపమువలనఁ దెలియఁబరచును. ఇది అందరు తరుచుఁ జూచువిషయమె.

వృక్షములలోనుంచి జీవులు జంతువులలోఁ బుట్టును. అప్పుడు వాని శరీరస్థితినిఁబట్టి మనస్సుకొంత ప్రజ్వలించును. ఏజాతి జంతు వులలోఁ గాని మనస్సు అన్నిటియందు సమముగానుండదు. వాని యొక్క పూర్వకర్మ సంస్కారములనుఁ బట్టి, కొన్నిటియందు హె చ్చుగాననఁగాఁ బ్రకాశముగను, కొన్నిటియందుఁ దక్కువగ ననఁగా మందముగనుండును.

1 జంతువులలో జీవులు మొదట జలచరములుగాఁ బుట్టును. జలము విద్యను తెలియజేయును గాన మనస్సవిద్యలోఁ బూర్ణముగఁ దమోగుణావృతమై యుండును. ఇదియె మత్స్యావతారము. ఈ అవస్థలో నింద్రియములు సంపూర్ణముగ నుండవు.

2 పిమ్మట జలము ప్రధానమైనను భూమియందుఁగూడ నివ సించఁదగిన జంతువులుగఁ బుట్టును. ఇది కూర్మావతారము. ఈ అవ స్థలో కరచరణాది యింద్రియములు మత్స్యమునకన్న వికాసమై యుండును.

3. తదుపరి జలమునందుఁ బ్రీతిగలిగి, భూమియందు వసించు నట్టి జంతువులుగఁ బుట్టును. దృష్టాంతము వరాహావతారము.

దీనిలో కూర్మముకన్న గమనాగమనములకు యెక్కువశక్తిగలిగిన యింద్రియములతోఁ గూడియుండును.

4. పిమ్మట నర మృగ లక్షణములనగాఁ గొన్ని క్రూరమగు జంతు గుణములు, కొన్ని మనుష్య గుణములు గల మనుష్యులుగాఁ బుట్టుదురు. దృష్టాంతము నరసింహావతారము.

5. తరువాత కేవల తమోగుణ ప్రధానమైన మృగ జన్మముల విడిచి, జీవులు తమోరజస్సత్వగుణములుగల మనుష్య జన్మముల నొందెదరు. ఇది మనుష్య జన్మమునకుఁ బ్రారంభము. అనగాఁ బాల్యావస్థ యగుటవలనఁ దమోగుణముయొక్క ఆవరణశక్తి వలన దృష్టి గోచర పదార్థమంతయుఁ, దనదేయని యాక్రమించును. ఇదియే వామనావతారము. బాల్యదశయందు యుక్తాయుక్త వివేచనగాని న్యాయాన్యాయ వివేచనగాని యుండదు. తనదను నాశయె ప్రధానము. బ్రహ్మచర్య మనుష్ఠింపఁదగినకాలము.

6. పిమ్మట రామావతారమనఁగా పరశు రామావతారము. బాల్యదశదాటిన యవతారము. దీనియందు సంపూర్ణరజోగుణకార్యములగు నిండుస్వాభిమానము, శౌర్యము, పరాక్రమము, పట్టుదల, శత్రుజయమును గాంక్షించు జన్మగానుండును. రజోగుణము యొక్క విక్షేపశక్తి ప్రధానమై గీతయొక్క 16 అధ్యాయ 12 శ్లోకములోఁ జెప్పినట్టుల నాశాపాశములచేతఁ గట్టబడి కామ క్రోధ పరాయణుఁడై యుండును.

7. తరువాత దశరథ రామావతారము. యౌవన దశనుఁ దెలియఁజేయునవతారము. వెనుకటి జన్మలలో జీవుఁడనుభవించిన

సుఖ దుఃఖములవలనఁ జిత్తశుద్ధికలిగి యీ జన్మలో సత్వగుణవాసనలు మనస్సునయందుదయించుటచేత సద్గురువగు వసిష్ఠునివలన జ్ఞానబోధనొంది కర్మేంద్రియ పంచకము, జ్ఞానేంద్రియ పంచకము, అంతఃకరణ చతుష్టయమునను తత్వముల నిరోధమనగా జయముకొరకు పదునాలుగు వత్సరములు వానప్రస్థాశ్రమ మవలంబించి, తమోగుణ ప్రధానులగు ఖరదూషణాదుల సంహరించి, సద్వాసనలనెడు వానర సమూహముల సహాయమున నవిద్యయనెడు సముద్రమును సేతువచేఁగట్టి, అసద్వాసనలను రాక్షససమూహముల నశింపఁజేసి, ఆనందమను సీతను నపహరించిన మహామోహుఁడను రావణునిసబలయుక్తముగ నాశనమొనరించి ఆనందమను సీతను దిరిగి గ్రహించెను.

ఈ రామావతారము సత్యప్రవర్తనకు, సకల సద్గుణములకు స్థానభూతమై, సర్వసులక్షణ సంపన్నముగ నున్నది. శ్రీమద్రామాయణములో „సర్వే వేద విదశ్శూరాస్సర్వే లోకహితేరతాః। సర్వే జ్ఞానోప సంపనాస్సర్వే సముదితా గుణైః॥ తేషామపి మహాతేజారామస్సత్య పరాక్రమః। ఇష్టస్సర్వస్యలోకస్య శశాంక ఇవనిర్మలః" బాలకాండ 18 సర్గలోఁ జెప్పినటుల సద్గుణ సంపన్నుఁడు సర్వత్రవిజయము నొందును. లోకములో నాశకంటె గొప్పనేరము, తన స్థితితో తృప్తి నొందమికంటె గొప్పయాపద, యింకా కావలెనను కోరికకంటె గొప్ప పొరబాటు లేదని పెద్దలు చెప్పెదరు. ఇవి పూర్వసత్యవాక్యములు.

8. పై శ్లోకములో మూడవ రామశబ్దము శ్రీకృష్ణావతారమనగ, జీవునియొక్క యెనిమిదవ యవతారము. ఇందులో జీవుఁడు ప్రాపంచిక వ్యవహారములలోఁ బ్రవర్తించుచు గృహస్థుఁడై సంసార

సుఖములం బూర్తిగా ననుభవించుచు సంపూర్ణజ్ఞానియై ముక్తికి భక్తియే ముఖ్యసాధనమని బోధించెను.

9. బౌద్ధావతారము. ఇది వార్ధక్యదశ చేష్టలను బోధించు సంపూర్ణ కరుణావతారము. ఈ దశలో జీవుండు పూర్ణజ్ఞానియై, సంసార వాసనలను విడిచి, జీవన్ముక్తావస్థలో బూర్ణవిరాగియై యోగాభ్యాసమున గాలము గడుపును. ఈ సందర్భమున గీతలయొక్క 6 అ. 27-40-45-46-47 శ్లోకములను 4 అ. 10 శ్లోకమును, 12 అ. 13-14 శ్లోకములను 10 అ. 10 శ్లోకమును 13 అ. 12. శ్లోకమును జూడుము. ఈ యవతారమునందు సన్యాసము సర్వజీవుల యందు కరుణ, సంయమ వ్రతానుష్ఠాన పరత్వము తన ఆత్మ సాక్షాత్కారమే ముక్తిసాధనమని తెలియంజేయును. "సంధాజీవాత్మనోరైక్యం సన్యాసః పరికీర్తితః" మైత్రేయోపనిషత్తు.

10. కలిక్యవతారము. ఇది నిర్వాణదశ. తురీయావస్థలో జీవుండు మోక్షము నొందును.

మరియు ప్రతియవతారగుణములు—లక్షణములు ప్రతిజీవుని యొక్క జీవితకాలములో నాయాదశలయందుం బొడంజూపును.

పైనవివరించిన ప్రకారము నిర్గుణ బ్రహ్మమునుండి వెడలిన ప్రతి అంశ-ప్రత్యగాత్మ తిరిగి బ్రహ్మములోం జేరువరకు ఖనిజములాదిగ బ్రహ్మజ్ఞానివరకు నానేకమార్పులగ, నసంఖ్యములైన జన్మ పరంపరల నొంది, తుదకు మోక్షముం బడయును. మోక్షసిద్ధి కలుగువరకుం బ్రతిజన్మలోను సుఖ దుఃఖానుభవములను బుటమువలన (మలిన బంగారము మేలిమి బంగారమైనటుల) మనస్సు క్రమముగ మాలి

స్వరహితమై, యనఁగా మొదట నిండు తమోగుణ జన్మలనొందిదియావరణ శక్తిని, పిమ్మట రజోగుణ ప్రధానమైన జన్మలలో విక్షేపశక్తిని జయించి, తదుపరి సత్వగుణప్రధానమైన మానుషజన్మలలో సాధన చతుష్టయముద్వారా సద్గురూపదేశముల బడసి, అవిద్యయను పొర నతిక్రమించి, యనఁగా నశింపుజేసి స్వస్వరూపమనఁగఁ బరబ్రహ్మము జేసును. ఇదియేముక్తి. పునర్జన్మ రహితస్థానము.

"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" యను వాక్యమును బట్టి స్వర్గము పునర్జన్మ రాహిత్యస్థానముకాదు.

అవిద్యాపొరను నశింపు జేయుటకు దన మనస్సె తనకాధారముగాని వేరుమార్గ మేదియులేదు. మనస్సనగా తానే—సాక్షి చైతన్యము—అంశ—కూటస్థచైతన్యము—ప్రత్యగాత్మ లేక స్వస్వరూపము. ఇది త్రిగుణాత్మికయగు స్వశక్తియను అనాద్యవిద్యచేత నావృతమై, తన నిజస్వరూపమునుమరచి, తాను జీవుఁడనని కించిజ్ఞుఁడనని భ్రమించి సంసార సముద్రములోబడి యత్యంతములైన సుఖదుఃఖములకు లోనై కాలక్రమమున సుకృతకర్మ పరిపాకము వలన వైరాగ్య వృత్తులు మనస్సులో నుదయించును. ఇట్టి నూతన వృత్తులకునూ చిరకాలాభ్యస్తములైన రజస్తమో వృత్తులకునూ, మనస్సులో గొప్పయుద్ధము సంభవించును. ఇదియే రామ రావణ యుద్ధము. ఈయుద్ధములో రాక్షసవృత్తులు నశించి సద్వృత్తులకు జయము గలుగును. సద్వృత్తులనఁగఁ గీతల 16 అ. 1-2-3 శ్లోకములలో వివరించిన దైవీసంపద్గుణములు. తదితరవృత్తులు, అసురవృత్తులు, గీతల 16 అ. 7 శ్లోకమునుంచి చివరవరకు శ్లోకములు.

విచారణ బుద్ధిగల ప్రతి మనుజునకుఁ బ్రతి క్షణమున నీయుద్ధము తన మనస్సులోనే జూడనగును. మనస్సులో దుర్వృత్తు లనఁగా రజస్తమోవృత్తు లుదయించిన వెంటనే వివేకబుద్ధిచేత వానిని పారఁదోలవలయును. ఇట్టియభ్యాసము వలన మనస్సులోఁ దరుచుగ నుదయించు దుశ్చింతలు దుర్వృత్తులు దుర్వాసనలు యాధార రహితమై క్రమముగ నశించును. మాలిన్యము నశించుటచే, మనస్సు చాంచల్య రహితమై స్వస్వరూప ధ్యానములో స్థిరతనొందును. ధ్యానము, జ్ఞానము వృద్ధినొందినకొలది మనస్సులో గూఢముగనున్న సూక్ష్మశక్తులు వ్యక్తమగుచుండును. ఇందుకు సందియములేదు.

బాలురు రావణుని కాష్టమెప్పుడుగాని ఆరిపోకూడదని సదా మండుచుండుటకై ఆంజనేయుఁడు జనులు దంతధావనము చేయు పుడకలనుఁ బోగుచేసి కాష్టములో వేయుచుండునని చెప్పుకొను చుందురు. ఈవాక్యములో మంచి సద్బోధకలదు. ఏమనఁగా - ఆంజనేయుఁడు శివస్వరూపుఁడు. గురువు, మహామోహుఁడైన రావణుని యునికిపట్టగు లంకాపట్టణములో రాత్రివేళ ప్రవేశించి యంతఃపురవనములో నతిగూఢముగ దాచఁబడిన సీతను, నిశా సమయమునఁ బ్రాకారములను దాటి చూచెను. అంతఃపురమనఁగ హృదయస్థానము. ప్రాకారములు—అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు. వీనిని రాత్రి—నిశాసమయ మున దాటి ("యానిశాసర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ." గీతల 2 అ 69 శ్లో) యనఁగా నిశ్చల ధ్యానములో నతిక్రమించిఁ ఆనందమయకోశములో గుప్తముగ దాచఁబడిన ఆనందమను సీతనుఁ జూచిఁ పిమ్మట పట్టణమనఁగా మహామోహుని పరివారమైన

రాక్షసులు—అసద్వృత్తులుండు స్థానములనుఁ గాల్చివేసి, శ్రీరాము నకెఱింగించిన మహావీరుఁడు. రావణకాష్ఠమెపుడుగాని ఆరిపోకుండఁ బుడకలవేయుచుండుననఁగా మనస్సులోనెపుడుగాని దుర్వృత్తులు దుర్వాసనలు కలుగకుండునటుల, జ్ఞానమను కాష్ఠాగ్నిలో దంతధావనపుడకలనెడు నిరర్థకవృత్తులను దహనముచేయుచు సదాబ్రహ్మ విచారముచేయుమని బోధించును.

మరియు "సదృశంచేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి। ప్రకృతింయాంతిభూతానినిగ్రహః కింకరిష్యతి." యను గీతల 3 అ 33 శ్లోకమును బట్టి మనుజుఁడు స్వకీయమైన పూర్వకర్మచే బద్ధుఁడగుటఁ జేత, నీ జన్మయందు జ్ఞానియైనను పూర్వకర్మవాసనలయొక్క బలముచేత మనోనిగ్రహము దుర్లభతమముగానుండుట సత్యమే. అయినను మనుజుఁడు, యుక్తాయుక్తవివేకమనఁగ మంచిచెడ్డలను తెలుసుకొనఁదగిన తెలివి—బుద్ధికలవాఁడుగాన, నీ బుద్ధిని సరిగా నుపయోగించినచో, పూర్వకర్మవాసనలు కూడ మంచికే పరిణమించునని నానమ్మకము. దృష్టాంతము- ఒకనికి సంగీతము విని యానందించవలసిన కాలము తటస్థించినది. ఆ వినోదమునొందుటకు (1) వేశ్యాగృహమునకు వెళ్లి కామోద్రేకకీర్తనలఁ బాడించవచ్చును. (2) ఒక భక్తునియింటికి వెళ్లి శ్రీకృష్ణ కర్ణామృతములఁ బాడించవచ్చును. వీనిలో నేఁచేసినను తత్కాలమందుఁ బూర్వకర్మఫలానుభవము పూర్తియగును. కాని మొదటిది సంచిత కర్మలోఁ జేరి ఉత్తర జన్మ ప్రారబ్ధమునకు హేతువగును. రెండవది సంచిత కర్మ నాశమునకుఁ గారణమగును.

ఎట్లనఁగా- జ్ఞానియగు మనుజుని మనస్సులో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములతో సంబంధించిన చెడుతలంపు లుదయించు నపుడు ("వివేకం పరమాశ్రిత్య బుద్ధ్యాసత్యమ వేక్ష్యచ ఇంద్రియారీనలంఘిత్వాతీర్ణో భవ భవార్ణవాత్." యను నుపనిషద్వాక్యసారమున) వెంటనే వాని స్వభావమనఁగా యుక్తాయుక్తములను వివేకజ్ఞానముతో నాలోచించిన, యవిశాస్త్రసమ్మతమైనది లేక విరుద్ధమైనది తెలియనగును. అపుడు కర్తవ్యాంశము స్పష్టమగుచున్నది. అట్లు చేయనివాఁడు "ఇతః కోన్వస్తిమూఢాత్మాయస్తు స్వార్థేప్రమాద్యతి । దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషం" యని శ్రీ శంకరాచార్యులవారు జెప్పినటులజ్ఞాని కాక మూఢుడే యగును. వివేక బుద్ధి వికసించుటకే విద్యాభ్యాసము, గురుబోధావశ్యకత, సజ్జనసేవ, శిక్షాస్మృతులు మొదలగునవి యేర్పరచఁబడినవి.

ఇంతేగాక గీతల 3 అ 28 శ్లోకములో "గుణాగుణేషువర్తంత ఇతిమత్వాన సజ్జతే." యని, 5 అ 9 శ్లోకములో "ఇంద్రియాణీంద్రియార్థేషువర్తంత ఇతిధారయన్." యని, అనఁగా నింద్రియములు వాని వాని విషయములయందుఁ బ్రవర్తించుచున్నవని, పరిత్యాగాత్మమైన తనకు వాటితో సంబంధములేదని తెలుసుకొని, వానితోఁ దాదాత్మ్యము నొందఁగూడదు.

విశేషించి (గీతల 14 అ 23 శ్లోకము) త్రిగుణాతీతుఁడు గుణములయందును, వాని కార్యములయందును లక్ష్యములేనివాఁడై జరిగే సమస్త కార్యములు త్రిగుణవ్యాపారములని తెలిసికొని తాను చంచలించకయుండునని చెప్పుచున్నది.

ఈ సాధనములవలనఁ బూర్వకర్మ మలినవాసనలు సంస్కారములు క్రమముగ తగ్గి తుదకు నశించును. గాన "నిగ్రహః కింకరిష్యతి." యను వాక్యముఁబట్టి మనోజయము సాధ్యముకాదని తలంచుట భ్రాంతియని నా నమ్మకము.

## —♦ 3వ స్వప్నము. ♦—

ఈ స్వప్నఫలము దాఖలా మొదట పుత్రుఁడు గలిగి, పిమ్మట కాకినాడటవును మేజస్ట్రీటు హోదానుండి నరసాపురం స్పెషలు మేజస్ట్రీటుగా జీతము వృద్ధికలిగినది. ఈ యుద్యోగములోఁ బది సంవత్సరములుంటిని. ఈమధ్యకాలములో నిద్దరు కలెక్టరులు తహశ్శీలుదారు పని నివ్వదలఁచిరి, గాని యప్పటి గృహసంబంధబాధలు, బాహ్యకారణముగఁ గనుపించి తహశ్శీలుదారుపని నిరాకరించితిని స్వప్నములో నొక పరిమోషనుమాత్రమె చెప్పఁబడినది.

స్వస్వరూప దర్శనమన నేమో నాకు మొదట దెలియలేదు. క్రమముగా దేవుని, గురువుల దయచేత "నాహం మన్యేసు వేదేతి। నోనవేదేతి వేదచ" యనెడు శ్రుతివాక్య ప్రకారము యత్కించితు దెలివి గలిగెనని తలచెదను. స్వస్వరూప మనగా—తన నిజస్వరూపము—స్వాత్మ. స్వస్వరూప దర్శనమనగా—తనుదా తెలియుట. తనయాత్మ—ప్రత్యగాత్మను దెలుసుకొని, సదా తన మనస్సునుఁ బ్రత్యగాత్మ యందుంచుట, ప్రత్యగాత్మను జూచుట, ప్రత్యగాత్మను ధ్యానించుట, ప్రత్యగాత్మలో మనస్సును లీనముచేయుట. ప్రత్యగాత్మయనగాఁ నద్వితీయమై రెండవది లేనిది. "ఏకమేవా ఽ ద్వితీయం బ్రహ్మ" శ్రుతి - సజాతీయ విజాతీయ, స్వగత భేదములు

లేనిది. ఇట్టిదని చెప్పుటకు, నూహించుటకు సాధ్యము కానిది. శాశ్వతమైనది. స్థిరమైనది. రూపములేనిది. సర్వవ్యాపకమై దేశకాల చలనములులేని బ్రహ్మము. సర్వము నశించగా శేషించియుండునది. పుట్టుక చావు లేనిది. గీతల 2 అధ్యాయము 20_30 శ్లోకములను జూడుము. ఈ యధ్యాయ మంతయు నాత్మను బోధించుచున్నది.

“ సర్వవస్తు పరిత్యాగే శేషమాత్మేతి కథ్యతె ” అన్న పూర్ణోపనిషత్తు ప్రథమాధ్యాయము.

“ అఖండానంద మాత్మానం విజ్ఞాయ స్వస్వరూపతః ” అధ్యాత్మోపనిషత్తు.

“ పిండస్థాపి ప్రిత్యగాత్మా సర్వవ్యాపీ భవతి । హృదయం నిర్మలం కృత్వా చింతయిత్వాఽప్యనామయం ” పైంగలోప నిషత్తు 4 అధ్యాయము

“ స్వస్వరూపంతు చిన్మాత్రం సర్వదా సర్వదేహినాం ” వరాహోపనిషత్తు ద్వితీయాధ్యాయము.

“ స్వస్వరూపా విశేషోసిస్వానం దాబ్దాని మజ్జసి । స్వస్వరూపాన్న చలసి । స్వస్వరూపేణ జృంభసి । స్వస్వరూపాద నన్యోసిహ్యహమెవాసి నిశ్చిను ” తెజోబిందూప నిషత్తు. పంచమాధ్యాయము.

“ దేహేజ్ఞానే నదీపితె బుద్ధిరఖండాకార రూపాభవతి ” పైంగలోపనిషత్తు. 4 అధ్యాయము.

" స్వస్వరూపాను సంధాన మేవం కృత్వాసుఖీభవ " అన్న పూర్ణోపనిషత్తు ప్రథమాధ్యాయము.

" స్వస్వరూప దర్శనము—తన స్వరూపమును తాను తెలుసుకొనుటకుఁ దన మనస్సే సాధనముగాని వేరుమార్గ మేమియు లేదు. మనోనిగ్రహము కలుగ జేసుకొని సదా తనను—ప్రత్య గాత్మను, తానే—నిర్మల మనస్సుచేతఁ బ్రత్యగాత్మ స్వరూపుఁడనని ధ్యానించవలెను. మరియు, తాను సత్వరజస్తమోగుణములు, ప్రపంచ సంబంధమైన కోర్కెలు, వాసనలు లేనివాఁడనని, పంచకోశములకు సాక్షినని, దేహత్రయ విలక్షణుఁడనని, గాన నిత్య శుద్ధ స్వయంప్రకాశుఁడనని, నిశ్చల జ్ఞానముతో నుండుట స్వస్వరూపధ్యానమగును. ఇట్టి ధ్యానముచే జీవునియొక్క అధిదోపాధిని, ఈశ్వరునియొక్క మాయోపాధిని, వేదాంత విచారణచేతఁ దొలగించినపుడు అఖండ బోధగలుగును.

" ఆశ్చర్య వత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్య వద్వదతి తథైవ చాన్యః । ఆశ్చర్య వచ్చైనమన్య శ్శృణోతి శ్రుత్వాప్యేనం వేదన చైవకశ్చిత్ " యని భగద్గీతల 2 అ. 29 శ్లోకములో జెప్పినటు లెవరుగాని యాత్మను—దాని స్వరూపము నెరుగజాలరు. పురుషుఁడు తన మనస్సు చేతనే దనను‌ద్ధరించు కొలవలయును గాని వేరు మార్గము—సాధనములేదు. గీతల 6 అ. 5-6 శ్లోకములు.

## —♦ 5 స్వప్నము. ♦—

వేదాంత శాస్త్రముయొక్క ప్రాణముగనున్న రజ్జుసర్ప దృష్టాంతము " అజ్ఞానా ద్భాసతే సర్వం త్వయిరజ్జౌ భుజంగవత్ ।

పరిజ్ఞానాల్లీయతే సర్వం త్వయిరజ్జౌ భుజంగవత్" యను నీ చిన్న శ్లోకములో బోధింపబడెను.

శ్లోకములో „ త్వయి " శబ్దము, ఏకమై అద్వితీయమై దృష్టాంతములో రజ్జువుగఁ జెప్పబడిన బ్రహ్మమును దెలుపుచున్నది. అజ్ఞాన దశలో, దృష్టిదోషమువలన మందాంధకారములో, రజ్జుస్థానమున రజ్జువకు బదులుగాఁ గనుపించు సర్పము దీపకాంతిలో ననగా జ్ఞానదశలో జూచునపుడు అదృశ్యమగటనఁగా రజ్జువులో లీనమైపోవుట రజ్జుసర్పభ్రాంతియని చెప్పబడినది. „ సర్వం " శబ్దము తెలియఁజేయు విశ్వము—సంసారము అజ్ఞానదశలో రజ్జువుయందు సర్పమువలె భాసించుననియు, జ్ఞానదశలో—దీపకాంతిలో రజ్జువందు సర్పమురీతి నాత్మలోలీనమగుననియు జెప్పబడినది. „ రజ్జుఖండేపరిజ్ఞాతే సర్పరూపం నతిష్టతి । అధిష్టానే తథాజ్ఞాతే ప్రపంచే శూన్యతాంగతే" నాదబిందూప నిషత్తు. „ రజ్జుసర్ప దర్శనేన కారణాదిభిన్న జగతస్సత్యత్వభ్రమో నివృత్తః " అన్నపూర్ణోప నిషత్తు.

రజ్జుసర్పభ్రాంతి అధ్యాసనమును దెలియ జేయును. అధ్యాసన యనఁగా లేనివస్తువనఁగా—ప్రపంచము—సంసారము యున్నటుల భ్రమించుట. ఈభ్రాంతికి కారణము పారమార్థిక దృష్టిలో అజ్ఞానము. ప్రపంచ దృష్టిలో మందాంధకారము, దృష్టిదోషము.

ఈదిగువ వివరించిన వాక్యములు విచార సాగరమను గ్రంథములోనుంచి సంగ్రహించి వ్రాయడమైనది.

అధ్యాసకు ముఖ్యకారణములనగా సామగ్రి.

1. సత్యవస్తుజ్ఞాన జన్యసంస్కారము.
2. ప్రమాతృదోషము- జాతృదోషము.

3. ప్రమాణదోషము- బుద్ధిదోషము.
4. ప్రమేయదోషము- విషయదోషము.
5. అధిష్టాన సామాన్య రూపజ్ఞానము.
6. అధిష్టాన విశేషరూపో జ్ఞానము.

1. రజ్జువునందు సర్పముయొక్క శుక్తియందు రజతముయొక్క ఏఅధ్యాసమైనదో, ఆయధ్యాసము ఏపురుషునిచేత సత్యసర్పము, సత్యరజతము జూడబడెనో వానికి యగును. ఎవడు చూడలేదో వానికి గానేరదు. కావున సత్యవస్త్వజ్ఞానజన్య సంస్కారము అధ్యాసమునకు హేతువు.

2-3. ప్రమాతయందు లోభ భయాదిదోషములును, నేత్రాది ప్రమాణ మందుండు పిత్తకామలాదీ దోషములును, అధ్యాసమునకు హేతువు.

4. రజ్జువునందు రజతముయొక్క, శుక్తియందు సర్పముయొక్క అధ్యాసము కానేరదు. కావున సర్పాదికముయొక్క సాదృశ్యము యేదిగలదో అది ప్రమేయ దోషము. అధ్యాసమునకు హేతువు.

5-6. ఉక్తములైన జ్ఞానాజ్ఞానములు లేనపుడు అధ్యాసమునకు హేతువు గానేరదు. కావున ఏది భ్రాంతికాలమందు దోచునో, ఏది లేక భ్రాంతి గలుగనేరదో, దానిని సామాన్యాంశమని, ఆధారమని (ఉదాహరణ ఇతడు ఇది మొదలైనవి.) ఏది భ్రాంతికాలమందు దోపదో, ఏది తోచుటవలన భ్రాంతి నివృత్తియగునో, అది శేషాంశమనియు అధిష్టానమనియు జెప్పబడును. ఉదాహరణ రజ్జువు శుక్తి మొదలైనవి.

ఆత్మకన్న భిన్నమైన యేవస్తువు సత్యముకాదు. బ్రహ్మచై తన్యముకన్న భిన్నమైన అజ్ఞానము, మరియు తత్కార్యమైన స్థూల సూక్ష్మ ప్రపంచము ఏదిగలదో, అది సర్వము చైతన్యమందు అధ్యస్తముగా నున్నది. అంతఃకరణ రూపమైన ప్రమాతయు, ఇంద్రియ రూపమైన ప్రమాణమును దీనిలో నంతర్గతముగా నున్నవి.

గనుక నిదియు నధ్యస్తమె. ఈకారణమువలన ప్రమాతృ ప్రమాణములు అధ్యాసముకన్న పూర్వము సిద్ధింపదు.

అధ్యస్తము—ఆరోపితము, అధ్యస్తుడు-ఆరోపితుఁడు, ప్రమాతృ—జ్ఞానముకలవాడు, ప్రమాణము-జ్ఞానసాధనము. బంధము (అజ్ఞానము) న కధిష్టానమైన యేబ్రహ్మముగలదో అది స్వయం ప్రకాశరూపముగ నున్నది. అజ్ఞానము తమోరూపము. అందువలన చేతన ప్రకాశమునకు, తమోరూపమైన యజ్ఞానమునకుఁ బరస్పర విరోధముగలదు. బ్రహ్మమో సామాన్య విశేషభావము లేనిది. నిర్విశేషము.

ఈదిగువ వివరించిన దృష్టాంతమువలన పై వాక్యములయొక్క యర్థము స్పష్టముగాఁ దెలియునని తలచెదను.

ఒక గృహస్థుని యింటి సమీపమున నొక నుయ్యి యుండెను. దానిలో నీరుకొరకు గ్రామవాసులు తరుచు వచ్చుచుండిరి. ఒక నాడు కనుచీకటి సమయమున నొక స్త్రీ నీటికొరకు వచ్చి „ పాము పామని " బొబ్బలుపెట్టి భయముచేత స్మారకముతప్పి క్రిందఁబడెను. ఆమె కేకలువిని చుట్టుపట్ల జనులు పరుగెత్తివచ్చి పామును జూచి భయపడి దూరముగా నిలబడిరి. దానిని జంపుటకు నొకఁడు తుపా

కిని, ఒకఁడు కర్రను, మరియొకఁడు పెద్దకత్తిని, తెచ్చిరి. ఒకఁడు నాగస్వరమును దెచ్చెను. ఈరీతిగా బలువురు పలువిధముల దానిని జంపుటకుఁ బ్రయత్నము జేయుచుండిరి.

ఈసమయమున ధైర్యవంతురాలగు నొక ముసలమ్మ యొక ప్రమిదిలో దీపము వెలిగించి మెల్లమెల్లగా బాముయొద్దకు వచ్చెను. దీపపుకాంతి పామువిూదఁ బడగానే యందరు "త్రాడు త్రాడని" చెప్పి నవ్విరి. ఇంతలో నాయింటిలోనుంచి యొకఁడువచ్చి నూతి గిలకమీద త్రాడును దాను చుట్టజుట్టి యక్కడ వేసినానని చెప్పెను. అందరు ఆశ్చర్యపడిరి.

ఈకథలో రజ్జుస్థానమునందు భ్రాంతివలన గనుపించిన సర్పముయొక్క నాశముకొరకెందరెన్ని యుపాయములు చేసినను అవన్నియు వ్యర్థములాయెను. ముసలమ్మ దీపము తేగానే సర్పము తత్కాలమున నాశమై రజ్జుదర్శనమయ్యెను. అందరికి సంతోషమయ్యెను.

అటువలనే ప్రపంచము—సంసారము పెద్ద సర్పముగా నున్నది. ఇది బ్రహ్మ రూపాధిష్టానమునందు మూలావిద్యయను గొప్ప భ్రాంతి బలమువలనఁ బుట్టినది. ఈసంసారనివృత్తికొరకనేక జనులనేక ఉపాయములు చేయుచున్నారు. కొందరు తీర్థాటనము, కొందరు యజ్ఞము, కొందరు జపము, కొందరు తపము, కొందరు ధ్యానము, కొందరు ప్రాణాయామము, కొందరు కర్మానుష్టానము, కొందరు భజన, కొందరు పూజ, మొదలగు పలువిధ మార్గముల సంచరించుచున్నారు. వీనివలన సంసారనాశముకాదు. దృష్టాంతములో దీపము

తెచ్చినవెంటనే దాని వెల్తురున భ్రాంతివలనఁ దోచినపాము అదృశ్యమై యనగా నశించి, నిజమగు రజ్జుదర్శనమయ్యెనో, అటులనే శమదమాది సాధనములచేత పరిశుద్ధమైన అంతఃకరణమునను పృథివి దయందు „అహం బ్రహ్మాస్మి" యను దీపముసు యెప్పుడుఁ బ్రజ్వలింపఁజేయునో అప్పుడు సంసార సర్పము నశించి, సచ్చిదానంద బ్రహ్మరూప రజ్జుదర్శనమగును.

ఇందువలన సర్పదృష్టాంతము వేదాంతశాస్త్రముయొక్క ప్రాణముగనున్నది.

భ్రమయనఁగా రజ్వాదికమందు అనిర్వచనీయమైన సర్పాదికమును, దానిజ్ఞానమును, భ్రమయందురు. భ్రాంతిజ్ఞానముయొక్క విషయమైన మిథ్యావస్తువు. మరియు భ్రాంతిజ్ఞానము, ఈ రెండు చేరి అధ్యాసమనఁబడును.

మిథ్యాసర్పముయొక్క అధిష్టానము రజ్జూసహిత చైతన్యము. కాని రజ్జువు కాదు.

పూర్వము సర్పమునుజూచియుండి, సర్పస్మృతిగలవాని దోషసహితనేత్రము, రజ్జుసంయోగమైనపుడు సర్పత్వభావము కలుగుచున్నది. ఇవి అవిద్యా పరిణామమైయున్నది. గాని అంతఃకరణ పరిణామము కాదు. ముఖ్యసిద్ధాంతమందు సకలాధ్యాసమునకు చేతనము అధిష్టానమైయున్నది. అధ్యస్తము—ఆరోపితము కల్పితమైయున్నందున ఆత్మఅధ్యస్తుఁడు—ఆరోపితుఁడు కాడు, రజ్జుజ్ఞానము చేత అజ్ఞాన నివృత్తిద్వారా సర్పనివృత్తి కలుగుచున్నది.

ఈరజ్జుసర్పభ్రాంతి మిక్కిలి కఠినమగు శాస్త్రచర్చకలదిగాన నింతవరకు ముక్తసరుగా వ్రాయబడినది.

మరిన్ని సత్తాభానప్రియములాత్మ ధర్మములు. నామరూపముల నాత్మధర్మములు. ఆత్మధర్మములన నాత్మయందు, ననాత్మ ధర్మములాత్మయందు నారోపించుట, అన్యోన్యాధ్యాసమనఁబడును.

ఎట్లనగా :—

1. భార్యాపుత్రాదులకుఁ గలుగు సుఖదుఃఖములనఁగా బాహ్యధర్మములను, (దృష్టాంతము—అహంసుఖీ, దుఃఖీ యనుకొనుట)

2. అన్నమయకోశముయొక్క వికారములనఁగా దేహధర్మములను (దృ. అహం బ్రాహ్మణః, బాలః)

3. ప్రాణమయకోశముయొక్క కర్మేంద్రియాదిధర్మములను (దృ. అహంషండః, వీర్యవాన్)

4. మనోమయకోశముయొక్క బుధ్యాది ధర్మములను (దృ. అహంశ్రోతా, అంధః)

5. విజ్ఞానమయకోశముయొక్క బుధ్యాది ధర్మములను (దృ. అహంకర్తా, బుద్ధిమాన్)

6. ఆనందమయకోశముయొక్క ప్రియ, మోద ప్రమోద వృత్తులను (దృ. అహంసాత్త్వికః, దుష్టః) అనాత్మధర్మములను వీనిని ఆత్మయందారోపించుకొనుట.

ఇటులనే అస్తి, భాతిప్రియములను ఆత్మధర్మములన నాత్మయందు (అనఁగా, దృ. మమగృహిణీ, మమశరీరం, మమప్రాణాః,

మమమనః, మమబుద్ధిః, మమజ్ఞానం, అస్థిభ్రాణిప్రియాయని) నారో పించుకొనుట అధ్యాసములగును.

ఇవిగాక, బ్రహ్మమునకు వర్తించు-- "అహం" శబ్దమును దేహేంద్రియాదులకు వర్తింపఁజేయుటఁగూడ అధ్యాసమగును.

ఈ పలువిధ అధ్యాసముల నివారణకొరకుఁ బైశ్లోకముపదేశించబడినదని తలఁచెదను.

అయితే ప్రపంచము__సంసారము ఉండేటికొమ్ములలె కేవలము లేనిదికాదు. వ్యవహారదశలో త్రాడునందు భ్రాంతిచేతఁ గనుపించుఁ బాములంటిదని, కలలోఁ గనుపించుఁ బ్రపంచమువలెను, గారడి చేయువాని, గారడీవలెను, మొదటను, చివరను లేకపోవుటచేత, నప్పుడున్నటులఁ దోచినను లేనిదేయగునని, కారణముగు బ్రహ్మముకంటె వేరుకాదని తెలియవలెను. "నచాస్యకశ్చిజ్జనితా" యను శ్రుతి ప్రమాణసారముగ బ్రహ్మమునకుఁ గారణమేమియులేదు.

## —◆ 6వ స్వప్నము. ◆—

పై స్వప్నములో నుపదేశించిన శ్లోకతాత్పర్యమును, అద్వైతవిశేషమును బోధచేసుకొనుటకు గురువీస్వప్నములోఁ దాను స్వయముగాఁ బచనముచేసిన అన్నములోనుంచి మూడు ముద్దలను శిష్యునిచేతఁ బ్రసాదమునాకుఁబంపి నేనువానినిఁ దినుచుండ "ద్వైతముద్దలు తినవద్దు. అద్వైతామృతము త్రాగవలశినదని" యాజ్ఞాపించెను. అనఁగా "బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం । బ్రహ్మైవ తేనగంతవ్యం బ్రహ్మకర్మసమాధినా" యని

గీ. 4 అ. 24 శ్లోక తాత్పర్యానుసారముగఁ బ్రిసాదమును, దాని నొండినఁదాను—గురువు, దానిని భక్షించు నేను, శిష్యుఁడు బ్రిహ్మ మను నిశ్చయబుద్ధితోఁ దినుమని యానతిచ్చెను. ప్రిసాదమనఁగా నిర్మలచిత్తము ఇంద్రియములను మలినమనస్సు, వాసనలనణచి స్థిర బుద్ధితో నాత్మధ్యానము చేయుమని యాజ్ఞాపించెను. గీ. 2 అ. 65 శ్లో. "అద్వైతభావనా భైక్ష్య మభక్ష్యం ద్వైతభావనం" మైత్రియోపనిషత్తు 2వ అ. అద్వైతే బోధితే తత్త్వేవాసనా వినివర్తతే. "వరాహోపనిషత్తు. ద్వైతంనామ—"మాయామాత్ర మిదంద్వైతం । అద్వైతం పరమార్థతః" మాండూక్యోపనిషత్తు. "మనోదృశ్య మిదంద్వైతం । యత్కించిత్సచరాచరం" శ్రీగౌడ పదకారికా. అద్వైతమనఁగా సర్వభూత మయప్రిపంచకములకు కారణరూపుఁడై సమస్తము నశించఁగా శేషించియుండు నిర్గుణ బ్రిహ్మము గీ. 8 అ. 20 శ్లో. ప్రిసాదము మూఁడుముద్దలుగా నిచ్చుట దైవధ్యానములోఁ త్రిపుటి—ధ్యాతృ. ధ్యానధ్యేయముల నివృత్తి కొఱకని తలచెదను. "నధ్యానంచ నచధ్యాతా । నధ్యేయో ధ్యేయఏవచ" తేజోబిందూపనిషత్తు ప్రిథమాధ్యాయము.

## —♦ 7వ స్వప్నము. ♦—

నేను నిర్మాణము చేసినటుల నీస్వప్నములోఁ జెప్పబడిన ఏడంతస్థులమేడ—గోపురము, మైత్రియోపనిషత్తు ద్వితీయాధ్యాయములో "దేహో దేవాలయః ప్రోక్తః" యని చెప్పినటుల నాశరీరమైయున్నది. ఏడంతస్థులనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ ములు, వాని గోళములైన శ్రోత్రి, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ

ములైదును, మనస్సు, అహంకారము- వీనివలన జీవుఁడు, బాహ్య ప్రపంచములో రజోగుణ కార్యములయొక్క సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. "పురుషః ప్రకృతిస్థోహి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ । కారణం గుణసంగోస్య సదసద్యోని జన్మసు" గీతల 13 అ. 22 శ్లోకము. అందువలన నింద్రియములు మనోబుద్ధులు శరీర మనే గృహమునకు (మార్గములు) గుమ్మములు కిటికీలుగానుండెను. ఎర్రటి యద్దమును వీనికి తలుపులుగా నమర్చబడెనని చెప్పుటచేత నివి రజోగుణ ప్రధానమైనవని తెలియవలెను. "రజో రాగాత్మ కం విద్ధి తృష్ణా సంగసముద్భవం । తన్ని బధ్నాతి కౌంతేయ కర్మ సంగేన దేహినం" గీతల 14 అ. 7 శ్లోకము. "కామఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః । మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరణం" గీతల 3 అ. 37 శ్లోకము. ప్రారబ్ధ కర్మవశమున గలిగిన నిప్పటి జన్మలో గురువొసంగిన "అద్వైతామృత" భక్షణవలన రజోగుణ సమృద్ధమగు మేడ—శరీరమునకు నేను—జీవుఁడు—ప్రత్యగాత్మ వెలుపల నుండితిని. రజోగుణవిముక్తి నొందితిని.

## —♦ 8వ స్వప్నము. ♦—

పాపశబ్దమునకు సరియగు నిర్వచనము గానము, ఏపనులు చేయుట లేక మానుట పాపములో స్వప్నములో వివరింపబడ లేదు. ఒక మనిషి, మతము లేక జాతి పాపముగా నెంచినదానిని మరి యొకరు పుణ్యమని చెప్పెదరు. ఇందుకు దృష్టాంత మేమనగా, హిందువులు గోవధ బహుపాపమనిరి. మహమ్మదీయులు పాపము కాదనిరి. హిందువులు మేనరిక వివాహములు శాస్త్రసమ్మతమనిరి.

మహమ్మదీయులిది కూడదని నిరసించి, పినతండ్రి పెదతండ్రి కుమార్తెలను దమ పుత్రులకు వివాహము శాస్త్రసమ్మతమనిరి. క్రిస్టియనులు చనిపోయిన భార్యతోబుట్టువను వివాహము చేయఁగూడదనిరి. హిందువులు చేయవచ్చుననిరి. గొప్ప మతములను, కొద్దిమతముల నేర్పరచిన మహాపురుషులు మత విధానములలోను, యాచారములలోను, పాపపుణ్య వివిక్తతలలోను, భిన్నాభిప్రాయములు గలవారైరి. సామాన్య జనులు వానికారణములను యదార్థమునుఁ దెలియఁజాలరు. కొన్ని భేదములు వారు నివసించు దేశము, శీతోష్ణస్థితులు, భోజనపదార్థములు, దైవారాధనక్రమము మొదలగువానివలన నేర్పడి యుండవచ్చును. ప్రతివారును తమ మతము, మతపద్ధతులు సత్యమని, దైవనిర్ణీతములని, వాని నతిక్రమించుట పాపమని చెప్పెదరు.

ఈకారణములచేతనే శ్రీకృష్ణుఁడు గీతలయొక్క 3 అ. 35 శ్లోకములో " శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ । స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మో భయావహః " యని బోధించిరి.

మన హిందువులలోఁ గొందరీ కలికాలమున వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, మునులు, ఋషులు, గురువులు, బోధించు సనాతన ధర్మములు, విధులు, ఆచారములు సత్యములు కావని, చాదస్తములని, యందువలన విశ్వసనీయములు కావని విడిచిపెట్టి, యొకటిరెండు శతాబ్దములనుండి యైశ్వర్యములోనున్న విదేశ మతములవారు స్వమత వృద్ధికొరకుజీతములనిచ్చి యేర్పరచిన కృత్రిమ మతబోధకుల మధురవాక్యములు నిండుసత్యములని నమ్మి

(పేర్లు చెప్పనక్కరలేదు) బ్రాహ్మణులు, యితరులు మతాంతరముల లోఁ బ్రవేసించి, పిమ్మట తెలివిహీనతవలన స్వమతముచువిడిచి పరమతములోఁ బ్రవేసించినందుకు, మిక్కిలి విచారమునొంది తుద కతిహీన మరణమునొందిన వారిలో గొందరిని నేనెఱుఁగుదును. సోమరితనముచేత స్వమతవిచారణచేయక స్వలాభపరశీలురగు నన్యమత బోధకులతితీపిమాటల విచారణచేయకయే నమ్ముటే దుస్థితికి ముఖ్యకారణమని చెప్పనక్కరలేదు. ఎవరుగాని తాముజన్మించిన మతముయొక్క సాంప్రదాయములను, విధులను, లెస్సగా బరిశీలించిన, నితరమత సంకరములు, పైనజెప్పిన యాపదలు తొలగిపోవుచున్నవి. తాము జన్మించిన మతమును విడిచిన యవివేకులు జ్ఞానశూన్యులై చెడిపోవుదురని పై శ్లోకమువలన గ్రహించనగును. „ యేత్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతిమే మతమ్ । సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః ” గీతల 3 అ. 32 శ్లోకము. మరిన్ని „ స్వేస్వేధికారే యానిష్ఠా సగుణః పరికీర్తితః ” తమధర్మము ననుసరించియుండుట సద్గుణమని నీ శ్లోకము చెప్పుచున్నది. గాన స్వధర్మమును విడువక యుండుట శ్రేయస్కరమని నిస్సంశయముగ గ్రహించవలెను. యీ యర్థమునే గీతలయొక్క 18 అ. 47 శ్లోకము బోధించుచున్నది.

ఇకను పాపమననేమి యనిన, స్వమత విరుద్ధమైన వధ, పరస్త్రీ సంభోగము, పరధనాపేక్ష, అత్యాశ, గర్వము, అసూయ, సోమరితనము, యను సప్తమహా పాతకములు. బుద్ధిపూర్వకముగా స్వధర్మ త్యాగమును అట్టిదేయని నాయభిప్రాయము.

నేను హిందువును, బ్రాహ్మణుడను. స్వప్నములో „ నీపాపములనుఁ దీసివేసినాను. ” యని చెప్పిన వాక్యము నామత ధర్మ

మునకు వ్యతిరేకముగా నొనర్చబడినట్టి లేక విడిచిన కార్యములని తలంచెదను. తీసివేయబడిన పాపములు చెడిపోయిన మాంస ఖండములుగా నెఱ్ఱరంగుగలవిగా నుండుటచేత రజోగుణ ప్రేరణచే నొనర్చబడినవని నమ్మనగును. గీతల 3 అ. 37 శ్లోకము.

—♦ 9వ స్వప్నము. ♦—

పంచీకరణమునుబట్టి స్థూలసృష్టి తమోగుణమువలన గలిగినది. దహింపబడిన దేహము స్వయముగఁ జలన సామర్థ్యము కలది కాదు. జీవునియొక్క రజోగుణమువలనఁ జలించును. కాని మెర్రటి యద్దములతో నమర్చబడిన గుమ్మములు, కిటికీలుగల మేడంతస్తుల మేడ లేక గోపురము—శరీరమునకు నేను వెలుపల నుండుటవలన 7వ స్వప్నములోఁ జెప్పినటుల నాకు—జీవునకు రజోగుణ విముక్తి గలిగి, యీ స్వప్నములోఁ దమోగుణ ప్రధానమైన శరీరము—జీవుని గృహము లేక సుఖదుఃఖానుభవ కరణము, నేను చూచుచుండ దహనము చేయఁబడినది. అందువలన నాకు—జీవునకు రజస్తమోగుణములనఁగా నావరణ విక్షేపశక్తుల విముక్తి కలిగినది! „ శరీరనాశ దర్శిత్వా ద్వాసనానప్రవర్తతే " అన్నపూర్ణోపనిషత్తు. 4 అధ్యాయము „ దేహభావ విహీనోస్మి చింతాహీనోస్మి సర్వదా " తేజోబిందూపనిషత్ ॥ 3 అధ్యాయం. మనస్సును రజస్తమోగుణముల యుద్రేకములనుండి స్వభావ చంచలత్వమునుండి మరలించి ముముక్షువు చిత్తస్థైర్యమునొందుటకు 5, 6, 7, 8, 9, స్వప్నములు సక్రమముగ బోధించుచున్నవి. దేహాత్మబుద్ధిని కూడ నశింపు చేయునని పారుపల్లి లక్ష్మీనారాయణగారు చెప్పిరి. మరియు ఈనామరూ

పమైన శరీరము—జగత్తు అజ్ఞానకాలమునందుఁ గనుపించినను జ్ఞానారూఢకాలమందు లేనిదేయగునని బోధించును.

## —♦ 9-(ఎ) స్వ ప్న ము ♦—

అహింస ముఖ్యమైన శరీర తపస్సని నీ స్వప్నము బోధించుచున్నది. యేది హింస, యేదహింసయను బ్రశ్నకు వారివారి మత విధులనుబట్టి గ్రహించవలెను. మాంసభక్షణచేయు జనులు వారు భక్షించు జంతువులను జంపుట హింసకాదు. ఇతరజంతువులను జంపుట, బాధించుట, హింసయగును.

హిందువులలో బ్రాహ్మణులు యజ్ఞయాగములలోఁ బశువులను వధించుట శాస్త్రసమ్మతమని హింసకాదని చెప్పెదరు. మనోవాక్కాయ కర్మలచేతనే జంతువును బాధించఁగూడదు. నిరాదరణచేయఁగూడదు. గీ 16 అ. 2-3 శ్లో. 17 అ. 14 శ్లో. చూడుము. „మనోవాక్కాయ కర్మభిః సర్వభూతేషు సర్వదాఽక్లేశాజననమ్" శాండిల్యోపనిషత్తు. అహింసాసత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః। ఏతత్సామాజికం ధర్మంచాతుర్వర్ణ్యేబ్రవీన్మనుః॥ తా॥ అహింస, సత్యము, పరిగ్రహవర్జితము, బాహ్యాంభ్యంతరశుద్ధియింద్రియ నిగ్రహము మొదలగు పావనధర్మములు నాల్గు వర్ణములవారికి సమానమని మనుస్మృతి చెప్పుచున్నది.

## —♦ 10వ స్వ ప్న ము. ♦—

మూలశంక జాడ్యముచే బాధపడుటకు నేనేమి పాపము చేసితిని యను నాప్రశ్నకు „నతత్రియక్ష్మణాపాపీ, అతఏవ

మమాంశికః" యని స్వప్నములో గురువు ప్రత్యుత్తరమిచ్చెను. "తత్రి" నీవడిగిన ప్రశ్నకు, జీవుఁడు "మమ" నాయొక్క "అంశికః-" అంశమైనవాఁడు "అతఏవ" కనుకనే, "యక్ష్మణా-" క్షయచేతను అనగా మూలశంకచేతను, "పాపీన-" పాపిగాఁడు. "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" గీతల 15 అ. 7 శ్లోకము.

పాతశబ్దము శరీరమునకు వర్తించునుగాని ఆత్మకుఁగాదు. శరీర స్వభావము—లక్షణములు మైత్రేయోపనిషత్తులో వివరించబడినవి. "జాతం మృత మిదం దేహం మాతా పితృ మలాత్మకం। సుఖదుః ఖాలయామేధ్యం స్పృష్ట్వాస్నానం విధీయతే। ధాతుబద్ధం మహా రోగం పాప మందిర మధ్రువం। వికారాకార విస్తీర్ణం స్పృష్ట్వా స్నానం విధీయతే నవద్వార మలస్రావం సదాకాలేస్వభావజం। దుర్గంధం దుర్మలోపేతం స్పృష్ట్వాస్నానం విధీయతే। మాతృసూతక సంబంధం సూతకే సహజాయతే" ఇత్యాది "పాపోహం పాపకర్మాహం। పాపాత్మా పాపసంభవః" యని దేవాలయములలోఁ దరుచు జెప్పఁబడు వాక్యములు శరీరము మనస్సున కన్వయించును గాని ఆత్మకుకాదు. ఆత్మ, జీవుఁడవిద్యచేఁ జేయు కర్మకు సాక్షిగాని, కర్మచేయునదికాదు. గీతల 14 అ. 19 శ్లోకము.

కర్మవిపాక గ్రంథములో మూలశంక క్షయలో జేర్చబడినది. గాన స్వప్నములో "యక్ష్మ" యని చెప్పుట సరిగానున్నది.

## —♦ 11వ స్వప్నము ♦—

ఈస్వప్నములో నుపదేశించిన "ఓం శ్రీపరమేశ్వర సుప్రసన్నోభవ" యను మంత్రము త్రిపుటి—మంత్రము, అధిష్టాన దేవత,

కర్తృయుక్తమైన సగుణోపాసనగాఁ గనుపించును. గాని " సుప్రసన్నో భవ " యను శబ్దములు పరమేశ్వరుని—స్వస్వరూపముయొక్క పూర్ణప్రసన్నతను గోరుచుండుటనగాఁ జూచుటవలన " స్వాత్మ " ధ్యానమగుచున్నది. అందువలన " అహం బ్రహ్మేతిచేద్వేదసాక్షాత్కారస్స ఉచ్యతే." యను వరాహోపనిష ద్వాక్యానుసారమున నద్వైతమును బోధించును.

జపమనఁగా గురువుపదేశించిన మంత్రమును వేదవిరుద్ధము కాని మార్గమున నభ్యసించుట. " విధి వద్రూప స్పష్టవేదాఽవిరుద్ధమంత్రాభ్యాసః." శాండిల్యోపనిషత్తు. ప్రత్యగాత్మండైన తానే బ్రహ్మమనుచుఁ బలుమారు జెప్పుట అభ్యాసమనఁబడును.

అది వాచకమని మానసికమని రెండు విధములు.

1. మానస మనఁగా మనస్సుతో ధ్యానించుట—కోటిగుణితము.

2. వాచికము రెండువిధములు.

1. బిగ్గరిగా జపించుట-సామాన్యఫలము.
2. ఉపాంశమనఁగా మెల్లగాజపించుట. సహస్రగుణము. శాండిల్యోపనిషత్తు 2 ప్రకరణము. దర్శనోపనిషత్తు 2 ఖండము.

పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీయని వాక్కు నాలుగు విధములు.

పరశివునకు పరాశక్తియగుకుండ వినికి స్థానమై వాయువు, అగ్ని, బిందునాదములు, హంస, మనస్సులకు ఉత్పత్తిస్థానమై గుద

మేఢ్రముల మధ్య త్రికోణాకారముగ నున్న మూలాధార చక్రము నందుఁ బుట్టు ధ్వని "పరావాక్కు" ని ప్రాణమయమైనది యని, "గుద మేఢ్రాంతరాళస్థం మూలాధారం త్రికోణకం । శివస్య బిందు రూపస్యస్థానం తద్ధిప్రకాశకం । యత్రకుండలినీనామ పరాశక్తి ప్రతిష్ఠితా । యస్మాదుత్పద్యతే వాయుర్యస్మాద్వహ్నిః ప్రవర్ధతే । యస్మాదుత్పద్యతే బిందుర్యస్మాన్నాదః ప్రవర్ధతే । యస్మాదుత్పద్య తే హంసోయస్మాదుత్పద్యతేమనః." వరాహోపనిషత్తు. (శ్లో) స్వాత్మేచ్ఛాశక్తిఘాతేనప్రాణవాయుస్స్వరూపతః । మూలాధారేస ముత్పన్నః పరాఖ్యోనాదఉత్తమః । సఏవచోర్ధ్వతాం నీతస్స్వాధిష్ఠా నవిజృంభితః । పశ్యంత్యాఖ్యామవాప్నోతితదైవోర్ధ్వంశనైశ్శనైః । అనాహతే బుద్ధితత్త్వసమేతో మధ్యమాభిధః । తథాతయోర్ధ్వ గతో విశుద్ధౌ కంఠదేశతః । వైఖర్యాఖ్యస్తతః కంఠశీర్షతాల్వోష్ఠదం తగః । జిహ్వామూలాగ్రపృష్ఠస్థస్తథానాసాగ్రతః క్రమాత్ । కంఠ తాల్వోష్ఠకంఠస్థః కంఠోష్ఠద్వయతస్తథా । సముత్పన్నాన్యక్షరాణి క్రమాదాదిక్షకావధి." "మూలశృంగాట మధ్యస్థా బిందునాదకళా శ్రితా నిత్యానందానిరాధారా" ఇత్యాది. అన్నపూర్ణోపనిషత్తు. మరియు యోగశిఖోపనిషత్తులో పరావాక్కు-శబ్దబ్రహ్మమని చెప్పఁ బడినది.

మణిపూరకమనఁగా నాభిస్థానమున మనోగోచరమైనది. "పశ్యంతి" వాక్కనియు, హృదయమందు అనాహతమున సూక్ష్మమై జపాదికాలమున బుద్ధిసాధ్యమైనదియు, ఇంద్రియమయమైనదియు "మధ్యమా" వాక్కనియు, విశుద్ధచక్రమనఁగా కంఠమున తాల్వాదిస్థానములయందభివ్యక్తమై పరశ్రోత్రములచేతను వినఁదగి

నది. వైఖరీవాక్కనియుఁ జెప్పఁబడును. మరియు పరాస్థానమునందుఁ బుట్టినవాక్కు—ధ్వనిపశ్యంతియందు రెండుదళములుగ నేర్పడి, మధ్యమముయందు మొగ్గతొడిగి, వైఖరియందు వికసించును. అను లోమసమయమునఁ గ్రమముగా వాని యుత్పత్తిలో నస్తమించును. “పరాయామంకురీభూయపశ్యంత్యాం ద్విదళీకృతా। మధ్యమాయాంముకుళితావైఖర్యాం వికసీకృతా। పూర్వం యథోదితావాగ్విలోమేనాస్తగాభవేత్.” యోగకుండల్యుపనిషత్తు.

పైనజెప్పిన “పరా, పశ్యంతి” వాక్కులు సవికల్పనిర్వికల్ప సమాధులయందు యోగి ప్రత్యక్షములైనవి.

పరావాక్కునకు శబ్దబ్రహ్మమని పేరుగలదు. వాక్కుయొక్క రహస్యము తెలిసిన యోగికి ప్రపంచవాసనలు నశించి మంచిమాటలవలనగాని, చెడుమాటలవలనగాని మనస్సు చెలించదు. విజ్ఞానసమృద్ధిచే జ్ఞానమయమనోమయకోశములు దూదిలో నగ్నివలె క్షణకాలములో దహింపఁబడును. పిండాండములో విశ్వతైజసప్రాజ్ఞులును, బ్రహ్మాండములో విరాట్టిహిరణ్యగర్భ ఈశ్వరోపాధులును కారణసహితముగ దహరాకాశమందు సర్వవ్యాపియగు ప్రత్యగాత్మలో లీనమై కేవల పరబ్రహ్మమనఁగ సన్మాత్ర స్వరూపముగ నుండునని యోగకుండల్యుపనిషత్తు 3 వ అధ్యాయములోఁ జెప్పబడినది.

జపకాలమందు నేత్రములనుఁ బూర్తిగా మూయుట “అమాదృష్టి” యనియు, కొంత మూయుట “పాడ్యమిదృష్టి” యనియు, పూర్తిగాఁ దెరచియుండుటఁ “బూర్ణిమదృష్టి” యనియు, వీనిలోఁ బూర్ణిమదృష్టి నభ్యసించఁదగినదియు మండలబ్రాహ్మణోపనిషత్తు 2 బ్రాహ్మణములోఁ జెప్పఁబడినది.

## —♦ 12వ స్వ ప్న ము. ♦—

వెనుకటి స్వప్నములలో నుపదేశించిన మంత్రములఁ బునశ్చరణవలనను, శరీరశుద్ధికొరకుఁ జేసిన నితర బోధనలవలనను, కొంత చిత్తశుద్ధి గలుగుటచేత, నీస్వప్నములో నన్ను (Probationary Chela) పరీక్షార్థశిష్యునిగ నేర్పరచిరని యీకార్యము సాధనచతుష్టయ బోధయని తలఁచెదను.

సాధనచతుష్టయమనఁగా :—

1. నిత్యానిత్యవస్తువివేకము:— బ్రహ్మము నిత్యము జీవేశ్వర జగత్తుయనగా తక్కినదంతయు-నామరూపాదికమైన సర్వప్రపంచకములు దేహములు పంచభూతములు మొదలగునవి యనిత్యములు. గీతల 2 అ. 18-30 శ్లోకములు. ఈవిచారణను దినమునకొకసారియైనను యేకాంత స్థలమందు మనస్సు ధృఢమగువరకు జేయవలయును.

2. ఇహాముత్రఫలభోగవిరాగము— ఈ లోకమందలి పరలోకమందలి సకలభోగములయందు వైరాగ్యబుద్ధి మొదటి సాధనము వలన ఆత్మేతర వస్తువులన్నియు నశ్వరములని తెలిసి, వానియందు నిరసన భావముతో నాత్మ

యందు దృష్టి నిలిపి శమదమా దుల నవలంబించుట. గీ. 2 అ. 45-56-57-58-59 శ్లోకములు.

3. శమాది షట్కసంపత్తి:— (1) శమము. మనోనిగ్రహము. దీనివలన చంచలమనస్సును క్రమముగ ధ్యానములో స్థిరముగ నుంచుట. గీ. 2 అ. 64-71 శ్లోకములు, 6 అ. 26 శ్లోకము.

(2) దమము— కర్మ జ్ఞానేంద్రియములను విషయములయందు బ్రవర్తింపనీయకుండుట. శమమునకుఁదోడు కర్మేంద్రియములను ముఖ్యముగ మలినమనస్సు, వృత్తులు వాసనలను జయించవలెను. గీ. 2 అ. 60-67-68 శ్లోకములు. 6 అ. 24 శ్లోకము.

(3) ఉపరతి— పాపకార్యములను విడిచి, భగవత్ప్రీతిగా బు...క కర్మలను జేయుట. ప్రతిజీవునియొక్క లేక వస్తువుయొక్క గుణము రూపము పూర్వకర్మ పరిపాకముఁబట్టి ప్రస్తుత

స్థితి యేర్పడినందున, నిందార్హా ములు కావని, లోటు లేదని తలచుట. గీ. 3 అ. 7-8 శ్లోకములు.

(4) తితీక్ష— లాభనష్టములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములను సహించుట, యనఁగా దరుచు మారుచుండు కష్టసుఖముల వలన వ్యసన సంతోషముల నొందక పూర్వకర్మ ఋణములు తీరుచున్నవని తలచుట. గీ. 2 అ. 14 శ్లోకము.

(5) శ్రద్ధ— ఈశ్వరునియందు, ఆచార్యులయందు వేదాంత శాస్త్రములయందు బూర్ణవిశ్వాసము, సంశయ రహితము. గీ. 4 అ. 40 శ్లోకము.

(6) సమాధానము— వేదాంత శ్రవణకాలమందు, తదితర కాలములయందు, మలిన మనస్సును యింద్రియములను నిగ్రహించి, శుద్ధమనస్సును నేకాగ్రతగ స్వాధీనమందుంచు కొనుట. గీ. 2 అ. 5౦-65 శ్లోకములు.

(4) ముముక్షుత్వము— సదా మోక్షేచ్ఛ గలిగి యుండుట, గీ. 2 అ. 15 శ్లోకము, 6 అ. 8 శ్లోకము. మోక్షమును గోరు మనుజుఁడు స్వప్రయోజన పరుఁడుగాక సర్వజీవ సౌహార్ధమును క్షేమమును గోరుచు, సర్వభూత సుఖదుఃఖములు తన సుఖదుఃఖములుగా భావించుచు, సర్వభూతములయందు దనను, దనయందు సర్వభూతములను జూచుచుండును. గీ. 6 అ. 31-32 శ్లోకములు.

ఈగుణముల విచారణ సదా చేయుచు నాచరణలో నుంచుటకు పరిశుద్ధ శిష్యునిగ నేర్పరచిరని నమ్మెదను.

—♦ 13వ స్వ ప్న ము. ♦—

పై స్వప్నములో సాధన చతుష్టయము బోధించి యీస్వప్నములో స్థిరశిష్యునిగ నేర్పరచిరి.

స్థిరశిష్యస్థితిలో స్వశరీరభ్రాంతి, సంశయము, అపభ్రంశములను సంకెళ్లను విడనాడి, పరివ్రాజకావస్థ యందనఁగా సృష్టిలో “తనది యని చెప్పఁదగిన పదార్థమేదియు లేదని యంతయు పరమేశ్వర విభూతి” యని పూర్ణవిరాగియై మనోవాక్కాయ కర్మల గురువాజ్ఞ ననుసరించి సదా సంచరించవలయును. గీతల 4 అ. 34-40 శ్లోకములు.

ప్రథమములో పరిపూర్ణ శిష్యునిగ, పిమ్మట స్థిరశిష్యునిగ నేర్పరచిన, రెండు తరుణములయందు, తెల్లయద్దముకంటె మిక్కిలి ప్రకాశమైన దేహకాంతిగల మహాపురుషుఁడు మరికొందరితో దర్శనమిచ్చి, నియతకర్మ సంస్కారములను యథావిధిగ జరిపించి, నన్ను శిష్యునిగా నేర్పరచినట్లు చెప్పిన గురువు ఆమహాపురుష సంఘమున కధ్యక్షుఁడని యీశ్వరాంశయని తలచెదను.

లోకములో శిష్యులుత్తమ, మధ్యమ, అధములని మూడు తరగతులుగ నుందురు. ఉత్తమ తరగతి శిష్యులు గురూపదేశములను జక్కగ గ్రహించి వానిని యాచరణ జేయుదురు. రెండవ తరగతివారు వానిని గ్రహించినటుల గనుపించినను వెంటనే విడిచి వేయుదురు. మూడవ తరగతి వారుపదేశములను విని పరిహసించెదరు. మరియు నాక్షేపణగూడఁ జేయుదురు.

## 14వ స్వప్నము.

“సోహం ఈశః” యను మంత్రములో “సః” నిర్గుణబ్రహ్మము, “అహం-” అవిద్యా ప్రతిబింబిత జీవచైతన్యము, “ఈశః-” మాయాప్రతిబింబిత యీశ్వరచైతన్యము—అనగా “యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ” యని శ్రుతిచెప్పెడు నిర్వికారసాక్షిభూత సర్వవ్యాపక నిర్గుణ ఆత్మ, జీవచైతన్యము; ఈశ్వర చైతన్యము—అంతర్యామి యొకటేయని స్థిరపరుచుటకు నీమంత్రోపదేశము చేయఁబడినదని తలచెదను.

జీవుఁడనగా “వాయుః ప్రాణ స్తదాకాశ స్త్రివిధోజీవ సంజ్ఞకః। సజీవః ప్రాణఇత్యుక్తో వాలాగ్ర శతకల్పితః” బ్రహ్మవిద్యో

పనిషత్తు. „ సర్వజ్ఞేశో మాయావేశ సమన్వితో వ్యష్టిదేహం ప్రవి[illegible] । తయా మోహితో జీవత్వమగమత్." పైంగలోపనిషత్తు.

బ్రహ్మయనఁగ " అద్వితీయమఖిలోపాధి వినిర్ముక్తం తత్సకల శక్త్యుపబృంహిత మనాద్యంతంశుద్ధం శివంశాన్తం నిర్గుణ మిత్యాదివాచ్యమనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ." నిరాలంబోపనిషత్తు.

ఈశః యనఁగా సమష్టిపురుష—సర్వత్ర నిండియుండు చైతన్యము. బ్రహ్మైవస్వశక్తి ప్రకృత్యాఽభిధేయ మాశ్రిత్యలోకాన్ సృష్ట్వాప్రవిశ్యాఽన్తర్యామిత్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియనియన్తృత్వాదీశ్వరః."

జీవుఁడనఁగా-„ ఈశ్వర ఏవబ్రహ్మ విష్ణ్వీశానేంద్రాదీనాం నామరూపద్వారాస్థూలోఽహమిత్యధ్యాసవశాజ్జీవః । సోఽయమేకోఽపిదేహారమ్భక భేదవశాద్బహుజీవః." నిరాలంబోపనిషత్తు.

ఆత్మయనఁగా-„ సాక్ష్యహం సర్వదానిత్యశ్చిన్మాత్రోఽహం సదాశివః, ఆత్మాహం సర్వభూతానాం విభుస్సాక్షీనసంశయః । బ్రహ్మైవాహం సర్వవేదాన్తవేద్యం నాహం వేద్యం వ్యోమవాతాది రూపం । రూపంనాహం, నామనాహం, నకర్మ, బ్రహ్మైవాహం సచ్చితానందరూపం" సర్వసారోపనిషత్తు.

అనాత్మయనఁగ-„ అనాత్మమూలం ‚ మాయా' బ్రహ్మణ్యాకాశేమేఘాదిరివదృశ్యతే" సర్వసారోపనిషత్తు.

పరమాత్మయనఁగా- దేహాదేః పరతరత్వాత్ బ్రహ్మైవపరమాఽత్మా, సబ్రహ్మా, సవిష్ణు, స్సరుద్ర స్సఇన్ద్ర, స్సశమన, స్ససూ

ర్యః, స్సచన్ద్రః, స్సేసురాస్సేఅసురా, స్సేపిశాచ, స్సేమనుష్యా, స్సాస్త్రి య, స్సేపశ్వాదయ, స్తత్థావరం, తేబ్రాహ్మణాదయస్సర్వం ఖల్విదం బ్రహ్మ । నేహనానాస్తికించన." నిరాలంబోపనిషత్తు.

ప్రకృతియనఁగా "బ్రహ్మణస్సకాశాన్నానావిచిత్ర జగన్నిర్మాణ సామర్థ్యైకబుద్ధిరూప బ్రహ్మశక్తి రేవప్రకృతిః" నిరాలంబోపనిషత్తు. మాయాయనఁగా-అనాదిరంతవతీప్రమాణా ప్రమాణ సాధారణా । నసతీ, నాసతీ, నసద సత్యనిర్వాచ్యాధిష్ఠాన ఏవావిద్యమానాంతర్వాణి వికల్ప నిరూప్యమాణోచ్యావ చవ్యవహారభేదవతీయానవిద్యతే వస్తుతస్సామాయా । తత్స్వరూపమజ్ఞానం, తదేవ మూలప్రకృతిర్గుణసామ్య మవిద్యేత్యాద్యనేకా కారేణపరిణతా." సర్వసారోపనిషత్తు.

ప్రతిస్థూలశరీరము, నసంఖ్యమగు నణువులతోఁ జేరియుండును. ప్రతి అణువులో బ్రహ్మయొక్క అంశ—లేశము—సంవిత్ గలసియుండును. ~~ఈ~~యణుసముదాయము అట్టి పదార్థ—శరీర లయగాలమువరకు మేకమనస్సుగలవై కలసియుంటున్నవి. వీని నామ రూపములు, దేశకాలములు సృష్టికి దరిమిలాను గలిఁగినవి. గాని, పూర్వముకాదు. సృష్టికిఁ బూర్వము నిర్గుణబ్రహ్మమాత్రమె యుండెను. జీవేశ్వరనామములుఁగూఁడ సృష్టిక్రమములోఁ గలిగిన అవస్థాభేదముగాని నిత్యములుగావు.

స్కందోపనిషత్తులోఁ జెప్పఁబడిన "జీవశ్శివ శ్శివోజీవస్స జీవః. కేవలశ్శివః" యను వాక్యము శివజీవులొకటియెయని స్థిరపరచుచున్నది. ఎట్లనఁగా ?

"జీవశ్శివః" యను శబ్దములు అవిద్యలోఁ బుట్టిన జీవుఁడు అనఁగా అజ్ఞాని జ్ఞానము సంపాదించుకొని ఆరోహణక్రమమనఁగ అను లోమమార్గమున శివుఁడగునని తెలుపును.

"శివోజీవః" యను శబ్దములు "ఏకోబహుశ్యాం" యను సంకల్పమువలన సృష్టిక్రమములో శివుఁడే జీవుఁడాయెనని తెలుపును. ఎట్లనఁగా నాటకములో మొదట శ్రీకృష్ణవేషమును ధరించిన మనుజుఁడు దానిని వదలి వెంటనే దారుకవేషమును ధరించినటుల, మహాకాశము ఘటాకాశమైనటుల యని తెలియవలెను. "శుద్ధమీశ్వరచైతన్యం జీవచైతన్యమేవచ" కఠోపనిషత్తు.

"సజీవః కేవలశ్శివః" యను శబ్దములు పైనఁ జెప్పినటుల ఈశ్వరత్వమునొందిన జీవుఁడు, క్షర అక్షర పురుషుల నతిక్రమించి పురుషోత్తముఁడనఁగా నద్వితీయ సాక్షిచైతన్యమగునని తెలియజేయును. గీ. 8వ అ. 20 శ్లోకము.

పైవాక్యములవలన 'సః' నిర్గుణబ్రహ్మము, అహం— నేను—జీవుఁడు, ఈశః—(అంతరాత్మ) పరమాత్మయొకటియెయని, సృష్టిక్రమములోఁ గలిగిన భేదావస్థలనుఁబట్టి వేరు సాంకేతికనామములు గలిగినవనిఁ దెలియఁవలెను.

మరిన్ని, నిర్వికార అద్వైతబ్రహ్మమందు సృష్ట్యాదికృత్యం బులెటులఁగలుగుననిన, సూర్యుడేలాగున ఇచ్ఛాప్రయత్నములులేకనే, తన వర్షకిరణంబులచే వృష్టిరూపమై జలంబులను విడిచి, ఆజలంబున తాను ప్రతిబింబించి, మేఘాదులచేఁ దన బింబంబుల నడ్డగించి, ఉష్ణకిరణంబులచే నాజలంబులను తిరిగీ గ్రహించి యందలి ప్రతిబిం

బింబమును తనలోఁ జేర్చుకొనునటుల, ఈశ్వరుఁడు మాయతోఁగూడి చిత్ప్రతిభానంబుచేత నిమిత్తకారణంబై తనయందుఁగలిగిన జడప్రధానమాయను ఉపాదానకారణముచేసి, బుద్ధీంద్రియాదిజగంబుల సృష్టించి, జీవరూపంబుచేఁ దాను వానియందు బింబించి, కర్మముచే భోక్త, నియమనశక్తిచేఁ గర్తయై, రుద్రరూపంబుచే సంహరించి శ్రీగురురూపంబుచే నా జీవుని తనలో నైక్యంబు చేసుకొనును. ఘటంబునకు మృత్తిక, తంతువునకు నూర్ణనాభికారణంబైనటుల నీ జగంబునకు బ్రహ్మంబే కారణంబుగాన బ్రహ్మమునకు జగంబునకు అభిన్నత్వము సిద్ధించినది.

మరియు శబలజీవుఁడనియు శుద్ధజీవుఁడనియు జీవుఁడు రెండు విధములు.

1. శబలజీవుఁడనగా అవిద్యయందు చిత్ప్రతిబింబము. అనగా చిదాభాసుఁడని వాచ్యార్థము.

2. శుద్ధజీవుఁడనగా మాయాధిష్ఠానమైన ప్రత్యగాత్మయని లక్ష్యార్థము.

3. ఈశ్వరుఁడనగా మాయయందు చిత్ప్రతిబింబము అనగా సమష్టిప్రత్యగాత్మయని వాచ్యార్థము. శబల జీవేశ్వర వాచ్యార్థములయొక్క ఐక్యమే జీవేశ్వరైక్యము.

4. జీవబ్రహ్మైక్యమనగా ఘటముండువరకు ఘటాకాశమని మహాకాశమని నామములుండును. ఘటము నశించినతరువాత యీ నామములు పోయి ఆకాశమనే యొక పేరుమాత్రము నిలచియుం

డును. అటులనే జ్ఞానదృష్టిచే జీవేశ్వరనామములున్ను, సాక్షియైన ప్రత్యగాత్మ పరమాత్మ నామములున్ను నశించి బ్రహ్మమనియె చెప్పఁబడును. ఇదియే జీవబ్రహ్మైక్యము.

—♦ 15వ స్వప్నము. ♦—

ఈస్వప్నము కలిగినఁ గాలమందు నాకు సరిగాఁ జపము జరుగుటలేదు. అందువలన గురువు న్యాయముగ మందలించి, జాగ్రదవస్థలోఁ దర్శనమిచ్చి యుపదేశించుటకుఁ బూర్ణాద్వైత భావన సంపాదించుకొమ్మని యానతిచ్చెను.

ఈస్వప్నోపదేశములయొక్క ఉద్దేశ్యము ఆరవ స్వప్నములోఁ జెప్పినటుల అద్వైతామృతబోధగాన గీతల 2వ అధ్యా. 55 శ్లోకము మొదలు అధ్యాయాంతమువరకుఁ వివరింపఁబడిన 'స్థితప్రజ్ఞ' స్థితినొందుటకు యత్నించుమని చెప్పెను. ఇందుకుఁ బ్రకృతమందుఁ బ్రబలించియున్న మతముల, శాఖల విద్వేషములు గొప్ప ప్రతిబంధకముగానున్నవి. గీతల 9 అ. 29వ శ్లోకములో "సమోహం సర్వభూతేషు నమేద్వేష్యోస్తినప్రియః" యని, గీతల 13 అ. 28 శ్లోకములో "సమం సర్వేషు భూతేషు తిష్టంతం పరమేశ్వరం" యని సంశయ రహితముగ శ్రీకృష్ణుఁడు చెప్పియున్నను, పురుషసూక్తములో "బ్రాహ్మణోస్య ముఖమాసీత్ । బాహూరాజన్యః కృతః, ఊరూతదస్యయద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రోఅజాయత" యనెడు వాక్యముచుఁబట్టి కొందరు బ్రాహ్మణులు, క్షత్రియులు, తాము బ్రహ్మముఖమునుండి, బాహువులనుండి పుట్టినామని, అందువలన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు శాఖలలోఁ గ్రమము

గా నౌకరికంటె నౌకరు తక్కువయని తప్పుఅర్థము కల్పనజేసి, పలు విద్వేషములను గలుగఁజేయుచున్నారు. ఇటులనే హిందువులు ముఖ్యముగఁ బ్రాహ్మణులు మహమ్మదీయులను 'మ్లేచ్ఛులని', మహమ్మదీయులు హిందువులను 'కాఫరులని' క్రిష్టియనులు హీతెన్సులని నీచశబ్దముల నుపయోగించుచున్నారు.

ఇందువలనఁ బ్రపంచములో ముఖ్యముగ మన ఇండియాదేశములో మతద్వేషములు నానాటికి వృద్ధినొందుచుఁ ననేక ఘోరమరణములకుఁ గూడఁ గారణములగుచున్నవి. ఒక స్థలమునుఁ జేరుటకు నాలుగు దిశలనుండి యనేక మార్గములుండునటుల నొకడేయగు బ్రహ్మమునుఁ జేరుటకు నీ మతములు శాఖలు సమానమార్గములై యున్నవి. ఎట్లనఁగా—హిందువులు "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" యని, మహమ్మదీయులు "వహదహులషరికతహు" యని, క్రిష్టియనులు There is but one God యని అనఁగా మూడు గొప్పమతములు దేవుఁడు ఒకఁడేయని చెప్పుచున్నవి. ఇదియె పూర్ణసత్యము. గాని, జనులు సమష్టిని వదలి వ్యష్టిని అవలంబించి "మాదేవుఁడు, నాదేవుఁడు యను తలంపుగలవారై పెక్కుయిడుములకుఁ బాలగుచున్నారు. "యదాభూతపృథగ్భావ మేకస్థమనుపశ్యతి। తతఏవచవిస్తారం బ్రహ్మసంపద్యతేతదా." అనఁగా పృథక్ స్వరూపములుగా నుండు సమస్త భూతములు ఆత్మయందున్నవిగానున్ను, ఆయొక్క ఆత్మవలననే, ఈసమస్త ప్రపంచములు ఉత్పత్తి ఆయినవిగా, ఎవ్వఁడు తెలుసుకొనుచున్నాడో? ఆతఁడు బ్రహ్మస్వరూపుఁడగుచున్నాడు. యని గీతల. 13 అ. 31వ శ్లోకములోను, 'ఫ అయినమ, తువల్లుఫసుమ్మవజహఫ్హుల్లా" అనఁగా మన

మెటుజూచినను దేవుని ముఖమునే జూచుచున్నామయని మహమ్మదీయులు, " యత్రయత్ర మనోయాతి తత్రతత్ర పరంపదం " యని హిందువులు జెప్పుచుండుటవలనఁ బృథగ్భావమును విడచి, సర్వజీవులు పదార్థములు (" హర్ సేలేయి హఫర్ తక్ జిస్కాక్ యెహసామాన్ హే " యని యొకమహమ్మదీయభక్తుఁడు చెప్పినటుల) దేవుని విభూతియేయని, విద్వేషకారణము లేమియు లేవని, ' మతసాంప్రదాయములను ' చక్కఁగఁ బరిశీలన జేయక అవిద్యాంధకారములోబడి, యీ వివాదలే దైవప్రీతికరములని మోక్షసాధనములని తలంచుచున్నారు.

మరిన్ని తేజోబిందూపనిషత్తు 2వ అధ్యాయములో " నబ్రహ్మకుల దర్పంచ " యని వరాహోపనిషత్తు 2వ అధ్యాయములో " సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమ వివర్జితం. "

మైత్రేయోపనిషత్ లో - " వర్ణాశ్రమాచార యుతావిమూఢాకర్మాను సారేణ ఫలం లభంతె । వర్ణాది ధర్మం హిపరిత్యజంత స్వానందతృప్తాః పురుషాభవంతి । వర్ణాశ్రమం సావయవం స్వరూపమాద్యంతయుక్తం హ్యతికృఛ్రమాత్రం. " యనిఁ జెప్పఁబడుటవలన ఆత్మకు వర్ణాశ్రమములు లేవని, యివి మోక్షసాధనములుకావని విశేషించి భంగకరముల నిస్పష్టమగుచున్నది. మరిన్ని " నచర్మణోనరక్తస్యనమాంసస్యనచాఽస్థినః । నజాతిరాత్మనో జాతిర్వ్యవహారప్రకల్పితా " యని నిరాలంబోపనిషత్తులోఁ జెప్పినటుల ఆత్మకు (దేవునికి) జాతిలేదని లోకవ్యవహారము కొరకు నీ వర్ణాశ్రమధర్మము లేర్పరచబడినవని అందువలన నాగంతుకములు గాని సత్యములుకావని స్పష్టమగుచున్నది.

అయితే పురుషసూక్తములో "బ్రాహ్మణోస్య ముఖమాసీత్, హూరాజన్యః కృతః, ఊరూతదస్యయ ద్వైశ్యః। పద్భ్యాగ్ం ద్రో అజాయత" యను వాక్యతాత్పర్యమేమనిన, సృష్టిక్రమము నిర్గుణబ్రహ్మము స్థూలశరీరాభిమానియగు విరాడ్రూపముధరించి జీవుల స్థూలశరీరములకు సృజించినటులఁ గురువు చెప్పినఁబిమ్మట, ర్యఁడు ముఖంకిమస్యకౌ బాహూకా ఊరూపాదాఉచ్యేతే యని ్నఁజేసెను. ఇందుకుఁ బ్రత్యుత్తరముగఁ బైవాక్యమునుఁ జెప్పె తలఁచెదను. అనఁగా బ్రహ్మక్షత్రియ వైశ్యులను ముఖము బా ువులు, తొడలుగానెంచవలయునని, శూద్రులు పాదములయందుఁ ్మైనారని సమాధానము చెప్పబడెను. మరిన్ని "జన్మనాజాయతే ద్రః కర్మణాజాయతే ద్విజః" యను శ్లోకమువలన సర్వజనులు దులుగానే బుట్టుదురని, తరువాత వారివారి కర్మలవలన బ్రాహ్మ ్రియాది వర్ణములుగలవారగుదురని తేలుచున్నది. గీతల 4 అ. శ్లోకములో "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" ృష్ణుఁడు చెప్పియున్నాడు. కాని తానుఁ (కృష్ణుఁడు) యొక్కశాఖ ్హ్మణుల)యందు నెక్కువగను గ్రమముగఁ దక్కినవానియందుఁ ్కువగ నున్నటులఁ జెప్పలేదు.

స్మృతులలోనుఁ బురాణములలోను బ్రాహ్మణాదివర్ణముల త్తినిగూర్చి ఏమిచెప్పినది నేను పణ్డితుఁడనుగానందున వ్రాయఁ ను. గాని, నా యభిప్రాయమేమనఁగా—

మన పూర్వులు— ఆర్యులు, యీదేశము (ఇండియా)ను ంచి, ఇచట స్థిరనివాసులైనఁ బిదప, దేశాభివృద్ధికై, 1. బ్రాహ్మ ము, 2. దేశరక్షణ అనఁగా దేశములోను యితరదేశములనుండి

గలుగు శత్రుబాధ నివారణ, 3. దేశభాగ్య వృద్ధిజేయు కృష్యాది కము వర్తకము, 4. కార్మికమనఁగ (Labor) వీనిని స్థిరముగ నేర్పాటుఁజేయఁదలచి, మొదటిదైన బ్రహ్మజ్ఞానాభివృద్ధికొరకు నాకాలమందు విద్యావంతులు దైవజ్ఞానసంపన్నులైనవారిని ("బ్రహ్మజానాతి బ్రాహ్మణః" యను వాక్యానుసారమున") బ్రాహ్మణశ్రేణిగ నేర్పఱచి, వారు సదా బ్రహ్మవిచారముఁ జేయుచు బ్రహ్మమును గూర్చి స్వానుభవముచే నితరశాఖలవారికి బోధించుచుండుటకు, వీరిని యితరశాఖలవారు గురువులుగను బురోహితులుగ నేర్పఱచుకొని పోషించుచుండుటకు నేర్పఱచిరని తలఁచెదను. వీరు వాక్కులతో బోధచేయుదురుగాన ముఖమని చెప్పబడెను. ఇంగ్లాండు మొదలగు క్రిస్టియను దేశములలో ఈశాఖను. Ecclesiastical order యని దీనిలోఁ బనిజేయువాడనఁగా దైవజ్ఞానబోధఁ జేయు వారిని clergy men—priests యని చెప్పెదరు. ఇంతియగాక, వీరి పోషణకొఱకు నితరులనుంచి tithes (పదోవంతు) యను పన్ను పుచ్చుకొని జీతములనిచ్చెదరు.

2. దేశరక్షణకొరకు ఆకాలమందు నాయుధపాణులై శత్రు సంహారమొనర్చుచు దేశపాలనఁ జేయుచున్నవారిని క్షత్రియులని, బాహువులతో పోరాడెదరుగాన విరాట్పురుషునకు బాహువులని, 3. కృష్యాదివ్యాపారమువలన దేశములో ధనధాన్య సమృద్ధి గలుగఁజేయుచున్నవారిని వైశ్యులని విరాట్పురుషుని తొడలని చెప్పబడెను. 4. కార్మికము (Labor) యనఁగా కృష్యాదిసర్వపనులనుఁ జేయువారిని శూద్రులని పేరుపెట్టినారని తలఁచెదను. కార్మికమనఁగా సర్వజనముయొక్క సౌఖ్యముకొరకుఁ జేయవలసినఁబనులు—వ్యవ

సాయము, వడ్రము, కమ్మరము, మృద్భాండములు, బట్టలునేత, కం చరము, మొదలగు సర్వపనులు అయివున్నవి. సర్వజంతువులకుఁ బాదములు ఎట్లు చలనసాధనము (Motor force) లైయున్నవో అటులనే కార్మికులు సకలకర్మలకు ముఖ్యసాధనము (Motor force) యగుటవలన (పద్భ్యాగ్‌మ్ శూద్రోఅజాయత) శూద్రులు విరాట్పు రుషపాదములనుండి పుట్టినవారని చెప్పబడెనని తలఁచెదను. మను జులు నిలుచుండుటకు నడచుటకుఁ బాదములెట్లు సాధనములో అటులనే సర్వకర్మలకుఁ జేయుటకు సాధనభూతులైన కార్మికులకు శూద్రులను బాహుళ్యనామము. నీచముకాదని విశేషించి ఘన మైనదని తలఁచెదను.

ఇంతేగాక గీతల 9 అ. 32 శ్లోకములో భగవద్భక్తిచేయు శూద్రులు స్త్రీలుఁగూడ ముక్తినొందుదురని చెప్పఁబడినది. పాపప్ర వర్తనఁగల బ్రాహ్మణుఁడు శూద్రునికంటె నీచముగా నెంచబడు నని, సత్యశౌచధర్మగుణములవలన శూద్రుఁడు సద్విజుఁడగునని శ్రీమహాభారతములోఁ జెప్పఁబడినది. „పాపవర్తనుండు బ్రాహ్మ ణుండయ్యును నిజము శూద్రుకంటె నీచతముఁడు, సత్యశౌచధర్మ శాలి శూద్రుండయ్యు నతఁడు సద్విజుండయరిరి మునులు.” శూద్రు లకంటె తక్కువశాఖలలోఁ బుట్టినను, వారి సత్యప్రవర్తన, దైవ భక్తి, యోగ్యతలచే ఋషిపదముల నొందినవారిపేర్లు వజ్రసూచోప నిషత్తులో వివరింపఁబడినవి. ఈకాలమునఁగూడ నీచకులములలోఁ బుట్టి యోగ్యతచేతను, దైవభక్తిచేతను మహాత్మపదవిని బొందిన మహనీయులనేకముగానున్నారు. దక్షిణ హిందూస్థానములో నందుఁ డను నీచవంశజాతుని చరిత్ర చదువుము. శూద్రుఁడను నామమువలన

నీచమును బ్రాహ్మణ నామమువలన ఘనమును లేదు. సత్యసంచారము యోగ్యత రక్షించును. తదితరము బ్రాహ్మణునకైనను పతన హేతువు. „ బ్రాహ్మణక్షత్రియోవైశ్యో శూద్రోఛండాల ఏవచ। దృఢాభ్యాసకరోనిత్యం పునర్జన్మ నవిందతి." యను శ్లోకము ప్రకారము దృఢాభాసము (సత్యప్రవర్తన, దైవభక్తి) చే ధన్యులగుదురు.

మరియుఁ బ్రతిపురుషునకు, శిరస్సు, భుజములు, తొడలు, పాదములు, ఎట్లు విధాయకమైన అవయవములో, అటులనే ప్రతి గ్రామము, నగరము, పట్టణములలోను, దేశములోనుండు జనసమూహము (Society)కు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులను నాలుగు శాఖలు (అవయవములు) విధాయకముగ నుండవలయును ఏదలేకపోయినను హానిగలుఁగును. ఈలోకములో నెవరుగాని నితరుల సహాయములేకుండ జీవించలేరు. గాన తాను, ఇతరులు వేరుకాదని యొకఆత్మయెయని అద్వైతబుద్ధి గలిఁగియుండుట శ్రేయస్కరమును, ఇహపరసాధనముకూఁడ యగును.

## పూర్ణాద్వైతభావన యనఁగా నేమి?

మనుజుఁడు రాగద్వేషాదులను విడచి నిండు వివేకియై „ మనసైవానుద్రష్టవ్యమ్ " అను శ్రుతిప్రమాణానుసారముగ (జీవేశ్వరౌ మాయికావితి విజ్ఞాయ । సర్వశేషం నెతినేతీతి విహాయ । యదవశిష్యతే తదద్వయం బ్రహ్మ " అద్వయతారకోపనిషత్తు. „ ఏకమేవా ద్వితీయం బ్రహ్మ. " (శ్రుతి) అద్వయబ్రహ్మను సదామనస్సుచేతఁ జూచుటయనఁగా ధ్యానించుచుండుటఁ బూర్ణాద్వైత భావన యగును. ధ్యానమనఁగ సర్వభూతములయందు సమదృష్టి, యనఁగా

సమస్తభూతములయందుఁ దనను, తనయందు సమస్తభూతములను (జాతి, మతము, మొదలగు భేదములించుకయును లేక) జూచుట, సర్వభూత సుఖదుఃఖములు తన సుఖదుఃఖములుగా భావించి, అహం బ్రహ్మాస్మియను మహావాక్యానుసారముగ సర్వము బ్రహ్మ యనఁగాఁ దానేయని, నితరముకాదని, స్వానుభవముతో నుండుట యని, శ్రుతి, యఏతస్మిన్ను దరమంతరంకురుతే। అథతస్యభయం భవతి" ఎవ్వడు తనకంటె భిన్నునిగా నితరునిఁజూచిన భయము కలుగుననఁగా మోక్షప్రాప్తి గలుగదని దృఢనిశ్చయముఁగలిగి యుం డుటఁ బూర్ణాద్వైతభావనయని నమ్మెదను. ఇట్టి దృఢభావనవలన (శ్రుతి. ఉభేవిద్వాన్ పుణ్యపాపేవిధూయ నిరంజనః పరమంసామ్య ముపైతి") జ్ఞాని పుణ్యపాపములను రెంటిని విడచి నిష్కళంకుఁడై (గీ. 2 అ. 45 శ్లో. ఆత్మవాన్‌భవ) పరబ్రహ్మస్వరూపుఁడై యుం డును. ఇట్టి జ్ఞానికి విధినిషేధములేమియు లేవు. ఈసందర్భమున గీతల 6 అ. 29, 30, 31, 32, శ్లోకములనుఁ జదువుము.

గురువు తలంచినంత పూర్ణాద్వైతభావన కలగనందున జాగ్ర దవస్థలో దర్శనమిచ్చి యుపదేశముచేయలేదు. కాని ముందుగ్రం థములో వివరించినట్టుల స్వప్నములలోనే యుపదేశముల నొసంగిరి.

నేను పెన్‌షన్ పుచ్చుకొన్నపిమ్మట భూములశిస్తు పెన్‌షను తప్ప నితరాదాయమేమియు లేదు.

## — 16వ స్వప్నము. —

వెనుకటి స్వప్నములోఁ జెప్పిన పూర్ణాద్వైతభావన—పను బుద్ధి లభించుటకు సాధనములైన ధారణ, ధ్యాన, సమాధులనఁగ

ఆత్మసంయమయోగము, యీస్వప్నములోఁ బ్రదర్శింపబడినదని తలఁచెదను.

"ఇతః కోన్వస్తి మూఢాత్మాయస్తు స్వార్థే ప్రమాద్యతి । దుర్లభం మానుషం దేహం ప్రాప్యత త్రాపి పౌరుషం।" యని శ్రీశంకరాచార్యస్వామి వివేకచూడామణిలోఁ జెప్పినటులను, "మహతాపుణ్యపణ్యేనక్రీతేయం కాయనౌస్త్వయా । పారందుః ఖోదధేర్గంతుం తరయావన్న భిద్యతే." యను శ్లోకబోధను బట్టి ప్రతిమనుజుఁడు ప్రకృతజన్మయందే శరీరసంబంధమైనట్టి మనస్సంబంధమైనట్టి సర్వవిఘ్నములను చిక్కులను జయించి నిండు శ్రద్ధతో నాత్మధ్యానమొనర్చి ముక్తినొందవలయును. గాన—

(స్వప్నము) నేనొకఁడనే శ్రీరామదర్శనార్థమొక దివ్యస్థలము సేపించుటకుఁ బయలుదేరినాను.

(వివరణ) మనస్సులో బ్రహ్మజిజ్ఞాసవృత్తి పుట్టినది.

(స్వ) ఆరాత్రియొక గ్రామముచేరి యొక బ్రాహ్మణుని ఇంటిలో నున్నాను.

(వి) కొంతవరకు మననముచేయఁగా విశ్రాంతియందుఁ గోరికపుట్టినది. రాత్రి శబ్దము బ్రహ్మనిష్టచేయనికాలమనఁగ మనస్సు ఇన్ద్రియవిషయములలో సంచరించుకాలము.

(స్వ) ఆకలివేసినది. ఒక బ్రాహ్మణుఁడు (బ్రహ్మన్నశాస్త్రిగారని జ్ఞాపకము) అదివరలో నాకొఱకు జాగ్రత్తఁజేసి యుంచిన నన్ను ముకొరకు వెదకినాను. చాలావెదకఁగా నొక గుడ్డమూటలో దొరికినది. మూటవిప్పుకొని యిఁటివసారాగదిలోఁ దినబోవుచుండఁగా—

(వి) బ్రిహ్మనిష్ఠయందు బుద్ధిపుట్టినది. 11వ స్వప్నములోఁ జెప్పిన టుల బ్రిహ్మన్న శాస్త్రిగారివద్ద నేను భగవద్గీతలునుఁ జదివినపుడు, బ్రిహ్మజ్ఞానమునుగూర్చి ఆయనచేసినబోధలను జ్ఞాపకముచేసు కోవలెనని వృత్తిగలిగినది. మనస్సులో బాఁగ నాలోచించగా జ్ఞాపకము కలిగినవి. ఇంటివసారాగదియనఁగా నాభిదగ్గరనుండు చిత్తస్థానము. ఆబోధల తాత్పర్యమునుగూర్చి స్థిరచిత్తముతో నిదిధ్యాసచేయుచుండగా—

(స్వ) నాయింటిబ్రాహ్మణుఁడు లోపలకువచ్చి దినుమని కొన్ని వ్యంజనములిచ్చిన జ్ఞాపకము.

(వి) నేను నరసాపురములోనున్న కాలములో వెలివేటి లక్ష్మీనృసింహ శాస్త్రిగారు అద్వైతమునుగూర్చి తరుచు చతిమనోహరముగ నిచ్చిన యుపన్యాసములుఁగూడ జ్ఞాపకమువచ్చినవి.

(స్వ) అన్నముమూట విప్పినాను. గాని తిన్నానో లేదో తెలియదు.

(వి) మనస్సు చలించి మననది ధ్యాసలుజరగలేదు.

(స్వ) మలిరోజుదయమునలేచి కాలువదాటి శ్రీరామాలయమునకు వెళ్లుటకుఁరాగాఁ బడవదొరకలేదు.

(వి) ద్వైతజ్ఞానమునుగూర్చి తిరిగి నిదిధ్యాస ప్రారంభించినాను. గాని, జ్ఞానప్రాప్తికి అవిద్యయనెడు కాలువ అడ్డువచ్చినది. దానిని దాటుటకు పడవ (జ్ఞానము) లభించలేదు.

(స్వ) అప్పటికి ఉదయము 8-9 ఘంటలైనది.

(వి) అనఁగా నిదిధ్యాసప్రారంభకాలము.

(స్వ) అక్కడొకమనిషి కనపడి, ఇప్పుడు పడవ దొరకదని మధ్యా

హ్నమువరకు కనిపెట్టియుంటె, సాయంత్రము వేళఁ దన స్టీమరు మీదఁ గాలువ దాటించెదననియుఁ జెప్పెను.

(వి) ఆమునిషిబుద్ధి—వివేకము. నిదిధ్యాస ప్రారంభమందు జ్ఞానము లభించదని, ఇన్ద్రియములను, మలినమనస్సును, (గీతల 4 అ. 39 శ్లో) నిగ్రహించి నిండుశ్రద్ధతో ధ్యానాభ్యాసము జేయుచుండిన, సాయంత్రము వేళ యనఁగా ధ్యానపరిపక్వకాలమున ఆత్మజ్ఞానమును దన పడవమీద నవిద్యానదిని దాటించెదనని (గీ. 8 అ. 8 శ్లో) చెప్పెను. "వివేకం పరమాశ్రిత్య బుద్ధ్యా సత్య మవేక్ష్యచ । ఇంద్రియార్థినలంఘిత్వా తీర్థో భవ భవార్ణవాత్" వరాహోపనిషత్తు. 5 అ. భక్తి, శ్రద్ధ, పట్టుదలయనఁగాఁ బ్రయత్నమును విడువకుండుటవలన సకాలములోఁ జ్ఞానము లభించునని చెప్పెను.

(స్వ) మధ్యాహ్నభోజనముకొఱకుఁ దిరిగీ యింటికి వెళ్లుట కిష్టము లేక సాయంత్రమువరకుఁ బడవ దొరకదను విచారముతోఁ గాలువగట్టుమీదఁ గూర్చుని యుండఁగా—

(వి) మలినమనస్సుచు ఇందిరియములను (గీ. 4 అ. 41 శ్లో.) సంసారసుఖానుభవ కోర్కెలనుండి మరలించి, నేను—శుద్ధమనస్సు జ్ఞానసంపాదనకై మిక్కిలి ఆతురత, కొంత సంశయములతో నుండఁగా శుద్ధమనస్సు నిదిధ్యాసనుంచి ధారణలోఁ బ్రవేశించెను. ధారణయనఁగ శుద్ధమనస్సును ఆత్మయందుంచుట, "ఆత్మ నిమనోధారణం ధారణా." శాండిల్యోపనిషత్తు. "యత్రయత్ర మనోయాతి బ్రహ్మణ స్తత్రదర్శనాత్ । మన సాధారణంచైవ ధారణాసాపరాను తా." తేజోబిందూపనిషత్తు.

దేనియందైనను, పండ్రెండు నిమిషములకాలము, మనస్సును చలనరహితముగ నిలిపిన, నదిధారణయగును. మధ్యాహ్న భోజనముకొరకు తిరుగనింటికి వెళ్లుటకిష్టములేకపోవుట "శ్రద్ధను" సాయంత్రమువరకుఁ బడవ దొరకని విచారముతో నుండుట 'సంశయము'ను, కాలువగట్టుమీదఁ గూర్చునియుండుట జ్ఞాన సంపాదనగోర్కెయుఁ దెలియఁజేయును.

(స్వ) నొక బ్రాహ్మణుఁడు కనుపించి, "మాయా మారీచ బాహూక నాయకా మమనావికా॥" యనుమంత్రము జపముచేయుమని, పడవ శీఘ్రముగ లభించుననియుఁ జెప్పెను.

(వి) ఈమంత్రోపదేశముచేసిన బ్రాహ్మణుఁడు గురువు. 'మాయా' అనఁగా ఈశ్వరాధిష్టిత సత్వగుణమూలప్రకృతి, 'మారీచ' యనఁగా ఈశ్వరాధిష్టిత తమోగుణ మూలప్రకృతి—అనాద్య విద్య. ఈరెంటిని జయించిన జ్ఞానులు—తత్వదర్శినులను (గీ. 4 అ. 34 శ్లో.) బ్రార్థనఁజేసిన, జ్ఞానమనుపడవ శీఘ్రముగలభించు నని జెప్పెను. "కర్ణధార గురుంప్రాప్య కృత్వాసూక్ష్మం తరం తిచ। అభ్యాసవాసనా శక్త్యాతరంతి భవసాగరం." యోగ కుండల్యుపనిషత్తు.

జపమనఁగా "విధివద్గురూప దిష్టవేదాఽవిరుద్ధ మంత్రాభ్యాసః", శాండిల్యోపనిషత్తు.

(స్వ) నేనామంత్రమును జపముచేసినవెంటనే, దాటవలసిన గాలువ లోఁ గలసియున్న కాలువకుండా పెద్దపీటమువంటి దివ్యమైన పడవ శీఘ్రముగ వచ్చినది.

(వి) మంత్రము జపముచేసినవెంటనే యనఁగాఁ తత్త్వవిధుల ధ్యాన మొనర్చినవెంటనే మనస్సు స్థిరతనొంది ఆత్మజ్ఞానము లభించు తరుణము సమీపించినది. "ధారణాభిర్మనోధైర్యం యాతిచైతన్యమద్భుతం." యోగచూడామణ్యుపనిషత్తు.

(స్వ) నేను స్టీమరులో నెక్కకపూర్వము మలవిసర్జనము చేసుకోవలసి అక్కడనున్న బ్రాహ్మణునితోఁ జెప్పినాను. ఆయన చెంబుతో నుదకము దెచ్చియిచ్చి మలవిసర్జనకొరకు యున్నత ప్రదేశము నుఁగనబరచెను. నేనచటికి వెళ్లగా మలవిర్జనకాలేదు. వెంటనే బ్రాహ్మణుఁడున్న స్థలముకువచ్చి పాదప్రక్షాళనముఁ జేసుకొన్నాను.

(వి) మలవిసర్జన యనుమానముగలుగుట, బ్రాహ్మణుఁడుదకము దెచ్చియిచ్చుట, ధారణలో మనస్థిరతను తప్పించు మలినవాసనలైయున్నవి. అశుచిస్థలముకు వెళ్లినపుడు శరీరశుద్ధికొరకుఁ బాదప్రక్షాళనము చేసుకొనుట, బ్రాహ్మణాచారము గాన, పాదప్రక్షాళనము చేసుకొంటిని. బ్రాహ్మణుఁడు—గురువు ఉదకము తెచ్చియిచ్చుట, మల విసర్జనకొరకు ప్రదేశము గనబరచుట యోచించగా నుత్తమగురువు తొలుత మనస్థిరతకొఱకు శిష్యుని యొక్క శారీరక బాధల నివారణఁజేసి, పిమ్మట జ్ఞానమార్గము జూపుట కర్తవ్యమని సూచించును.

(స్వ) పిమ్మట బ్రాహ్మణుఁడు నన్నుఁ బడవయొద్దకుఁ దీసుకుపోవు చుండెను. మధ్యనొక యుదకప్రదేశము దాటవలసియున్నది. ఆత్రోవ చాలాదిక్కుగానున్నది. వెనుక గచ్చుతోఁగట్టఁబడి

ప్రిస్తుతము ముక్కలై యిటూఅటూపడి పైనుండి నీరుపోతూ యున్న నిటుకముక్కలమీదనుంచి సులభముగానుండు మరొక మార్గము వెదకుచు బ్రాహ్మణుడు మధ్యమధ్య నన్నుబడిపోకుండఁ బట్టుకొనుచు నాయుదకప్రదేశము దాటించెను.

(వి) శరీరశుద్ధి మనస్థిరతకుఁ గొంతకారణము గాన, పాదప్రక్షాళన జేసుకొనినఁబిమ్మట మనస్సు ధారణనుంచి ధ్యానములోఁ బ్రవేశించినది. కాని యుదకప్రదేశమనఁగ సంశయ భయాదులు, మలినవాసనలు, వృత్తులు, మనస్సులోఁదట్టి చిత్తమును చలింపజేసినవి. అందువలన, ‹ ఆత్రోవ › (ధ్యానాభ్యాసము) చాలా చిక్కుగా నున్నదని, వెనుక గచ్చుతోఁగట్టఁబడి ప్రిస్తుతము ముక్కలై యిటుఅటుపడి పైనుండి నీరుపోవుచూ ఉన్నదని చెప్పబడెను. (గీ. 6 అ. 14 శ్లో.) లోఁ జెప్పినటుల ధ్యానవిఘ్నకరములగు సంశయ భయాదులను వదలి, దృఢమనస్సుగలిగి ధ్యానముచేయువారికి త్రోవ గచ్చుతోఁగట్టఁబడి భయరహితమై యుండును. గీ. 6 అ. 20 శ్లోకములోఁ జెప్పినటుల పరమాత్మదర్శనమై ఆనందించును. చంచలమనస్సుగల నావంటివానికి ధ్యానములో విఘ్నపరంపర కలుగుటవలన, త్రోవ ప్రిస్తుతము ముక్కలై యిటూఅటూ పడినది యనఁగ ననేక మార్గములుగ నుండుటయెగాక, నీరు పైనుంచి పోవుచున్నదనగా భయప్రమాదములతో గూడియున్నదని చెప్పఁబడెను. కాని, గీతల. 6 అ. 25 శ్లోకములోఁ జెప్పినటుల దృఢమైన బుద్ధిచేత మనస్సును ఆత్మయందునుంచి, గీ. 26వ శ్లోకబోధప్రకారము తిరుగ చలించినవెంటనే ఆయా విషయములలోనుంచి మరలించి ఆత్మయం

దుంచుటవలనఁ గ్రమముగ మనస్సు స్వాధీనమై ధ్యానములోఁ దఱచు కించిత్కాలమైనను స్థిరతనొందుచుండును. అట్టి చలన రహితకాలములు యను నిటకముక్కలగుండా మెరకమార్గము వెదకుచు ననఁగాఁ గొంత ఎక్కువస్థిరముగనున్న కాలముల మీఁదుగాగురువు, మధ్యమధ్య నన్నుఁ బడిపోకుండఁ బట్టుకొనును, అనగా "ప్రమాదోబ్రహ్మనిష్ఠాయాం నకర్తవ్యః కదాచన." తురీయాతీతావధూతోపనిష ద్వాక్యానుసారముగ, భయము, ప్రమాదము, భ్రాంతి మొదలగు వానివలన గలుగు విఘ్నపరంపరలనుంచి మనస్సును తప్పించెను. ధ్యానములో క్రమముగ మనస్సు స్థిరతనొందెను.

(స్వ) పడవదగ్గఱకు వెళ్లుటకు రమారమీ 50 గజముల పొడవు, యెత్తు, అరగజము, వెడల్పు, అరగజము లోతుగలిగి గచ్చుతోఁ గట్టఁబటి యెల్లప్పుడు నిర్మలమగు నీరు వేగముగఁ బైనుంచి క్రిందకుఁ బ్రవహించుచున్నట్టిన్ని దానికి మొదటననఁగాఁ బైన మనిషి దూఁగుటకు మాత్రము రంధ్రముగలిగి చాలా యేటవాలుగా నడచుటకు సాధ్యముకాని త్రోవగుండా బైకి ఎక్కవలసివున్నది.

(వి) పడవయనఁగ ఆత్మజ్ఞానము—"స్వప్రకాశం జ్ఞానం, సర్వప్రకాశకం జ్ఞానం, నిరావరణచిన్మాత్రం జ్ఞానం. అనాద్యనంతం నిరంతరమవృత్తి సాక్షిచైతన్యమేవజ్ఞానం." సర్వసారోపనిషత్తు. పడవదగ్గఱకు వెళ్లుటయనఁగా నట్టిజ్ఞానమును బొందుట, ఇందుకు సాధనము చిత్తస్థైర్యమైయున్నది. అనఁగా మనస్సు ధ్యానములో మిక్కిలి స్థిరతగలదై, తన ఉత్పత్తిస్థానమగు మూలాంధారము

(యోగశిఖోపనిషత్తు, వరాహోపనిషత్తు 5 అ.)లోనుంచి మనిషి దూరుటకు మాత్రము, విశాలమగు రంధ్రములోనుంచి, నడచుటకు వీలులేక, చాలా యేటవాలుగా పైనుంచి క్రిందకు నీరు ప్రవహించుచున్న త్రోవగుండా పైకి ఎక్కవలసివున్నది.
నేను—మనస్సు యున్నస్థానము. రెండు కాలువలు గలసిన మమ్మార్గలస్థలముగాన, నది మూలాధారచక్రము. దానిలోనున్న సన్నరంధ్రము. (బ్రహ్మద్వారము) ధ్యానబిందూపనిషత్తు.) సుషుమ్నా నాడిలోనికి మార్గము. (మూలాధారాదారభ్య బ్రహ్మరన్ధ్రపర్యంతం సుషుమ్నా సూర్యాభా." మణ్డలబ్రాహ్మణోపనిషత్తు) దీనిలో నెల్లప్పుడు పైనుంచి క్రిందకుఁ బ్రవహించు నిర్మలోదకము అమృతధార, మూలాధారప్రారంభముగ సహస్రారమువరకు నొకటి కంటె నొకటి ఉపరిభాగమున నుండిన స్వాధిష్టాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రార చక్రములనుండి క్రమముగఁ గ్రిందకుఁ బ్రవహించుచుండుటవలన, నడచుటకును, పైకి యెక్కుటకును, సాధ్యముగాని త్రోవయని చెప్పఁబడెను. "ఆధారే పశ్చిమేభాగే త్రివేణీసంగమే భవేత్ । తత్రస్నాత్వాచపీత్వాచదరః పాపాత్ప్రముచ్యతే ।"— "ఆధారే పశ్చిమంలింగం కవాటం తత్రవిద్యతే । తస్యోద్ఘాటనమాత్రేణ ముచ్యతేభవ బంధనాత్, ।" యోగశిఖోపనిషత్తు.

(స్వ) నేను దానిని—(బ్రహ్మద్వారమును) స్వతంత్రించి యెక్కలేనన్న భయముదోచి బ్రాహ్మణుని సహాయము జేయుమని కోరితిని.

(వి) పైనఁజెప్పినటుల, గురుకటాక్షము వలన మనస్సు ధ్యానములో స్థిరతనొందినది గాని, త్రిపుటి—(ధ్యాతృ, ధ్యాన ధ్యేయ,) రహి

తము, సమత్వబుద్ధి అనఁగా—"సర్వంఖల్విదంబ్రహ్మ"—సర్వము బ్రహ్మమేగాని నితరము కాదను సమదర్శిత్వము. (సమస్తభూతములయందుఁ దనను, తనయందు సర్వభూతములను, జూచుట యనఁగా బ్రపంచములో దృష్టిగోచరమైనట్టి కానట్టి సర్వపదార్థములు తానేయని అన్యముకాదనే జ్ఞానము కలుగనందున సన్నరంధ్రముగుండా సుషుమ్నలోనికి నెక్కుటకు భయము దోచి, గురువును, సహాయముచేయుమని కోరెను. అనఁగా ధ్యానవిఘ్నకరములైన సంశయ, భయ, ప్రమాదవృత్తులు మనస్సులోనుదయించినవి.

(స్వ) "ఎక్కలేవా" యని యడిగి సహాయముజేయువానివలె గనుపించెను. గాని చేయలేదు. ఏమిజరిగినదియు దెలియదు. సన్నమార్గములోఁ జిక్కుపడకుండఁ బైకివచ్చినాను.

(వి) "ఎక్కలేవా" యని గురువడిగిన బ్రశ్నవలన భయకంపాదులు వదలి చిత్తస్థైర్యముగలిగి ధ్యానములో మనస్సు ఉన్మనిభావము (శ్లో. "యత్రగత్వాతు మనసోమనస్త్వంనైవవిద్యతే। ఉన్మనీసాసమాఖ్యాతా సర్వతంత్రేషు గోపితా।)" పొంది సన్నమార్గము దాటినాను. గురువు జ్ఞానమార్గము బోధజేయునుగాని దాను శిష్యునికొఱకు జ్ఞానసంపాదన జేయలేడు. అయినను శిష్యునకు మనఃస్థైర్యము గలుగుటకు సహాయము చేయువానివలెఁ గనుపించెను.

(స్వ) పిమ్మట పడవెక్కినాను. బ్రాహ్మణుఁడు కూడా పడవెక్కె కాలువ యవతలయొడ్డునకు నాతో దాటిన జ్ఞాపకము.

(వి) పైనఁజెప్పినట్లు మనస్సు ఉన్మనిభావము నొందుటచే ధ్యాన

ములో ఆత్మజ్ఞానము లభించినది. సంప్రజ్ఞాతసమాధి ప్రారంభమైనదిగాన, గురువు తిరుగ కనుపించలేదు. "బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయాస్థితిః । ధ్యానశబ్దేనవిఖ్యాతః పరమానంద దాయకః ॥" తేజోబిందూపనిషత్తు.

(స్వ) కాలువ యివతలయొడ్డుకురాగా నాతల్లి, భార్యా, కుమారుడును నన్నుఁ గలుసుకొన్నారు.

(వి) సమాధిప్రారంభమునందు సంసారవాసనలు తిరిగీ మనస్సులో నుదయించినవి.

(స్వ) నాభార్య యాసమీపములో నున్న మరియొక కాలువలోనికి నీరునిమిత్తము దిగి మునిగిపోయినది. ఎవరో వెంటనే మునిగి దానిని పైకి తీసినారు. పిమ్మట వీరిసంగతి యేమైనదో నాకు తెలియదు.

(వి) నాభార్య కాలువలో మునుగిపోవుట మొదలగునవి సమాధివిఘ్నకరములైన మలినవాసనలు, వృత్తులై యున్నవి. వీరి సంగతి నాకు తిరిగీ తెలియకపోవుట, గీతల 13 అ. 10 శ్లోకానుసారముగ వారియెడను దాసీనుడై అనఁగా మనస్సులోనుదయించిన సంసారవాసనలఁ బారదోలి, ధర్మరాజు స్వర్గారోహణ ప్రయాణములోఁ దమ్ములను, భార్య—ద్రౌపదిని విడచి యొంటరిగా వెళ్లినటుల, వారిని విడచి.

(స్వ) నేను వెంటనే శ్రీరామ యనఁగాఁ బరమేశ్వరాలయమునకు బయలుదేరినాను. మార్గమున వెళ్లినాను.

(వి) సంసారవాసనలేమియు లేక నిండుమనస్సుతో ధ్యానమొనర్చుచుంటిని.

(స్వ) త్రోవలో 2_3 బ్రాహ్మణులు దర్భాసనములతోఁ గనుపడి నారు. వారును బరమేశ్వరదర్శనమునకు వెళ్లుచున్నారు. నన్ను జూచి “ కేవలమునుంచి యాచారములేని నాకుఁ బరమేశ్వరదర్శన మవునా ? యని యొకరును, “ పూర్వజన్మ సుకృతముండెనేని గావచ్చునని యొకరును, అన్నారు.

(వి) ఈస్వప్నముగలిగిన కాలమున నాకుఁ జుట్టకాల్చడము, తాం బూలము నమలడము విశేషాభ్యాసములుండుటవలన మనస్సులోఁ దత్సంబంధమగు మలినవాసనలు బుట్టినవి. వెంటనే వానిని ఖం డించు వృత్తులు గలిగినవి. ఈమలినవాసనలను వృత్తులను, నణ చి నిర్విఘ్నముగ ధ్యానమొనర్చుచుంటిని.

(స్వ) కొంతదూరము వెళ్ళగా నొక్క పెద్దకాలువ దాటవలసివచ్చినది. దానికి బహు జారుగా నుండే సన్నమైన యొక కఱ్ఱ వంతెనగా నున్నది. దానిపైనుంచి నేను సులభముగా బ్రాహ్మణులకంటె ముందుగా దాటి యవతలకు వెళ్లినాను.

(వి) బ్రాహ్మణుల సంభాషణ మొదలగు సమాధివిఘ్నకరములైన వాసనల నణచి ధ్యానమునర్చుచుండఁగా, పెద్దకాలువ—అవి ద్యాశేషము అడ్డువచ్చినది. అనఁగా మనస్సు తిరిగి చలించినది. ఈచలనమును తన (నిర్మల) మనస్సుచేతనే జయించవలయును. (గీ. 6 అ. 5వ శ్లో.) గాని వేరుసాధనములేదు. ఇట్టిమనస్సునే కఱ్ఱవంతెనయని, అదిమిక్కిలిసూక్ష్మముగాన సన్నమని, చంచ లస్వభావము కలదిగాన జారుగానున్నదని చెప్పఁబడెను. దాని పైనుంచి నేను సులభముగా బ్రాహ్మణులకంటె ముందుగా దాటి యవతలకు వెళ్లినానఁగా మలినమనస్సును, వాసనలను,

గీ. 6 అ. 24_26 శ్లోకములలోఁ జెప్పినటుల ధృఢమనస్సుచేఁ బారదోలి, గీ. 6 అ. 27 శ్లోక సారముగ క్షీణించిన రజోగుణముగలిగి సులభముగ బ్రాహ్మణులకంటె ముందుగాఁ గాలువ అవతలయొడ్డుఁ జేరినాను. బ్రాహ్మణులకంటె ముందుగా యవతలయొడ్డు చేరినాననుటవలన, గీ. 3 అ. 3వ శ్లోకములోఁ జెప్పిన జ్ఞానయోగ కర్మయోగముల వివక్షత దెలియఁజేసెనని తలచెదను. ఏమనఁగా బ్రాహ్మణులు కర్మనిష్టచిహ్నములగు దర్భాసనములను మోయుచూ, దాము కర్మాచరణవలన పరిశుద్ధి నొందినామని, అందువలనఁ దమకు మోక్షప్రాప్తి దప్పక గలుగునని స్వాభిమానమును, సదాచారములేమియు లేనినాకు—కర్మాచరణ లేనివానికి గలుగునాయను సందేహము గలవారు గాన—

గీతల 12 అ. 12 శ్లో. శ్రేయోహిజ్ఞానమభ్యాసాత్ ।

గీ. 6 అ. 8 శ్లో. జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మాకూటస్థో విజితేంద్రియః

గీ. 4 అ. 33 శ్లో: శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః.

గీ. 4 అ. 36 శ్లో. సర్వంజ్ఞానప్లవేనైవవృజినం సంతరిష్యసి.

గీ. 4 అ. 38 శ్లో. నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే.

గీ. 5 అ. 16 శ్లో. జ్ఞానేనతుతదజ్ఞానం యేషాం నాశితమాత్మనః

గీ. 7 అ. 17_18 శ్లోకములు. అచంచలమనస్సుగల నాత్మజ్ఞాని సదా స్వస్వరూపధ్యానముచేయుచుఁ దానే బ్రహ్మయను నిశ్చయభావనఁగలవాఁడుగాన, కర్మాచరణమే ప్రధానమని తలఁచు కర్మయోగికంటె శ్రేష్ఠుడని,

ఈ మొదలగు వాక్యములవలన జ్ఞానయోగము శ్రేష్ఠమని చెప్పఁబడినది.

ధ్యానమనఁగా నేకాగ్రచిత్తత, మధ్యమధ్య నితరవిషయముల నాలోచింపక నొకేవస్తువునుగూర్చి నిరంతర మాలోచించుట.

సమాధియనఁగాఁ జిత్తము పరమాత్మకభిముఖమై యుండుట యని కొందరు తలఁచుచున్నారు.

(స్వ) దాని యవతలనె పరమేశ్వరాలయము కొంచెము దూరములోనున్నది. ఇది దాటగానే అక్కడ కాపలామనిషి కొంచెము రాకూడదని యడ్డుచెప్పెను. గాని మరియెవరో రావచ్చునని చెప్పినారు.

(వి) మనస్సుపైనఁ జెప్పినటుల మూలాధారమునుండి సుషుమ్నానాడి గుండా, "జీవశ్శివః" యను ఆరోహణ క్రమమున హృదయస్థానము—అనాహతచక్రమును జేరుచున్నది. నేను పెదతిరుపతి, సింహాచలము దివ్యస్థలములకు వెళ్లినప్పుడు జరిగిన సంగతులు, సంస్కారములు, వాసనారూపముగ మనస్సుకుఁ దట్టినవి.

(స్వ) వెళ్లినాను. తాంబూలము వేసి చుట్టకాల్చుచు ఆలయసమీపమునకు వెళ్లినాను. తాంబూలము వేసి చుట్టకాల్చుచూ వెళ్లడము చూచి గొందరు నాకుఁ బరమేశ్వరదర్శనము కాదని, యనాచారముగ వెళ్లుచున్నాననియుఁ బరిహాసము జేసినారు. ఆలయమునకు వెళ్లగా నక్కడయుండే గొందరు నన్ను గౌరవముతోఁ జూచినారు. గొందరు వేడుకగానున్నారు.

(వి) ఇవి చుట్టకాల్చడము, తాంబూలము నమలడము, వాడుకవలన మనస్సులోగలిగిన చిత్తవిభ్రమములని దలఁచెదను. ఆలయము

వద్ద నన్ను గౌరవించిన మనుజులు నా పూర్వజన్మలలోఁ జేసిన సుకర్మఫలము ప్రకృతజన్మయందు ఫలించినందున మర్యాద గను బఱచిరని దలఁచెదను.

స్వ) పరమేశ్వరదర్శనమునకొఱకు నిరీక్షించియుండఁగా వారు వచ్చు చున్నారని, అదేసమయమని వెంటనే యెదురుగా వెళ్లి దర్శ నము జేయుమని అక్కడవారు చెప్పినారు.

వి) "హృదయం నిర్మలంకృత్వా చింతయిత్వాఽప్యనామయం" యని పైంగలోపనిషత్తు వాక్యసారమున సర్వవృత్తి శూన్యమై శుద్ధమనస్సు సంప్రజ్ఞాత సమాధిలో "హృత్పుండరీక మధ్యస్థం చైతన్యం జ్యోతిరవ్యయం" త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు "తతో నారాయణ సాక్షాద్ధృదయె సుప్రతిష్ఠతం" పైంగలోపనిషత్తు వాక్యములసారముగఁ బరమాత్మధ్యానము చేయుచుంటిని.

స్వ) పరమేశ్వరుఁడు నల్లగా మనిషి ప్రమాణముగా నున్నారు. 2-3 సన్నిధానవర్తులతో వారి గదిదాటి సన్నహాలులేక నడవ లోనుంచి వచ్చుచుండఁగా నేను వారినిఁ జూచి సాష్టాంగఁ బడి నాను.

వి) నల్లటి శరీరకాంతి విష్ణురూపము. మనుష్యప్రమాణము, సుదర్శ నమనఁగ భక్తవాత్సల్యతను దెలుపుచున్నవి. సన్నిధానవర్తు లు—జయవిజయులు, వారిగది—అనాహతచక్రము, సన్న హాలు—సుషుమ్నానాడినుంచి అనాహతచక్రములోనికి మార్గము యని తలచెదను. నేను వారినిఁ జూచి సాష్టాంగఁబడినాననగ, "అసంప్రజ్ఞాత" సమాధిలో శుద్ధమనస్సు—ప్రత్యగాత్మ—జీ వాత్మపరమాత్మలోఁ జేరినది. యథోదకం శుద్ధెశుద్ధ మాస్తికం

తాదృగేవభవతి, శృతి "యన్మనస్త్రి జగత్సృష్టిస్థితివ్యసన కర్మకృత్ । తన్మనోవిలయంయాతి తద్విష్ణోః పరమంపదం" మండల బ్రాహ్మణోపనిషత్తు, 5వ బ్రాహ్మణము. "తధాత్మ మనసో రైక్యం సమాధిరితికధ్యతే." వరాహోపనిషత్తు 2 అధ్యాయము.

(స్వ) వారున్న ఆదేవప్రాకారము చేసినారు. నా బాహువులు వారి బాహువులతోఁ బట్టుకొన్నారు. నాలోనుండే సత్వము వారిలోకిఁ బోయినది.

(వి) "క్షేత్రజ్ఞః పరమాత్మాచతయోరైక్యం యధాభవేత్ । తదైక్యేసాధితే బ్రహ్మన్ చిత్తం యాతివిలీనతాం ।" యని యోగ శిఖోపనిషత్తులోఁ జెప్పినటుల శుద్ధమనస్సు—జీవాత్మ—ప్రత్యగాత్మ—క్షేత్రజ్ఞయను సంవిత్ పరమాత్మ—సాక్షిచైతన్యము—ఉత్తమపురుషలో లీనమైనది. గీ. 15 అ. 19 శ్లో. "తల్లయాచ్ఛుద్ధాఽద్వైతసిద్ధిః । భేదాఽభావాత్ । ఏతదేవ పరమతత్వమ్." మండలబ్రాహ్మణోపనిషత్తు. 5 బ్రాహ్మణము.

(స్వ) ఆపోయేటప్పుడు నాకుడితొడలాగినది. కుడిగజ్జలోనొప్పిగలిగినది.

(వి) "స్వాత్మన్యేవ సదాస్థిత్వామనోనశ్యతి యోగినః," యని తురీయాతీతావధూతోపనిషత్తు వాక్యసారమున (మలిన) మనస్సు నసించి, శుద్ధమనస్సు—జీవాత్మ, పరమాత్మ—సాక్షిచైతన్యములోఁ జేరుటవలన, నేనానొప్పికి సాక్షిగానుంటిని గాని దాని ననుభవించలేదు. గీతల 15 అ. 5వ శ్లో.

(స్వ, నాలోనుండే యావత్తు సత్వము వారు ఆకర్షించుఁగా వారిలోఁ బ్రవేసించి నాశరీరమక్కడ పడిపోయినది. నాకు ఇకను వ్యక్తిగాని శరీరాభిమానముగాని లేకుండా పోయినది.

(వి) నాశుద్ధమనస్సు త్రిపుటి రహితమై, 'అసంప్రజ్ఞాత' సమాధిలోఁ బరమాత్మలో లీనమగుటవలన నేవిధమగు వ్యక్తి లేకుండఁ బోయినది. "బ్రహ్మణ్యేవ విలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః" అధ్యాత్మోపనిషత్తు. "నిర్వికారతయావృత్త్యా । బ్రహ్మాకార తయాపునః । వృత్తివిస్మరణమ్ సమ్యక్సమాధిరభిధీయతే ।" తేజోబిందూపనిషత్తు.

ఈస్వప్నములో మనన, నిదిధ్యాస, ధారణ, ధ్యానసమాధుల మార్గముల విశేషములను, వానికిఁ గలిగెడు విఘ్నములనుఁ జక్కఁగ వివరింపఁబడినవి. ఇతరకాలములయందు జ్ఞాపకము రాని ట్టివి, కేవలమనుపయోగమైనట్టివి లోకవ్యవహారములు, మలినవృత్తులు, పూర్వజన్మల సంచితవాసనలు మొదలగునవి మిక్కిలి యద్భుతముగ, ధ్యానాభ్యాసకాలమందు మనస్సులో మెఱుపులు (electric sparks) వలె స్ఫురించి, చిత్తైకాగ్రతఁ బోగొట్టుట అందరి యనుభవములోనున్నదియె. ఇంతేగాక జ్ఞానమార్గమవలంబించిన జనులకు దేవతలు, ఇంద్రియాధిష్ఠాన దేవతలు పరీక్షార్థమనఁగా వారి మనఃస్థైర్యము తెలియుటకు విఘ్నములఁ గలుగఁ జేయుదురని పెద్దలు చెప్పెదరు. సముద్రతరణములో హనుమంతునకు సురస మొదలగువారు ఒనరించిన యాటంకములు దృష్టాంతములుగా రామాయణ సుందరకాండములో వివరింపఁబడినవి. ఈవిఘ్నపరంపరలనుఁ దప్పించుకొనుటకు ముముక్షువు సంశయ రహితుఁడై నిండు శ్రద్ధతో మెలగవలయును. గీతల 4 అ. 39వ శ్లోకము.

యోగాభ్యాసమునకు దశవిధవిఘ్నములను యోగకుండల్యుపనిషత్తులో వివరింపఁబడినవి. ఏవియనఁగా ?

పగటియందు నిద్ర, రాత్రి చాలాసేపు మేలుకొనియుండుట, అధికస్త్రీసంగమము, మూత్రపురీషముల వెంటనే విసర్జింపక నిరోధించుట, శరీరమునకు భర్జించని యన్నము పదార్థములఁ దినుట మొదలగు వానివలన వ్యాధిజనించును. యోగాభ్యాసమువలన వ్యాధిగలిగినదని చెప్పుచు దానిని మానుట, 1. విఘ్నము, 2. సంశయము, 3. ప్రమత్తత, 4. ఆలస్యము, 5. నిద్ర, 6. విరతి, యనగాఁ నభ్యాసము మానుట, 7. భ్రాంతి, 8. విషయలోలత్వము, 9. అనారోగ్యము, 10. యోగము లభించదని తలఁచుట, ఈవిఘ్న దశకమును ముముక్షువు తప్పించుకొనవలయును. ఇందుకుఁ బ్రాణాయామ మభ్యసించవలెను. చిత్తము సుషుమ్నయందు లీనమైనపుడు వాయుచలనము (ఉచ్ఛ్వాసనిశ్వాసములు) తగ్గి మనస్సు స్థిరత నొందును. వరాహోపనిషత్తులో వేరొక ప్రాణాయామము చెప్పఁబడినది. ఏమనఁగా? «బాహ్యాస్థవిషయగ్ం సర్వగ్ం రేచకస్సముదాహృతః। పూరకగ్ం శాస్త్రవిజ్ఞానం కుంభకగ్ం స్వగతస్మృతం। కుంభకేన సదారోప్య కుంభకేనైవపూరయేత్। కుంభేన కుంభయేత్కుంభం తదస్థం పరంశివం.»

(తాత్పర్యము) బాహ్యవస్తు పరిత్యాగము రేచకము. వేదాంతశాస్త్రజ్ఞానము పూరకము. అట్టి జ్ఞానము మరువకుండుట కుంభకము. ఇట్టి కుంభకముచే మనస్సును జయించవలెను. కుంభకముచే కుంభకమును స్థిరపరచవలెను. కుంభకములో పరమ శివస్థానము. ఇటులనే తేజోబిందూపనిషత్ ప్రథమాధ్యాయములో «నిరోధస్సర్వవృత్తీనాం ప్రాణాయామస్సఉచ్యతే। నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్యస్సమీరితః। బ్రహ్మైవాస్మీతి యావృత్తిః పూరకో

వాయురుచ్యతే। తతస్తద్వృత్తినైశ్చల్యం కుంభకం ప్రాణసంయమః।" యని చెప్పబడినది. (తాత్పర్యము) సర్వేంద్రియములను విషయములనుంచి మరలించుట ప్రాణాయామము. ప్రపంచకమునకు సత్యతలేదను బుద్ధి రేచకము. నేను బ్రహ్మయను బుద్ధిపూరకము. నేను బ్రహ్మమను బుద్ధిని విడువకుండుట కుంభకము, ప్రాణసంయమము యగును.

గీతల 6వ అధ్యాయము 5-6 శ్లోకములు మొదలు అధ్యాయాంతమువరకు విరళముగాఁ బోధించిన "సమబుద్ధి" యీస్వప్నములోఁ బ్రదర్శింపఁబడినదని తలఁచెదను.

## — 17వ స్వప్నము —

వెనుకటి స్వప్నములో నుపదేశించిన ధారణధ్యానసమాధులఁ బడయుటకు శ్రద్ధ, ఇంద్రియజయమనఁగాఁ జిత్తశుద్ధినిఁ గలఁగఁ జేసుకొమ్మని ఈస్వప్నము బోధించును.

స్వప్నతాత్పర్యము స్వప్నాంతమందనఁగా స్వప్నజాగ్రతలో వివరింపఁబడెను.

తండ్రియనఁగా ప్రత్యగాత్మ—పురాణపురుషుఁడు. గీ. 9 అ. 17 శ్లో. తల్లి నిర్మలచిత్తము. ఈస్వప్నము కలిగినకాలమందు శరీరపీడ మొదలగు కారణములవలన నిత్యజపము సరిగా జరగలేదు. అప్పుడపుడు బ్రహ్మను గూర్చి పణ్డితులతోఁ దర్కించు వాడుకకూడ నుండెడి. ఈకారణములవలన నేను దుర్మార్గుఁడనై తనను నిందించినానని, అందువలనఁ దనకుఁ గాయిలా వచ్చినదని, నేనిల్లువిడచి పోతేగాని కాయిలా కుదరదని చెప్పెను. ఇది సత్యము. ఏమనఁగా

నేను (ఇంద్రియవశుఁడైన జీవుఁడు) దుర్మార్గుడనై స్వస్వరూప ధ్యానమును విడుచుటచేతఁ దనకుఁ బ్రత్యగాత్మ—కూటస్థచైతన్య మునకుఁ గాయిలావచ్చినదనఁగా ప్రకాశము తగ్గినది. నేను ఇల్లు విడచిపోతేగాని కాయిలా కుదరదనుటవలన, మనస్సును ఇంద్రియ వశతనుండి తప్పించేవరకు శుద్ధమనస్సు ప్రకాశించదని చెప్పెను.

ఈబోధ గీతల 2 అ. 66 శ్లోకములో శ్రీకృష్ణుఁడు అర్జును నకుఁ జెప్పిన (" నాస్తిబుద్ధిరయుక్తస్య । నచాయుక్తస్యభావనా । నచాభావయతశ్శాంతి, రశాన్తస్యకుతస్సుఖం ।") బోధయైయున్నది. ఇల్లుయనఁగా బాహ్యపదార్థములైన భార్యబిడ్డలు మొదలగువా రితో నివసించు ఇల్లుగాదు. తన శరీరములో నిమిడియుండి లోక వ్యవహార కారణములైన (మలిన) మనస్సు, శబ్ద, స్పర్శరూప, రస, గంధములనెడు, ఇంద్రియములు కామక్రోధములు మొదలగు, వానితోఁగలసి యుండుట ఇల్లని, ఇవి జీవునియొక్క పరమార్థజ్ఞాన మును, ఆవరించియుండునవిగాన గీతల 3 అ. 41 శ్లోకానుసారముగ విడువవలయునని, లేనియెడల, శ్రవణ, మనన, నిదిధ్యాసలవలన గలుగు వేదాంతవిచారము, తద్వారా ఆత్మజ్ఞానము లభించదని, అందువలన బ్రహ్మసాక్షాత్కార సాధనము లేకపోవునని, అవిద్య గూడ నశించదని, దానివలన మోక్షానందము గలుగదని, గీతల 2 అ. 62 శ్లోకములో " తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః । ఇంద్రియాణీంద్రియార్థేభ్యః, స్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా । " యని చెప్పినటుల బుద్ధిమంతుఁడు సదా ఇంద్రియములను మలినమన స్సును వాసనలను జయించి యనఁగా నణచి స్వస్వరూపధ్యానముఁ జేయవలయునని చెప్పెను. ఇంద్రియవశతనొంది ప్రపంచ వ్యవహార

ములలోఁ బ్రవర్తించుచున్న నేను (మలినమనస్సు) తండ్రియైన పరిత్యగాత్మ వచనముల (తాత్పర్యము గ్రహించలేక) కుకోపాదేకము గలవాఁడనై ఇల్లు (తల్లి తండ్రి మొదలగువారితో నివసించు స్థానము) విడచి కాశీవెళ్లుటకు యత్నించి, సామాను—బట్టలు మొదలగు బాహ్యావస్తువులను మూటకట్టుమని బంట్రోతుకు నియమించి, ఈసంగతి తల్లి (పరిశుద్ధచిత్తము)తోఁ జెప్పఁగా నామెయు నేను కాశీవెళ్లుట కంగీకరించి కాశీలో నాకేవస్తువు గావలసినను రాజుతోఁ జెప్పి తెప్పించుకోవలసినదని, బాజారులోఁ గొనవద్దనియుఁ జెప్పినది. బంట్రోతనఁగా మలినమనస్సు, బాజారనఁగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, మలినమనస్సు, వాసనలు, వాని వాని విషయములను గ్రహించు స్థానములు, వీనిచెంత చేరకనఁగా దీనికి వశుఁడవుగాక శ్రేష్ఠుడగురాజు—బుద్ధి (గీ. 3 అ. 42 శ్లో.)తోఁ జెప్పి తెప్పించుకొమ్మని మాతృసలహా నిచ్చెను. అనగా యుక్తాయుక్తముల తెలుసుకొని వర్తించుమని చెప్పెను.

"వివేకీ సర్వదాముక్తస్సంసార భ్రమవర్జితః," యోగశిఖోపనిషత్తు. "వివేక వారిణాసిద్ధ్యై పరిశుద్ధ్యాలోకవాన్ భవ। వివేకం పరమాశ్రిత్య బుధ్యాసత్యమవేక్ష్యచ । ఇంద్రియారీనలం ఛిత్వా తీర్ణోభవ భవార్ణవాత్ ।" దుర్లభోవిషయత్యాగో । దుర్లభం తత్వదర్శనం । దుర్లభాసహజావస్థా । సద్గురోః కరుణాంవినా, యను మహోపనిషత్తు వాక్యములసారముగ నీ స్వప్నము సహజావస్థను బోధించునని తలఁచెదను.

"అప్పటికి (తల్లి సలహానిచ్చినప్పటికి) ఝామును ప్రొద్దెక్కి

నది.” యనుటవలన నేను కౌమారవయసులో నుండినను, ఆత్మజ్ఞానము తెలియలేదని సూచించును.

“ఎవరో శాస్త్రివద్ద నేను తనను దూషించినట్లు తాను విన్నానని” తండ్రి చెప్పుటవలన, నేనదివరకు బ్రహ్మమును గూర్చి కుయుక్తులతో వాదములు చేయుట దూషించునట్లగునని దెలిపినటులఁ దలఁచెదను. అనఁగా నీ ప్రపంచమందు శ్రుతి, స్మృతి, ఇతిహాసపురాణములు సత్యములు, ప్రమాణములు కావని, సుఖదుఃఖరూపక ధర్మాధర్మములు లేవని, ఈశ్వరుడు లేడని, స్త్రీపురుష సంయోగముచేతనే ప్రపంచమనాదిగాఁ జరుగుచున్నదని, వేరుకారణములెవ్వియు లేవని జెప్పువాదములు గూడదని దెలపెను. గీ. 16 అ. 8 శ్లో. “పరివాదాంశ్చవర్జయేత్” నారద పరివ్రాజకోపనిషత్తు.

—♦ 13వ స్వప్నము ♦—

ఈ స్వప్నములోఁ జిత్తాకాశమును దృష్టాంతముగఁ గనుబఱచి మఱియొక మంత్రముపదేశించిరి. చిత్తమనఁగఁ గోర్కెతోఁ గూడిన మనస్సు. చిత్తాకాశమనఁగా? అట్టి మనస్సులోపలనుండు దేశము—వ్యాపకశక్తి.

1. నా జన్మస్థానమైన మోడేకుర్రునుంచి నరసాపురప్రయాణము ప్రపంచమునుంచి నా జీవాత్మచేయుచున్న పరలోకయాత్రను దెలియఁజేయును.

2. రాత్రి యనఁగా నామనస్సు ప్రపంచ వ్యవహారములలోఁ జేరియున్న కాలము, నేను ప్రయాణము చేయుచున్న బండిని—శరీరమును, మిక్కిలి వింతయగు క్రొత్తయిండ్లెదుర వాపిన బంట్రోతు

నూతన మంత్రోపదేశము నొందుటకుఁ బరిపక్వమైన నాపూర్వ సుకర్మయని, వింతయిల్లు చిత్తాకాశమని దానిలోనుండిన ననేక గదులు ("బహువిధచిత్తో భవతి" ఛాందోగ్యోపనిషత్తు.) చిత్తాకాశముయొక్క భాగములని వానిలోనుండిన ననంఖ్య జనము నా పూర్వజన్మల కర్మసంస్కారములలో సంచితమైన వాసనల సమూహమని, యిదివరలో నాకుఁ జేసిన యుపదేశము లభ్యాసవశమున నవియిపుడు జనులుగాఁ గనుపించుచున్నారని తలఁచెదను. నేనిపుడవిద్యావృతమై శరీరినై యుండుటఁజేత వారునాకుఁ గ్రొత్త జనులుగాఁ గనుపించినను వారు నన్ను దయతో నాదరించిరి.

౩. ఆయిల్లు—చిత్తాకాశముయొక్క వెలుపలి భాగము—అంతు గనుగొనలేకపోవుటచేత నక్కడనున్న వారితో నన్నుఁగూడఁ దమ సమూహములోఁ జేర్చుకొమ్మని గోరినాను. అందులకు వారంగీకరించినారు. ఇందుకుఁ గారణము శూక్ష్మప్రపంచములోఁ బైనఁ జెప్పిన సంబంధమేగాక, నూతన మంత్రోపదేశ ప్రాప్తిసమయము కూడఁ గారణమని తలఁచెదను. వెంటనే వారిలో నొక నల్లటి పురుషుఁడు—తత్కాలమందు మూర్తిభవించిన నాయొక్క సుకర్మ—శరీరశుద్ధికొఱకు స్నానముచేయించి, నానడుము, జబ్బలు పట్టుకొని యక్కడనే పొగవెడలుచున్న గుండముమీద నొకటిరెండు నిమిషములెత్తి పట్టియుంచి పిమ్మట నివతలఁ గూర్చుండఁబెట్టి "శ్రీఃశివః" యను మంత్రోపదేశమును జేసెను. గుండమనఁగ జ్ఞానాగ్ని, వెడలుచున్న పొగ బుద్ధిచైతన్యముయొక్క సర్వవ్యాపకశక్తి యనఁగా "విక్షేపశక్తి" "అహమేవ హృదాకాశే చిదాదిత్య స్వరూపవాన్" తేజోబిందూపనిషత్తు ౩ అ.

4. ప్రణవములేదేమని ప్రశ్నించఁగా మంత్రము, ఆర్షికము' ప్రణవమక్కఱలేదని ప్రత్యుత్తరమిచ్చిరి. అపుడక్కడనున్నవారం దరుఁ గూడ నట్లే జెప్పిరి. ఇదిగాక వెంటనే నన్ను సమీపములో విశాలమగు గోతులో మూడు రంధ్రములుగల మట్టిపొరతోఁ గప్పఁ బడి వెల్లగితుల బరుండియున్న పురుషునియొద్దకు గురువు తీసుకొని వెళ్లి పై ప్రకారము ప్రశ్నచేసినానని చెప్పఁగా ఆయన (గోతులోఁ బరుండియున్నవారు) మంత్రమార్షికమని ప్రశ్నలు జేయఁగూడదని చెప్పినారు. వీరి శరీరము ముఖము మూడు రంధ్రములుగుండ బాగుగ గనుపించుచున్నది. ఇట్లు జేయుటవలన నామనస్సులో గలగిన సంశయము పోయి మంత్రాక్షరములయందుఁ బూర్వనమ్ కము శ్రద్ధయుగలిగి వారికి నమస్కరించి తడివస్త్రములతో జపము— మంత్రపునశ్చరణఁ బ్రారంభించినాను. ఆవెంటనె నాతండ్రిగారు దర నమిచ్చి మంత్రమార్షికమని, యేప్రశ్నలు జేయఁగూడదని అ మానము గూడదని చెప్పివెళ్లినారు. తండ్రియనఁగా బ్రహ్మ గీ. అ. 17 శ్లోకము.

5. గోతులోనుండు పురుషుఁడీశ్వరచైతన్యము—అంతర్యామి మట్టిపొర ప్రకృతి—మాయ, మూడు రంధ్రములనఁగా నోంకా రముయొక్క అ ఉమ్ అక్షరములులేక అవయవములు. "సోయమా త్మాధ్యక్షర మోంకారోఽధిమాత్రం పాదామాత్రామాత్రాః పాదా అకార ఉకారో మకార ఇతి" మాండూక్యోపనిషత్తు. 8 శ్లోకము.

6. "శివశ్శివః" పదములలో, 'శి' పార్వతి—చిత్తు—ప్ర తి, 'శివః'—సత్తు ఈశ్వరచైతన్యము—అంతరాత్మ—పురుషుఁ

గీ. 13 అ. 20 శ్లో. "శివశక్తిమయం మంత్రం మూలాధారోత్స ముద్ధితం" యోగశిఖోపనిషత్తు. "సర్వాననశిరోగ్రీవస్సర్వభూత గుహాశయః । సర్వవ్యాపీసభగవాన్ స్తస్మాత్సర్వగతశ్శివః।" శ్వేతా శ్వతరోపనిషత్తు.

7. ఈస్వప్న మీశ్వరధ్యాన ముఖ్యతనుఁ జెప్పుచున్నది. "శివ ఏవసదా ధ్యేయః । సర్వసంసారమోచకః ।" శరభోపనిషత్తు "శివో గురుశ్శివో దేవ । శ్శివో దేవశ్శివః ప్రభుః । శివోస్మ్యహఙ్ శివస్స ర్వం శివాదన్యన్నకించన, వరాహోపనిషత్తు.

8. చిత్తాకాశమనఁగా విజ్ఞానమయకోశములో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడు జ్ఞానేంద్రియములతోఁ బనిజేయు శుద్ధ సూక్ష్మమనస్సు.

—♦ 19వ స్వప్నము ♦—

ఈస్వప్న వాక్యములు చాలా చిక్కుగాను విశేష గూఢార్థము కలవిగాఁ గనుపించుచున్నవి. గీ. 15 అధ్యాయము ననుసరించి వైరాగ్యధ్యానసమాధులను దృష్టాంతపూర్వకముగ బోధించునని తలఁచెదను.

వెనుకటి స్వప్నములలో నుపదేశించిన మంత్రములు, యితర బోధల యభ్యాసమువలన సంసారసుఖములనుగూర్చి మనస్సులో వైరాగ్యవృత్తులు పుట్టి, కొంత విముఖతఁగలుగఁజేసినవి. పూర్ణవై రాగ్యము కలగనందున—

(స్వ) నేను మరికొందరితో నా నారింజతోటఁ జూచుటకు వెళ్లినాను.
(వి) తోటయనఁగ చిత్తేంద్రియము. ఇంద్రియసుఖములనుభవించవ లెనను కోర్కెలు తిరిగీ గలగినవి.

(స్వ) అది నేనదివరలోఁ జెంచిన స్థలముగాక, మరియొక స్థలముగాఁ గనుపించినది.

(వి) క్రొత్తగా బుట్టిన వైరాగ్యవృత్తులవలనఁ జిత్తముయొక్క పూర్వపు స్థితి కొంత మారినది.

(స్వ) దానిలో నేదో పనిచేయించుచుండఁగా నా పినతాత భార్య యగు అచ్చమ్మగారు వచ్చి యెవరో నా తాలూకు చెట్టును సగము నఱకినారని చెప్పినది.

(వి) చెట్టు—వృక్షమనఁగా నిర్గుణ బ్రహ్మనుండి వెడలిన అంశ—జీవుఁడు తిరిగీ బ్రహ్మము చేరువరకు జననమరణ పరంపర. ఈ వృక్షమునకు మాయాశబళిత బ్రహ్మ మొదటివేరు. మహదహంకారములు పెద్దకొమ్మలు. అంతఃకరణ చతుష్టయము. ఇంద్రియములు చిగుళ్లు పుష్పములుగా నుండి సుస్థితిలోఁ బెరుఁగుచున్నదై యున్నది. ఇది జ్ఞానమువలనఁగాని నశింపుజేయఁబడదు. సంసారసుఖాభివృద్ధికొఱకు నేను—మలినమనస్సు యోచించుచుండఁగా (పినతాత భార్యా అచ్చమ్మగారనఁగా, రాగాంశ) సంసార సుఖములయందు అనురాగము పూర్వముకంటె తగ్గినటుల మనస్సుకుఁ దోచెను.

(స్వ) నేను వెళ్లి చూచేవరకు 2-3 పెద్దకొమ్మలు గలిగి పూయుచున్న పెద్దచెట్టును యెవరో శత్రువులు భూమికి రమారమీ రెండడుగులెత్తున ఱంపముతోఁ జుట్టూ గోసినటులఁ గనుపించినది. చెటు క్రింద బడలేదు.

(వి) ఆలాగు ననురాగము తగ్గుటనుగూర్చి యోచించఁగా నూతన వైరాగ్యవృత్తులు, ఱంపమను నసంగశస్త్రముతోఁ గొంతవరకు

నఱికినటులనఁగఁ దగ్గించినటులఁ దోచినది. గాని సుఖకోర్కెలు పూర్తిగ తగ్గలేదు.

(స్వ) దాని స్థితిచూడఁగా మఱియొకచోట నరుకువఱకుఁ దిరిగి బాతించినయడలఁ బ్రతికి పనికివచ్చేటట్లు దోచినది. అందువలనఁ గొందరు నవుకర్లు లేక కూలీలను బిలచి చెట్టును దీసి గ్రామము వద్ద మరియొక స్థలమందుఁ బాతుమని జెప్పి, దోటలోనున్న నా యన్నగారితో నీ సంగతి జెప్పినాను.

(వి) ప్రస్తుతపు స్థితిలో నూతనవైరాగ్యవృత్తుల నణచి సంసార సుఖములఁ బూర్ణముగ ననుభవించుటకు ఇంద్రియములను సంశయ రహితముగ వానివాని విషయములయందుఁ బ్రవర్తింపఁజేసి („ చిత్తమేవహిసంసారరాగాదిక్లేశ దూషితం " యను మహోప నిషత్తు వాక్యానుసారముగ) ఇంద్రియసుఖములకుఁ జిత్తము కారణముగాన, నాయన్న (అంతఃకరణ చతుష్టయములో నొకటి) యగుఁ జిత్తముతో నీ సంగతి జెప్పినాను. మనస్సు యొక్క స్థానము హృదయము. చిత్తముయొక్క స్థానము హృదయము నాభిమధ్యమన్నవి. మనోబుద్ధి అహంకారములు చిత్తము నందుఁ బుట్టెడు సంకల్పములు. మనస్సు, బుద్ధి, అహంకారము లలోను చిత్తములోను బుట్టెడు అలలవంటి సంకల్పములు— ఊహలు వృత్తులని చెప్పఁబడును. గ్రామమనఁగా జ్ఞానేంద్రియ ములు, మనస్సు బుద్ధిచిత్తము అహంకారములుండు స్థానములు. గాన మనస్సు ఉన్నస్థలమందు నవశ్యముగఁ జిత్తముకూడ యుండును.

(స్వ) ఆయనఁగూడఁ జెట్టును నఱుకుట మంచిది కాదని, యంతే

కాక తోటసమీపములోనున్న సన్నపాటి నదికూడ తోటవైపున యొడ్డువిరిచినదని చెప్పినారు. నేనానదినిఁ జూడఁగాఁ గొంత తోటకు 10 గజముల దూరములోను, కొంత 3, 4 గజముల దూరములోను, గనుపించినది. కాని దానియొడ్డున నాతోటవైపున నితరులు పాతుకొన్న లేత పనసమొక్కలు మొదలయినవి బాగా గనుపించుచున్నందునఁ దోటకు నదివలనఁ ద్వరలో నష్టమున్నట్టు తోఁచలేదు.

(వి) సంసారసుఖములనే సదా కోరుచుండుఁ జిత్తమునకు నూతన వైరాగ్య వృత్తులు కూడదని, సుఖానుభవ కోర్కెలు తగ్గునని, యింతేగాక, ‟తోటసమీపములోనున్న సన్నపాటి నదికూడ తోటవైపున యొడ్డు విరిచినది.” యనఁగాఁ (నది—సంశయము) జిత్తమునకు సంశయము మునుపటికంటె నెక్కువైనదని చెప్పెను. నేనాలోచించగా నది—సంశయము శారీరకోపనిషత్తులోఁ జెప్పినటులఁ గంఠములో మనస్సుతోను, ముఖమందు బుద్ధితోను, నాభిసమీపమునఁ జిత్తముతోను, హృదయమందు అంతఃకరణతోను (స్వప్నములోఁ జెప్పినటులఁ జిత్తేంద్రియమునకు 3, 4, 10 గజముల దూరములనుబట్టి) కొంచెము యెక్కువ తక్కువగఁ జేరియున్నది. అయినను దానియొడ్డున—నదియొడ్డున యనఁగ సంశయ భయరహితముగ, నితరులు—(అహంకారము మనస్సు మొదలగునవి) పాతుకున్న—నాటియున్న సంసార ప్రవృత్తి కారణములగు లేతపనసమొక్కలు మొదలగునవి యనఁగా గీతల 16 అధ్యాయములోఁ జెప్పినటుల దైవాంశ సంభూతులగు వారికి దైవసంపద్గుణములు—భయరహితము, చిత్తశుద్ధి,

ఇంద్రియ నిగ్రహము మొదలైనవి, అసురాంశలో జన్మమెత్తిన నారికి, డంబము, గర్వము, అభిమానత్వము, అవివేకత్వము, మొదలగు అసురసంపద్గుణములు సృష్టిలో నున్నందున తోటకు—చిత్తేంద్రియమునకుఁ త్వరలో నష్టము చనలేదు యుఁ గానరావని తోచినది.

(స్వ) ఇంతలోఁ గూలీలు చెట్టును త్రవ్వి బడ్డీలమీదఁ (గ్రామమువద్ద) గ్రొత్తస్థలమునకు మోయుచున్నారు.

(వి) "చిత్తమేవహిసంసారః" యని వరాహోపనిషత్తు మూడవ అధ్యాయము, శాట్యాయనీయోపనిషత్తుల వాక్యానుసారముగఁ శరీరములోఁ జిత్తముయొక్క స్థానము అనగా నాభిసమీపము క్రొత్తస్థలమని జెప్పినటులఁ దలఁచెదను. అనఁగా సంసారసుఖాభివృద్ధికొరకు జ్ఞానేంద్రియములగు శబ్దస్పర్శరూపరసగంధములు, కర్మేంద్రియములు వాక్పాణిపాదపాయూపస్థలద్వారా బాహ్య పదార్థములను గ్రహించి, మనస్సునకు, మనస్సు తిరుగ వాని లక్షణములనుబట్టి సంకల్పములులేక అభిప్రాయములుగ నేర్ప అను శక్తిగలబుద్ధి—వివేకమునకుఁ దెలియఁబరచుటకుఁ గూలీలు—మనోరథములు చెట్టును—సంసారవృక్షమును స్వస్థానమునుంచి త్రివ్వి క్రొత్తస్థలమునకు బడ్డీలమీద మోయుచున్నారనఁగా పలువిధములగు సుఖాభిలాషలు - చిత్తములోఁ బుట్టుచున్నవి. బడ్డీలనఁగ బరువైన వస్తువులను మోయుట కుపయోగించు కర్రి మొదలగు సాధనములు. కాని మనస్సు చెప్పినటుల వృక్షమును స్వస్థానమునుండి త్రివ్వుటలోఁ గామక్రోధాదిసంచిత సంస్కారములను వేరులు గూడ (నూతనవైరాగ్యవృత్తు

లిదివరకు (మూనులో గలుగఁజేసిన నఱుకువలెనే) దెలియకుండ నఱకబడినవి.

(స్వ) నేను నాయన్నతోటలోనుంచి యింటికివెళ్లుచున్నాము. ఆయన తీసిన త్రోవను నేను పోవుచున్నాను. కాని రాజు లిండ్లవద్దకు రాగా నతఁడు రాజులిండ్లో దిగఁబడినాడు. నేను చెట్టును పాతిం చుటకుఁ దిన్నగా నింటికి వెళ్లుచుంటిని. మధ్యత్రోవలోఁ దరు వులమీద మోయఁబడుచున్న చెట్టును గలసినాను.

(వి) చిత్తము మనస్సు. (మొత్తముమీద నొకటియే యైనను) వాని లక్షణములలో వేరుగానున్నవి. మనస్సు సత్వరజస్తమోగుణము లనుబట్టి మూఁడు విధములుగ నున్నది. అది యిష్టప్రకారము పదార్థములతోఁ జేరియుండును. చేరకయు నుండును. రజోగుణ మునుఁజేరినపుడు కోర్కెలుగలిగి కర్మాసక్తి, విషయలోలత్వము, గర్వము అధికారము మొదలగు నసురసంపత్తుగుణములను సత్వ గుణముతోఁ జేరినపుడు శాంతి సుఖము జ్ఞానము మొదలగు దైవసంపద్గుణములను, తమోగుణముతోనున్నపుడు, అజాగ్రత, బద్ధకము, నిద్ర సోమరితనము, మొదలగువానిని గోరుచుండును. ఒకప్పుడు తక్కినగుణముల నణచి యొక గుణముతో నెక్కువగ నుండును గీతల 14 అ. 10వ శ్లోకము.

చిత్తముయొక్క లక్షణములు, 1. విజృంభణ, 2. మాంద్యము, 3. మేలుకొనుట 4. కూడియుండుట. విజృంభణయనఁగ అంతముండు నష్టము, దుఃఖము గలఁగఁజేయునట్టి అధికారము సుఖము మొద లగుఁ బనులలో సదా ప్రవర్తించుట, ఇట్టి భేదలక్షణములతోనున్నను చిత్తము మనస్సు స్వల్పకాలము కలసియుండిరి. కాని విశేషముగఁ

గలుగఁజేసెడు ఇంద్రియములను వదలి సదా నిర్మలస్థితిని బొందఁ గోరు చిత్తము రాజులోట్లోఁ బ్రవేశించెను. యనఁగా బుద్ధి—వివేకములోఁ జేరినది. నేను—మలినమనస్సు సంసారసుఖముల నింకా ననుభవించఁగోరి, రాగాదులు—మనోరథములు గలుగఁజేయుచున్న బాహ్యపదార్థవిజ్ఞానములను ఇంద్రియములద్వారా గ్రహించుచుంటిని.

(స్వ) తోటలోఁ జూచినదాని రూపు కొంత మారినది. కొమ్మలు కొంతవరకు నల్లబడి కొన్ని శిథిలమై రాలిపోయిన మోడువలెఁ గనుపించినది. దానిలోనుండి మనిషిమాటలవలె గొన్నిమాటలు వినబడినవి. అవి బాగా జ్ఞాపకములేవు. కాని, తాను చైతన్యమేయని, ఇప్పుడీయవస్థలోనున్నానని, త్వరగాఁ బొందించుమని, గొంతకాలము ప్రారబ్ధవశమున నిందులో నుండవలసియున్నదని చెప్పినట్లు జ్ఞాపకము.

(వి) ఇవి దైవాంశగుణములనఁగా నిర్మలమనస్సుయొక్క మంచివృత్తులు వాసనలకు, అసురాంశగుణములనఁగా మలినమనస్సుయొక్క చెడ్డవృత్తులకు వాసనలకు మనస్సులోఁగలుగు వివాదమైనటులఁ దలఁచెదను. ఎట్లనఁగా? సృష్టిక్రమములో జీవుఁడు, మానుషజన్మప్రారంభమునుంచి గడచిన ననంఖ్యమైన జన్మలలో, మలినమనస్సులోఁజేరి యనగా మలినమనస్సు తాదాత్మ్యమునుబొంది, వ్యవహరించుచున్నాడు. గాని గతజన్మలలో నొనర్చిన సుకర్మలవలన మనస్సు కొంత నిర్మలమై, ఈజన్మలో దైవాంశగుణములు శుద్ధమనస్సులో నుదయించుటఁజేత సంసారసుఖములయందుఁ గోర్కెలు కొంతవరకుఁ దగ్గినవి. ఇంతియగాక, బుద్ధిః "కర్మానుసారిణీ" యను లోకోక్తిప్రాపముగ (దూర

దృష్టి—ముందేమి జరుగునోయను నాలోచనలేక) వృక్షమును త్రివ్వి గ్రామసమీపమునం బాతునని చెప్పుట స్వస్థానమగుం జత్తేంద్రియమునుండి తప్పించుట సంభవించినది. విశేషించి "చిత్తంకారణ మర్థానాంతస్మిన్సతి జగత్త్రయం" మహోపనిషత్తు 3 అ.) సుఖములకుం గారణమైన చిత్తమిదివఱకే మనస్సును విడచి బుద్ధిలోం జేరినది. ఈ కారణములవలన సంసారవృక్షముయొక్క మహదహంకారణములనెడు కొమ్మలు, మలినమనస్సు ఇంద్రియములనెడు చిగుళ్లు కోర్కెలను పుష్పములు రాలిపోయి వృక్షము మోడువలెం గనుపించినది. "తతశ్శుష్కవృక్షవత్ మనః ప్రచారశూన్యం పరమాఽత్మనిలీనం భవతి." సర్వేంద్రియవర్గే పరినష్టే మనోనాశం భవతి. మండల బ్రాహ్మణోపనిషత్తు. శివ బ్రాహ్మణములోం జెప్పినటుల సర్వమాలిన్యరహితమై జీవుండు మాత్రము—పరిశుద్ధమనస్సు శేషించియుండెను. ఇట్టి స్థితిలో నుండినను తానద్వైతపరబ్రహ్మమేయని కించిత్కాలము "ప్రారబ్ధశేషమనుభవించవలయునుం గానం ద్వరగా బాతించుమని చెప్పెను. ("ఏకఏవాఽహమద్వితీయః కించిత్కాలమజ్ఞానవృత్త్యావిస్మృత్య జాగ్రద్వాసనాఽమ ఫలేన తైజసోస్మీతి తదుభయనివృత్త్యాప్రాజ్ఞ ఇదానీమస్మీత్యహమేక ఏవస్థానభేదాదవస్థాభేదస్యపరంతు నహిమదన్యదితి, జాతివివేకః శుద్ధాద్వైత బ్రహ్మాఽహామితి" నేనొకడనే అద్వితీయుండను అజ్ఞానముచేతం గొంతకాలము జాగ్రదవస్థలో విశ్వుండను నామము గలిగియుంటిని. పిమ్మట మరచిపోయిన జాగ్రదవస్థలోం గలిగిన కర్మల సంస్కారములు వాసనలు నాకోరికలేకనే స్వప్నా

వస్థలో గలుఁగునట్టి తైజసుఁడనైతిని. జాగ్రత స్వప్నములను రెండవస్థలు నశించి ఇపుడు ప్రాజ్ఞుండను నామముగలిఁగియుంటిని. గాన నేనొకఁడనే స్థానభేద, అవస్థాభేదములచేత బహుత్వముగ గనుపించుచుంటిఁగాని, నాకంటె వేరైనది యేదియునులేదు. నేను శుద్ధాద్వైతబ్రహ్మను. మండలబ్రాహ్మణోపనిషత్తు 2 బ్రాహ్మణం.

(స్వ) ఈమాటలువిని చెట్టుతోఁగూఁడ వచ్చుచుండఁగా

(వి) నిర్మలమనస్సు ధ్యానములోఁ బ్రవేశించెను.

(స్వ) నన్నుదమ్ములిద్దరు బ్రాహ్మణులు నాతోఁ గలసినారు. చెట్టులోనుంచి వినఁబడిన మాటలు వారితోఁ జెప్పఁగా వారిలోఁ బెద్దవాడు నన్నాక్షేపించుట, తమ్ముఁడు నన్నుఁ బట్టుకొని త్వరగా నడచిపోకుండఁ బీడించుట ప్రారంభించిరి. పట్టువిడపించుకొనుటకుఁ దమ్ముని 2, 3 సార్లు కఱచి యెట్టకేలకుఁ బటుదప్పించుకొని యింటికి వచ్చినాను.

(వి) నిర్మలమనస్సు ధ్యానము ప్రారంభించఁగానే, కామక్రోధవృత్తులు మనస్సులో నుదయించినవి. దూరదృష్టిలేక వికసించుచున్న వృక్షమును స్వస్థానమునుంచి తీయించినందుకనఁగా సంసారవాసనలను కోర్కెలనువిడచి ధ్యానములోఁ బ్రవేసించినందుకుఁ గాముఁడు ఆక్షేపణజేయుటయు, క్రోధుఁడు కోపమువలన త్రోవలో నడ్డమువచ్చుటయు ప్రారంభించిరి. ఇట్టి దుస్థితిలో నేను— శుద్ధమనస్సు నిండుశ్రద్ధ పటుదలతోఁ సర్వకోర్కెల నణచి కాముని, క్రోధమువలన నణఁగాఁ బలుమారు పండ్లు కొరుక్కొని

క్రోధుని అభ్యంతరములను నిశ్శేషముగఁ బారదోలి ధ్యానము చేయుచుంటిని. గీతల 6 అ. 26 శ్లోకము.

(స్వ) నేను వచ్చేవరకుఁ గూలీలు చెట్టును బాతిపెట్టక యింటివసారాలోఁ బడ్డిపైన వ్రేలాడఁదీసినారు.

(వి) పైనజెప్పిన కామక్రోధముల నణచి శుద్ధమనస్సు ధ్యానములోఁ ఏకాగ్రతనొందినది. ఇంద్రియములు వానివాని గోళములలోఁ బనిఁజేయుట మానినవి. అనఁగా బాహ్యవస్తువిజ్ఞానముల దెలియుట మానినవి. ఇల్లు యనఁగా శరీరము. వసారాయనఁగ హృదస్థానము—బడ్డి—అనాహతచక్రము. బడ్డిపైన వ్రేలాడదీసినారనఁగా నిర్మలమనస్సు (జీవుఁడు) హృదయమందు అనాహత చక్రముఁ జేరెనని తలఁచెదను.

(స్వ) నేను దానియొద్దకు రాఁగా నందులోనుంచి యొకపురుషుఁడు బయలుదేరివతలకు వచ్చి నన్నుఁ దనతో రమ్మని చెప్పినారు. నేనాయనతో వెళ్లుచుంటిని. ఆరోజు శివరాత్రి—ఉదయము 5-6 ఘడియల ప్రొద్దెక్కినది.

(వి) పైన జెప్పినటుల విశుద్ధినొందిన మనస్సు. "సోహం చిన్మాత్రమేవ" (త్రిశిఖబ్రాహ్మణోపనిషత్తు.) యను చింతనలో నితర వృత్తులు నశించి, "ఏషదేవో విశ్వకర్మా మహాత్మాసదాజనానామ్ హృదయే సన్నివిష్టః" శ్వేతాశ్వతరోపనిషత్తు. వాక్యసారముగ నిర్మలమనస్సు సమాధిలోఁ జేరినది. గీతల 15 అ. 11 శ్లో.

(స్వ) ఆరోజు శివరాత్రి ఉదయము 5-6 ఘడియల ప్రొద్దెక్కినది.

(వి) ఇది సమాధిప్రారంభకాలము. 5-6 ఘడియల ప్రొద్దెక్కుటాల

స్యముకాదు. "వ్రతస్నానోపవాసాదికాయక్లేశాంశ్చ వర్జయేత్." యోగతత్త్వోపనిషత్తు వాక్యము.

(స్వ) కొంతదూరము వెళ్లేవరకుఁ బైయిద్దరు సోదరులు మాతోఁ గలసి వచ్చుచున్నారు.

(వి) సమాధి కొంచెము జరిగినబిదప కామక్రోధవాసనలు తిరుగ మనస్సులోఁ బుట్టి మనస్సు చలించినది.

(స్వ) కొంతదూరమురాగా వృక్షనిర్గత పురుషుఁడు మమ్మును చాలా నేటవాలుగానున్న నొక యున్నతప్రదేశముమీద కెక్కి రమ్మని చెప్పినాడు. నేనెక్కలేకపోతే పైనిద్దరిలోఁ జ్యేష్ఠుఁడు నాచెయ్యి పట్టి సాహాయ్యమునర్చినాడు. ఆ మహాపురుషుఁడు నేను తక్కిన యిద్దరు 1-2 యున్నతప్రదేశములగుండా బాగా యున్నతముగాను, నలుచతురముగానున్న మరియొక స్థలము చేరినాము.

(వి) ధ్యాతృ, ధ్యాన, ధ్యేయములను త్రిపుటితోఁ జేయు సమాధివలన "నాస్తిబుద్ధిరయుక్తస్య । నచాయుక్తస్య । భావనా నచాభావ యతశ్శాంతి । రశాంతస్య కుతస్సుఖం।" యని గీ. 2 అ. 66వ శ్లోకములోఁ జెప్పినటులఁ బూర్ణ జిత్తశుద్ధిలేనివానికిఁ దనను ఆత్మగాఁ దలఁచుటయనఁగా నేను బ్రహ్మఅనియెడు నిశ్చయజ్ఞానము గలుగదుగాన, సమాధిలోఁ జంచలరహితస్థానము చేరుమని చెప్పెను. గాని కాముఁడు క్రోధుఁడు నాతోనుండఁగా "ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం నకర్తవ్యః కదాచన" యను వాక్యానుసారముగఁ గేవలఁ బరిశుద్ధమనస్సు భ్రమప్రమాదములేమియు లేకుండునట్టి యున్నతస్థానము చేరలేక కాముని సహాయము (మోక్షప్రాప్తి కలుగునదెడు

కోర్కె) తోఁ గొంచెము తక్కువ చిక్కుగల ధారణధ్యానమార్గములగుండ నున్నతస్థానమనఁగాఁ జిత్తైకాగ్రత నొందితిని. ముక్తి కోరికగూడ బంధమైనను తొలుత చిత్తైకాగ్రతకుఁ గారణమయ్యెను. గీ. 15 అ. 11వ శ్లో.

(స్వ) అక్కడందరము కూర్చున్నాము.

(వి) సమాధిలో స్థిరతగలిఁగి పూర్ణానందమనుభవించుచుంటిమి.

(స్వ) మహాపురుషుఁడక్కడ నిప్పుమీదఁ గుండపెంకులో నేదో వేసి. వండి గోధుమవర్ణముకంటెఁ దెల్లగానుండినఁ బదార్థము పట్టెడు ముద్దను నన్నుఁ బెంకులోనుంచి దీసుకొని మ్రింగుమని చెప్పెను. నేను సంశయించక వెంటనే నొక ముద్దనుఁ దీసుకొని దినుచుండఁగాఁ ద్వరగా మ్రింగుమని చెప్పెను. ఆప్రకారము మ్రింగినాను. వెంటనే నామనస్సుకు మార్పుగలిగి పెద్దలయందు వినయము, గురుభక్తి, నమ్రత హెచ్చినది. శరీరముగూడఁ గొంత రూపుమారినది.

(వి) ముద్దయనునది ప్రసాదము—« అద్వైతబుద్ధి » శ్రుతి « ఆహారశుద్ధౌసత్వశుద్ధిః । సత్వశుద్ధౌధ్రువాస్మృతిః » అనఁగా అహారశుద్ధి గలుగుటచేత చిత్తశుద్ధి గలుగును. చిత్తశుద్ధి కలుగుచుండఁగా వేందాంతవాక్యములను సద్గురువువలన వినుటచేతఁ గలిగిన బ్రహ్మజ్ఞానము ఎడతెగక స్మరణకు వచ్చును. అను ప్రమాణాను సారముగ ఇంద్రియశుద్ధిచేతఁ జిత్తశుద్ధిగలుగునని తెలియవలెను. ప్రసాదేసర్వ దుఃఖానాం, హాని రస్యోపజాయతే, ప్రసన్నచేతసోహ్యాసు । బుద్ధి పర్యవతిష్టతి । » యను గీతల2 అ. 65 శ్లోకము. చిత్తము నిర్మలమైనదయ్యేనేని సకలదుఃఖములు

నశించును. నిర్మలచిత్తముగల వానికి నేను బ్రహ్మనైతినను జ్ఞానము స్థిరముగా నుండును. మఱియును, అసంభావనా విపరీత భావనలనఁగాఁ దాను బ్రహ్మనైతినని తలఁపకపోవుట. దాను బ్రహ్మస్వరూపుఁడై యుండఁగా, దేహామే నేనని తలఁచుట యనునట్టి ప్రతిబంధకనులు పోవుటవలన బుద్ధిమిగుల శీఘ్రముగా బ్రహ్మాకారమును బొందియుండునని దెలియవలెను. నేనా ముద్దను దినిన వెంటనే నామనోవృత్తులు మారి గొప్ప, కొద్ది, ఘనుఁడు, నీచుఁడు మొదలగు వినక్షిత లించుకయులేక గీ. 15 అ. 15 శ్లోకము 6 అ. 32 శ్లోకముల సారముగ సర్వజీవుల యందు సమత్వబుద్ధిగలిగినది. శరీరమునకుఁ బూర్వముకంటె సుఖము కాంతి కలిగినది. ప్రసాదముద్దను నన్ను తీసుకొని మ్రింగుమని చెప్పుట ముముక్షువు తనంతనే జ్ఞానము పొందవలయునని బోధించును. ప్రసాదముయొక్క తెలుపురంగు సత్వగుణమును దెలుపుచున్నది. సమాధి ముగించుఁదరుణము సమీపించినందున ప్రసాదమును శీఘ్రముగఁ దినుమని పురుషుఁడు చెప్పెను.

(స్వ) అక్కడనుండి అందరము బయలుదేరి వెళ్లుచున్నాము. పైనిద్దరు సోదరులలో జ్యేష్ఠుఁడు మహాపురుషునకొక కుక్కనుఁ గనుబఱచి దానికి మారురూపము గలుగఁజేయుమని కోరఁగా, అట్లు చేయువానివలె నటించి తుదకుఁ జేయుక—

(వి) నిర్మలమనస్సు సమాధినుండి లేచినది. అప్పుడు కాముఁడు— రాగము సమాధివలన లభించిన అణిమాదిశక్తులఁ బరీక్షింపఁ గోరి నొక కుక్కనుఁ గనుబఱచి దానికి మారురూపము గలుగఁ

జేయుమని కోరెను. కాని పురుషుఁడు అట్లుచేయక "నదర్శత్స్వ సామర్థ్యం యస్యకస్యాపియోగిరాట్" యని యోగతత్వోప నిషత్తు వాక్యసారముగ నూరకుండెను. అందువలన ఎవరుగాని తన శారీరక, దైవిక శక్తులను వెల్లడిచేయఁగూడదు. ఎప్పుడైనను మలినమనస్సు కట్టికోరిక గలిగినను లేక "శిష్యాశ్చస్వస్వ కార్యేషు ప్రార్థయంతి నసంశయః," యను వాక్యసారముగ నితరులు కోరినపుడు, పరిశుద్ధమనస్సు దానిని వెంటనే నణచి వేయవలెను.

(స్వ) నన్ను మాత్రము తనతోఁ దీసుకొని వెళ్లుచూ, నీవు యోగ్యుడవుగాన నీకు దర్శనమిచ్చి ప్రసాదమిచ్చినానని, తక్కినవారు కోరినది చేయనని యనిరి.

(వి) మనుజుఁడు కామక్రోధములను విడచి సదా సత్యప్రవర్తన యోగ్యత గలిగియుండవలెనని, అట్లుండిన అంతర్యామి దర్శనమగునని సమాధి విరమించుఁగాలమున బోధించిరి.

(స్వ) ఇద్దరము గలసి యొక వీధిగుండా వెళ్లుచున్నాము. ఉదయ సమముగా నున్నది. నేను తనతోఁ గలసి ఎంతకాలమైనదని యడిగినారు. ఆరోజు శివరాత్రియని ఎంతో కాలము గాలేదని చెప్పినాను. రెండు మాసములైనదని తిరిగీ దర్శనమిచ్చెదనని చెప్పినారు. నన్ను రక్షించవలసినదని నేనుకూడా వస్తానని చాలా వినయముగఁ బ్రార్థించినాను.

(వి) ఇద్దరముకలసి యొక వీధిగుండా వెళ్లుచున్నాము. యనఁగా సమాధినుంచి మనస్సు ధ్యానములోకి దిగినది. వీధియనఁగ శబ్ద స్పర్శరూప రసగంధములు. మలినమనస్సు, బుద్ధి, చిత్తము,

అహంకారములుండు స్థానములు వీనిగుండాఁ జిత్తము తిరిగి సంచరించుట ప్రారంభించినది. అనఁగాఁ బ్రపంచ సంబంధవాసనలు మనస్సులోఁ బుట్టుచున్నవి. శివరాత్రియనఁగా సమాధిలోనున్న కాలము. లోకవ్యవహారములో సూర్యచంద్రుల గతిని బట్టి దినము, కాలము, లెక్కించఁబడుచున్నది. యోగాభ్యాసములో ప్రాణవాయువులు ఇడాపింగళనాడులయందుఁ నొకమారు దిరిగినకాలము దినముగా నెంచఁబడును. గాన఼ఁ బురుషుఁడు తాను జీవునితోఁ గలసియున్నఁ గాలము రెండు మాసములైనదని చెప్పెను. తిరిగి దర్శనమిచ్చెదనని చెప్పుటవలన ధ్యానసమాధులనుఁ దిరిగి చేయుచుండుమని సలహానిచ్చెను. నేనుకూడ వచ్చెదనని చాలా వినయముగఁ బ్రార్థించుట విఘ్నములేకుండ సమాధికొంతకాలము చేయఁగోరెను.

(స్వ) కొంతదూరము తీసుకొనివచ్చి వీధిలో నొక బండిమీఁదఁ గూర్చుని నన్నేదో తెమ్మని కొన్ని బారలదూరము పంపినారు. నేను తిరుగ వచ్చేవఱకాయన యదృశ్యమై కనుపించలేదు. నేనాయనకొఱకు వ్యర్థముగాఁ గొంతసేపు వెదకి, తిరిగి దర్శనమిస్తానని చెప్పినమాట జ్ఞాపకముచేసుకొని యింటికి వచ్చినాను.

(వి) విఘ్నములేకుండ నింకా ధ్యానముచేయ తలంపుయున్నను, ("చంచలత్వం మనోధర్మోవహ్నే ర్ధర్మో యథోష్ణతా." మహోపనిషత్తు.) చిత్తము చలించినందున పురుషుఁడదృశ్యమయ్యెను. తిరిగి దర్శనమిస్తానని చెప్పినమాట జ్ఞాపకమురాగా నింటికి వచ్చినాననుట. (శ్లో. ధ్యాయేతత్వం స్థిరేజవే అస్థిరేన

కదాచన) మనస్సు నిలకడఁగానున్నపుడు తత్త్వముధ్యానింపవలయును. చంచలముగానున్నపుడు ధ్యానింపఁగూడదని తలఁచెదను. చలించిన చిత్తము వెంటనె స్థిరతనొందదు. ఇది యెల్లరకును స్వానుభవము.

(స్వ) అపుడింటిలో వడ్డనసమయముగ నున్నది. విస్తళ్లు వేయబడినవి.

(వి) ధ్యానము మానినవెంటనే సంసారసుఖవాసనలు పూర్తిగ మనస్సులోఁ బుట్టినవి.

(స్వ) అది శివరాత్రి వెళ్లిన మఱుచటిదినమని నా నమ్మకము. నాయన్నగారిని నేను వెళ్లి యంతకాలమైనదని యడిగితే నాలుగు మాసములైనదని చెప్పినారు.

(వి) మనస్సు నిండుధ్యానములో నుండుటఁజేతఁ గాలము సరిగ తెలియలేదు. పైనచెప్పినటులఁ బురుషుఁడు రెండు మాసములని నాయన్న నాలుగు మాసములని చెప్పుట వేరుకాలములయందు లెక్కించినందువలన తేడా వచ్చినది. ఇంతేగాక "దేహవాసనయాముక్తో దేహధర్మైర్నలిప్యతే। కల్పంక్షణీ కరోత్యంతః క్షణం నయతికల్పతాం" యని వరాహోపనిషత్తు వాక్యసారమున మనస్సు పూర్ణసమాధిలోనున్నపుడు కాలపరిమితి దెలియదు.

ప్రారబ్ధవశమున జీవునకు సంప్రాప్తమైన మలినవాసనలు వృత్తులకు, నిజన్మలోఁ గలిగిన శుద్ధవాసనలు వృత్తులకుఁ గలుగు యుద్ధ——వివాద మీ స్వప్నములో వివరింపఁబడినది. "వాసనాతంతుబద్ధోయం లోకోవిపరివర్తతే। సాఽత్యంతి బహుజ్ఞోఽపి కులజ్ఞోఽపి,

మహానపి, తృష్ణయాబధ్యతే జంతుస్సింహా శృంఖలయాయథా" మహోపనిషత్తు వాక్యసారముగ, బుద్ధిమంతులను విద్వాంసులను, గొప్పకులమువారిని, మహాత్ములనుఁ గూడ సింహమునకు సంకెళ్ల వలె బంధనఁజేయునట్టి వాసనా సమూహములకు నెంతమాత్రము లోబడక "వివేకం పరమాశ్రిత్య బుధ్యాసత్య మవేక్ష్యచ ఇంద్రియారీనలంఘిత్వా తీర్ణోభవ భవార్ణవాత్" యను మహోపనిషత్తు వాక్యబోధప్రకారము, బుద్ధిమంతులు వివేకము నాశ్రయించి, ఇంద్రియములయొక్క అగ్ని—తీవ్రవేడిసణచి, జన్మపరంపరయను సంసార సముద్రమును నీజన్మమందే దాటవలయునని, "సర్వేంద్రియ వర్గేపరినష్టే మనోనాశంభవతి. తదేవాఽమనస్కం" యను మండల బ్రాహ్మణోపనిషత్తు లేవ బ్రాహ్మణబోధ ననుసరించి మలినమనస్సు, అహంకారము, డంబము మొదలగు (గీతల 16వ అధ్యాయములో వివరించిన అసురసంపత్తుగుణములను పూర్తిగా విడచి, నిరంతర ఆత్మధ్యానము, దైవసంపద్గుణములు గలిగి యుత్తమపురుషునిఁ బొందవలయునని, (శ్లో. యదిదం మనసావా చాచక్షుర్భ్యాం శ్రవణాదిభిః నశ్వరం గృహ్యమాణం చవిద్ధి మాయా మనోమయమ్" యనంగా) నీకనబడుచున్న బ్రపంచమంతయు లేనిది.—మిథ్యయని సకల పదార్థములయందు నిండు వైరాగ్యమనంగ నాకు దేనితోను ప్రయోజనములేదనునట్టి తలంపు గలిగి ఆత్మవేత్త సంచరించవలయునని యీస్వప్నము బోధించుచున్నది. ఈసందర్భమున భగవద్గీతల యొక్క 3 అ. 41 శ్లో॥ 6 అ. 27-28, 15 అ. 17-19, 18 అ. 52-57 శ్లోకములను చదువుము.

"ధ్యానమనగా" సర్వశరీరేషు చైతన్యైకతానతా"—సర్వ

భూతములయందు సమదర్శియై, తనను—అంతరాత్మను సర్వభూతములయందును, సర్వభూతములు తనయందు—అంతరాత్మయందు జూచుచు, బూర్ణాద్వైత బుద్ధితో సదా యాత్మధ్యానము—స్వస్వరూపధ్యానము జేయుచు „ ఆత్మవత్సర్వ భూతాని " యను వాక్యానుసారముగ సమతబుద్ధి నొందుట. గీతల 6 అ. 29 మొదలు 32 శ్లోకములు.

ధారణయన, „ విషయవ్యావర్తన పూర్వకం చైతన్యే చైతన్యస్థాపనం "— మనస్సును ప్రపంచ విషయములనుండి వాసనల నుండి మరలించి, జీవాత్మను బరమాత్మలో నైక్యముచేయుట.

సమాధి యనగా, „ జీవాత్మ పరమాత్మైక్యావస్థా । త్రిపుటి రహితా, పరమానంద స్వరూపా. శుద్ధచైతన్యాత్మిక " శాండిల్యోపనిషత్తు. „ ధ్యానవిస్మృతిః సమాధిః " ధ్యానములో దనను దాను విస్మృతినొందుట. మండల బ్రాహ్మణోపనిషత్తు.

మూడవ స్వప్నములోఁ జెప్పబడిన స్వస్వరూప దర్శనము, గురు కటాక్షమువలన నీస్వప్నములో బోధించిరని తలచెదను.

ఈస్వప్నము 1905 క్రోధి నామ సంవత్సరములో గలిగినది. అదివరకనగా 1901 సంవత్సరములో నేనీగ్రామము—మోడేకుర్రులో బాతించిన బత్తాయి నారింజతోట స్వప్నకాలమందు బహు మంచి స్థితిలోనున్నది. సర్వకాల సర్వావస్థలయందు దానియభివృద్ధి గోరకాలోచించుచు, బనిచేయించుచు, మంత్రోపాసనయందు బూర్ణ శ్రద్ధలేని సమయమున, పరమదయాళుడైన గురువు, ధ్యానసమాధి మార్గముల దృష్టాంత పూర్వకముగా నుపదేశించెను. నారింజతోట

స్వల్పకాలములో గ్రిమముగ క్షీణించి తుదకు నశించినది. దాని యందు నిండువిరక్తియు గలిగినది.

## —♦ 20వ స్వ ప్న ము. ♦—

16-17-18-19 స్వప్నములలో ధారణ ధ్యాన సమాధి మార్గముల నుపదేశించి, మహావాక్యోపదేశమునకు నామనస్సు తగి యుండుటకుగాను గురువీస్వప్నములో, నుపదేశ సహస్రియను గ్రంథమును చదువుమని యాజ్ఞాపించెను. నేనదివరకా పుస్తకము పేరెరుగను. చాలాకాలమువరకు నాకాపుస్తకము లభించలేదు. తుదకు సంస్కృత ప్రతి దొరికినది. పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేతఁ దెనుఁగు తర్జుమాచేయించి చదివినాను. „తత్త్వమసి" మహావాక్యార్థమును సవిస్తరముగా దీనిలో వివరింపబడినది.

## —♦ 21వ స్వ ప్న ము. ♦—

నిరంతర ధ్యానాభ్యాసముచేత జీవాత్మ పరమాత్మల నైక్య దృష్టితోఁ జూచుటనఁగాఁ బ్రత్యగాత్మ పరమాత్మ లొక్కటేయని భిన్నముకాదని యనుభవ పూర్వకముగాఁ దెలియుటకు గురువీ స్వప్నములో „అహం బ్రహ్మాస్మి" యను మహావాక్య ముపదేశించిరి.

వేదాంతశాస్త్ర పరిజ్ఞానము లేనందున నేనీ „అహం బ్రహ్మాస్మి" మంత్రార్థమును విపులముగ వ్రాయఁజాలను. „అహం—" నేనుయను శబ్దము ప్రకృతి జన్యమైన యవిద్యచే నావరించబడి జీవభావము నొందినను శరీరమునంటక బుద్ధికి సాక్షిగానుండి ప్రకాశించు

బ్రత్యగాత్మ—కూటస్థ చైతన్యమని, శరీరము, యింద్రియములు, మనోబుద్ధి చిత్తాహంకారములు, పంచకోశములు, పంచప్రాణములు కాదని సూక్ష్మ శరీరముగూడఁగాదని నాయభిప్రాయము. శ్లో॥ పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణి । బుద్ధిస్సాక్షి తయా స్థిత్వా స్ఫురన్నహామితీర్యతే॥ గీతల 15 అ. 7వ శ్లోకముచూడుము.

"బ్రహ్మ" యనఁగా ఏకము, అద్వితీయము, సర్వవ్యాపి, ప్రకృతికి పరుడు. ఆద్యంతములు, యేవిధమైన వికారములు, దేశకాలములు, వృద్ధిక్షయములు, సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేని నిర్గుణబ్రహ్మము. నిత్యుఁడు, "సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ" శృతి "స్వతః పూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః" శ్లోకము.

"అసి" పదము. ధారణ ధ్యానములవలన యవిద్యారహితమై విశుద్ధినొందిన జీవాత్మ యనఁగాఁ బ్రత్యగాత్మ—అంశను పరమాత్మలో ననఁగా నుత్తమ పురుషుని జహద జహల్లక్షణచే సమాధిలో నేకము చేయును. ఇది పురుషోత్తమ ప్రాప్తియని తెలియనగును. "అస్మిత్త్యైక్య పరామర్శాత్తేన బ్రహ్మ భవామ్యహం" శ్లోకము.

ఈమహావాక్యము యజుర్వేద జ్ఞాన కాండమందు తైత్తిరీయోపనిషత్తులో శిష్యుని వాక్యము.

"జీవఏవ సదాబ్రహ్మ సచ్చిదానంద మస్మ్యహం । సర్వం బ్రహ్మ మయం ప్రోక్తం సర్వం బ్రహ్మ మయం జగత్. "స్వయం బ్రహ్మ ననందేహ స్స్వస్మాదన్యన్న కించన । చైతన్యమాత్రమోంకారం బ్రహ్మైవ సకలన్ స్వయం । అహమేవ జగత్సర్వ మహ

మేవ పరం పదం । అహమేవ గుణాతీత అహమేవ పరాత్పరః । అహమేవ పరంబ్రహ్మ అహమేవ గురోర్గురుః । అహమేవాఖిలాధార అహమేవ సుఖాత్సుఖం । ఆత్మనో ऽ జ్జగన్నాస్తి సర్వమాత్మ మయం జగత్ । ఆత్మనోన్య న్న... ...ప్యపి ఆత్మనోన్యం తృణంనహి । ఆత్మనోన్యత్తుషన్నాస్తి సర్వమాత్మ మయం జగత్ । బ్రహ్మమాత్ర మిదం సర్వం బ్రహ్మమాత్రి మసన్నహి" ఇత్యాది- తేజోబిందూపనిషత్తు 6 అధ్యాయము.

" జ్ఞాత్వా బ్రహ్మహ మస్మీతి బ్రహ్మైవ భవతిస్వయం " కఠోపనిషత్తు.

పైవాక్యములనుబట్టి విశ్వములోఁ గనుపించెడు ప్రతిపదార్థము బ్రహ్మమెయనియు, రజ్జుసర్ప భ్రాంతిలో రజ్జువునందుఁ గనుపించు సర్పమువలె నజ్ఞానదశలో ...ంగా లోకవ్యవహారదశలో బ్రహ్మయందీ ప్రపంచకము గనుపిం... ...యు జ్ఞానదశలో నుండునది కాదనియుఁ దెలియవలెను. "సత్యవద్భాతి తత్సర్వమ్ రజ్జుసర్ప వదాస్థితం " రుద్రహృదయోపనిషత్తు.

అహంబ్రహ్మలు—ప్రత్యగాత్మ పరమాత్మ లైక్యమనఁగానే తత్వసిద్ధి కలుగదని తలఁచవలదు. ఇంద్రియములను వాని వాని విషయములనుండి మరలించి, మనోబుద్ధి చిత్తాహంకారములను స్వాధీనపరచుకొని, దేవునియందు, గురువునందు నిజమైన భక్తి వైరాగ్యములతో ధ్యానమునర్చినఁ దప్పక బ్రహ్మాద్వైతభావన— ప్రత్యగాత్మ పరమాత్మ లైక్యజ్ఞానము నిస్సందేహముగ సిద్ధించును. గీతల 15 అ. 17-18-19 శ్లోకములు.

" ద్వైతాద్వైతసముద్భూతై జగన్నిర్మాణలీలయా । పర మాత్మ మయీశక్తిరద్వైతైవ విజృంభతే. " మహోపనిషత్తు 5 అ.

" క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధిసర్వక్షేత్రేషుభారత " గీతల 13 అ. 3 శ్లో. దృష్టాంతము ఘటాకాశ మహాకాశములు.

" మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసి " యను వాక్యసారముగ మోక్షమునకు భక్తి తల్లివంటిదిగాన నిజమైన నిండు భక్తి సంపాదించుకొనవలెను. భక్తియనఁగా జీవాత్మ—ప్రత్యగాత్మను పరమాత్మ—ఉత్తమపురుషునితోఁ జేర్చుట. ప్రత్యగాత్మను పరమాత్మలోఁ జేర్చుటయనఁగా సర్వభూతములయందుఁ దనను తనయందు సర్వభూతములను స్వానుభవముగఁ జూచుట. ఇదియె పరమభక్తి. సర్వభూతములయందుఁ బరమప్రేమ. ఎందును నేను తప్ప మరియొకటి యెప్పుడుగాని లేదని నిశ్చయజ్ఞానము.

హృదయం నిర్మలంకృత్వా చింతయిత్వాఽప్యనామయం । అహంమేవ పరంసర్వమితి పశ్యేత్పరం సుఖమ్. " యథాజలేజలం క్షిప్తం క్షీరంక్షీరేఘృతుఘృతే । అవిశేషోభవేత్తద్వజ్జీవాఽత్మ పర మాత్మనోః । దేహేజ్ఞానేనదీపితే బుద్ధిరఖండా కారరూప యదాభ వతి । తదావిద్వాన్బ్రహ్మజ్ఞానాగ్ని నాకర్మబంధం నిర్దహేత్. " పైంగలోపనిషత్తు.

అహం బ్రహ్మేతినియతం మోక్షహేతుర్మహాత్మనాం । ద్వేపదేబన్ధమోక్షాయ నిర్మమేతిమమేతిచ । మమేతిబధ్యతే జంతు ర్నిర్మమేతివిముచ్యతే. " అహంసత్యం పరంబ్రహ్మముక్తః కించిన్న

విద్యతే । అస్తి బ్రహ్మేతిచేద్వేదపరోక్షజ్ఞానమేవతత్ । అహం బ్రహ్మేతిచేద్వేద సాక్షాత్కార స్సఉచ్యతే." వరాహోపనిషత్తు. "అపరోక్షజ్ఞానవాన్ జీవన్ముక్తః." యని చెప్పఁబడినది. "స్వాత్మ మంత్రం సదాపశ్యేత్స్వాత్మజ్ఞానం సదాభ్యసేత్ । స్వాత్మజ్ఞానం సుఖం భుంక్తేరిత్యేవం మంత్రముత్తమం." శ్లోకము. అహంసర్వ మిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః. మహోపనిషత్తు 5 అ.

"అహంబ్రహ్మాస్మి మంత్రోయం జన్మపాపం వినాశయేత్ । అహంబ్రహ్మాస్మి మంత్రోయం ద్వైతదుఃఖం వినాశయేత్ । అహం బ్రహ్మాస్మి మంత్రోయం కోటిదోషం వినాశయేత్ । అహంబ్రహ్మాస్మి మంత్రోయం ద్వైతం సర్వం వినాశయేత్ ॥ సర్వవ్యాపార ముత్సృజ్య అహంబ్రహ్మేతిభావయ । అహంబ్రహ్మేతి నిశ్చిత్యత్వ హంభావం పరిత్యజ । సర్వమంత్రాన్ పరిత్యజ్య ఏతన్మంత్రం సమభ్య సేత్ । సద్యోమోక్షమవాప్నోతి నాస్తి సందేహ మణ్వపి । సత్యం సత్యం పునస్సత్యం బ్రహ్మణోన్యం నకించన ॥ తేజోబిందూపనిషత్తు.

దైవజ్ఞానము స్వానుభవముగాని, మతగ్రంథములు శాస్త్రములు చదువుట, బుద్ధికుశలతతో వాదములు చేయుటఁగాదు. ఈ కనుపించు విశ్వమంతయు బ్రహ్మయొక్క ప్రతీకమనఁగా విభూతి యని, దీనికి లోపలను వెలుపలను వాఙ్మనస్సులకుఁ గోచరముగాని బ్రహ్మము (గీతల. 9 అ. 4 శ్లో. 14 అ. 3 శ్లో.) వ్యాపించి, సమస్త చరాచరభూతములయందు నిండియున్నదని, అదియె తానని సంశయరహితముగఁ దెలియుట స్వానుభవము. ఇట్టి బ్రహ్మము స్వానుభవ పూర్వకముగఁ దెలుసుకొనఁగోరి విందుశ్రద్ధ, పట్టుద

లతోఁ బ్రయత్నముచేయు మనుజులకు మాత్రమె గోచరమగును. ఇతరులకుగాదు. గోచరమనఁగ స్వానుభవము. అనఁగాఁ దన మతము బోధించునట్టి బ్రహ్మము తానేయని తనయందున్న బ్రహ్మమే యితరులయందుండుటవలన నవియుఁ దానేయని నిశ్చయజ్ఞానముఁ గలిఁగి, గీతల 6 అ. 29 శ్లో కానుసారముగ, సర్వభూతములయందుఁ దనను, తనయందు సర్వభూతములనుఁ జూచుట స్వానుభవము. ఇదియె సమత్వబుద్ధి. ఇది లభించుటకు ‚ అహం బ్రహ్మాస్మి' యను మహావాక్యమును గురువువలన శ్రవణమునొంది, మనన నిదిధ్యాసలచే దాని తాత్పర్యమును గ్రహించి, ధ్యానమొనర్పవలెను. చేతులు పనిచేయుచుండఁగాఁ మనస్సులో నహంబ్రహ్మాస్మి, అహం బ్రహ్మాస్మియని స్మరణఁ జేయుచుండవలెను. గొప్ప, కొద్ది, సుఖము, దుఃఖము మొదలగు సర్వద్వంద్వములను నశింపుచేసి (నిర్ద్వంద్వో నిత్య సత్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ గీతల 2 అ. 45 శ్లో) సర్వ సృష్టి, దానిలోనున్న సర్వపదార్థములు తానేయని అన్యము కాదని, ‚‚ పిండస్థోపి ప్రత్యగాత్మా సర్వవ్యాపీభవతి." దేహేజ్ఞానేన దీపితే, బుద్ధిరఖండాకార రూపాయథాభవతి" యను నుపనిషద్వాక్యముల సారముగ, ఆకాశమువలె తాను సర్వవ్యాపకమైన "ఆత్మ" యని ప్రకృతమందు మనస్సును ఆవరించియున్న గొప్ప కొది సుఖము దుఃఖము మొదలగు ద్వంద్వములు ఆకాశమందు వ్యాపించు మేఘములవలె స్వల్పకాలములోఁ బోవునని, తనయందున్న బ్రహ్మమె బాహ్యమందు, బాహ్యమందున్న బ్రహ్మమే తనయందుఁ జూచుచుననఁగా సర్వము తానేకాని వేరుకాదని సంశయరహితముగ దృఢభావనగలిగి యుండవలయును. లోకవ్యవహార

కాలమందు, భోజన నిద్రాకాలములయందుఁ గూడఁ బ్రహ్మభావన గలిగి, (శ్రుతి) "మాహం బ్రహ్మ నిరాకుర్యాం మామాబ్రహ్మ నిరాకరోత్." "యనునట్లు ముముక్షువు మర్కట కిశోరన్యాయముగఁ దల్లియగు బ్రహ్మను గట్టిగా—దృఢభావనచే ధ్యానించుచుండవలయును. బ్రహ్మయు మార్జాల కిశోరన్యాయముగ ముముక్షువును బట్టుకొని గీతల 10 అ. 10-11 శ్లోకములలోఁ జెప్పినటులఁ బ్రకృతి సంబంధమగు నవివేకమును నశింపఁజేసి, తననుఁ బొందుటకు జ్ఞానయోగమొసంగును. మనుజుఁడు తన క్షేమమును గూర్చి పరమేశ్వరునికంటె యెక్కువగఁ బనిచేయలేఁడు. ఇందుకు నేను బాల్యమున నూతిలోఁ బడినపుడు దేవుఁడొనర్చిన రక్షణ ప్రబల దృష్టాంతము.

పై వాక్యములయొక్క ముఖ్యతాత్పర్యమేమనఁగా—'అహం బ్రహ్మాస్మి' యను మంత్రములో 'అహం' అనునది నిర్గుణబ్రహ్మముయొక్క 'అంశ' మైనను ప్రకృతిబద్ధుఁడై (గీతల 7 అ. 27 శ్లో.) జన్మకాలమందే బుట్టిన అవివేకముచేత, యిచ్ఛాద్వేషములనెడు (గీ. 13 అ. 22 శ్లో) ద్వంద్వరూపములగు సుఖదుఃఖముల ననుభవించుచు, జీవసంజ్ఞనుపొంది, సదా తనతోఁ గలసియున్న సాక్షిచైతన్యమే తానను సంగతి మరచి సంచరించుచుండును. కాని (గీ. 7 అ. 28 శ్లో) సుకృతకర్మ పరిపాకమువలనఁ బాపవిముక్తుఁడై, సద్గురు కటాక్షమువలనఁ దన నిజస్థితిని తెలుసుకొనినపుడు, చలించని నియమముచేతఁ దిరుగఁ బరమేశ్వరప్రాప్తినొందును. ఇదియేఁ 'అస్మి' పదముయొక్క తాత్పర్యమని తలఁచెదను.

మరియు జీవాత్మ పరమాత్మ యగుటను గూర్చి శాస్త్రములోఁ జెప్పిన భ్రమరకీట దృష్టాంతముగాక, సాధారణముగ సర్వజనులు

తరుచు చూచునట్టి యీక్రింద వివరించిన దృష్టాంతమువలన సంశయ రహితముగఁ దెలియును. ఏమనగా—

ఉదక స్పర్శచే మెత్తబడి దానిలోఁ గలసిపోవు స్వభావము గల మన్ను పలువిధములగు కుండలు, బొమ్మలు, యిటుకలు, పెంకులుగాఁ జేయబడి, కొలిమిలేక ఆములోఁ గాల్చబడినపుడు, వాని మట్టిరంగు మారి మెరుపురంగనగఁ నగ్నిరంగును బొందుటయేగాక, నీటిలోఁ గరిగే స్వభావము గూడఁబోయి, గట్టిపడుచున్నది. అట్టులనే జీవులు ధ్యానమను కొలిమిలో బ్రహ్మజ్ఞానమను అగ్నిలో లెస్సగ కాల్చబడిన, బ్రహ్మరూపమును పొందును. మరియు వానినిఁ గాల్చునపుడు కొలిమిలో బొత్తులుపడి ఆవిరి పైకిపోయిన మట్టిపాత్రలు సరిగా కాలక చెడును. గాన నా బొత్తలను గడ్డి కొంటి, పెడ్డలు మొదలగు వానితో వెంటనే కప్పబడును. అటులనే, ధ్యానములో మనస్సు చలించునపుడు (గీ. 6 అ. 26 శ్లో.) దానిని వెంటనే ఆయావిషయములనుండి మరలించి, ఆత్మయందుండునట్లు స్వాధీనము చేసుకొనవలయును. (గీ. 6 అ. 27-28 శ్లో.) ఇట్లు శాంతి పొందిన మనస్సుయొక్క రజోగుణము క్షీణించి, చంచల రహితమై, బ్రహ్మాకారమై, బ్రహ్మానందమును పొందును.

కాని యిచట నొక అంశము ఆలోచించవలసియున్నది.

భ్రమరకీట దృష్టాంతములో కీటము మొదటిరూపము మారి భ్రమరమగుచున్నది. ఇప్పటి దృష్టాంతములో మట్టిపాత్రలరంగు స్వభావము మారుతున్నదిగాని పరిమాణము మారుటలేదు. అందువలన ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతవాదములనగ సాంప్రదాయముల విచారణకొంత యవసరమని తలచెదను.

1. ద్వైతులు, బ్రహ్మవలెనే జీవులు అనాదులని, ప్రభుభృత్యన్యాయమున బ్రహ్మను పూజించవలయునని, అందువలన మట్టిపాత్రలరంగు స్వభావములవలె, శరీరశుద్ధి అంతఃకరణశుద్ధికలిగి, మానుషజన్మలకంటే నుత్తమజన్మలు లోకములు కలుగునని చెప్పెదరు.

2. విశిష్టాద్వైతులు జీవులను అణువులు, అనాదులు, పరమేశ్వరునియొక్క అంశలు యని చెప్పుదురు. మరిన్ని ఆజీవులు, జగదంకుర యోనియగు లక్ష్మీ శ్రీమహావిష్ణువు అనిపాయినిగా నాశ్రయించి యుండుటచేత, తత్స్వరూపమును బొందలేరని, మరియు భక్తి ప్రపత్తులతో ధ్యానసమాధి మార్గములవలనను, బ్రహ్మజ్ఞానాతిశయములవలనను సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యపదవులఁ బొందుదురని చెప్పెదరు.

3. అద్వైతులు, బ్రహ్మము మాత్రమే సత్యమని, జగద్యోనియగు ప్రకృతి, సత్తు, అసత్తు, సదసత్తుకాదని, అనిర్వచనీయము, మహాద్భుతమైన రూపమని, యందువలన మోక్షకారి కాదని చెప్పెదరు. శ్రీశంకరాచార్యస్వామి (శ్లో) "సన్నాప్యసన్నాప్యుభయాత్మికానో, భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికానో, సాంగాప్యనంగాప్యుభయాత్మికానో, మహాద్భుతాఽనిర్వచనీయరూపా" యని ఆత్మబోధగ్రంథములోఁ జెప్పియున్నారు. గాన సత్యస్థితిలేని ప్రకృతి—మాయావలన శాశ్వతమైన సచ్చిదానంద ప్రాప్తి లభించదు. విశేషించి "అవ్యక్తనామ్నీ పరమేశశక్తిరనాద్యవిద్యాప్రకృతిర్గుణాత్మయా, కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగత్సర్వ మిదం ప్రసూయతే" యను శ్రీశంకరుల

వారి ఆత్మబోధవాక్యమును బట్టిన్ని, నిరాలంబోపనిషత్తులో “ అనాదిరంతవతీత్యాది మాయాశబ్ద నిర్వచనమును బట్టిన్ని పరమేశ్వర శక్తి అవిద్యారూపమనగ, అజ్ఞానరూపమైయున్నది.”

సృష్టి క్రమములో ఈ ప్రకృతి వికృతినొంద పరమేశ్వరుఁడు దీనియొక్క సత్వగుణమందుఁ బ్రతిబింబించి, ఈశ్వరనామము బడసెను. మాయా ఆవరణశక్తియయ్యెను. ఈ ఆవరణ దేశకాలములను తెలుపును. దేశకాలములు పారమార్థదశలో లేవని 23వ స్వప్నవివరణలో సవిస్తరముగఁ జెప్పఁబడినది. గాన జీవఈశ్వరులమధ్య లక్ష్యయను ప్రకృతియొక్క ఆవరణ— తెర వాస్తవమున లేదు. అందువలన జీవాత్మ పరమాత్మల యేకత్వసిద్ధికి నంతరాయమేమియు లేదు. ఇంతేగాక, మండల బ్రాహ్మణోపనిషత్తు 4 బ్రాహ్మణములోఁ జెప్పిన పంచాకాశములలో “ అనిర్వాచనీయ జ్యోతిస్సర్వవ్యాపకం నిరతిశయానన్దలక్షణం పరమాకాశమని” చెప్పఁబడిన కడాపటి పరమాకాశమందు “ ఖమధ్యేకురు చాత్మానమాత్మమధ్యే చ ఖం కురు । సర్వంచ ఖమయం కృత్వా న కించిదపి చిన్తయ । బాహ్యచిన్తా న కర్తవ్యా తథైవాన్తర చిన్తికా । సర్వచిన్తాం పరిత్యజ్య చిన్మాత్రపరమో భవ ॥” యను శాండిల్యోపనిషత్తు వాక్యానుసారముగ ఆత్మాకాశములను నొకదానిమధ్య నొకటి యుంచి బంధింపనంగా నేకముచేసి, “ విదిత్వా స్వాత్మనో రూపమసంప్రజ్ఞాత సమాధితః ” యను వరాహోపనిషత్తు వచన ప్రకారము నిర్వికల్ప సమాధిలో (త్రిపుటిరహితము) సర్వవ్యాపకమై, అఖండానందమైనను దివ్యతేజస్సుతో తాదాత్మ్యమునొంది స్వస్వరూపమును సందేహరహితముగ చింతించవలయును. ఇట్టి నిరతిశయానందములో వున్నను—

విశుద్ధమనస్సు పరమాత్మ—సాక్షిచైతన్యములోఁ (అవాంతరభేదములేక) పూర్ణముగ లీనమై „ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ” శ్రుతివాక్యము సిద్ధించును. కాని యతి కష్టమైన నద్వైతమును సదానిండు సమబుద్ధితో నభ్యసించుట. (గీ. 12 అ. 5 శ్లో) సర్వజనసాధ్యముకానందున, జనబాహుళ్యము వారివారి గుణములు మనఃపరిపక్వములను బట్టి సులభముగ నభ్యసించుటకుఁ దగునట్లు గీ. 12 అ. సారముగఁ బరమదయాళురైన శ్రీరామానుజ మధ్వాచార్యవారలు (శ్రీశంకరాచార్యస్వామి అద్వైత భాష్యము వ్రాసిన కొంత కాలమునకు) విశిష్టాద్వైత, ద్వైతశాఖల నేర్పరచి భాష్యములు వ్రాసిరి. వీనికి ప్రమాణగ్రంథములు వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీతలే యగుటవలన నద్వైతసిద్ధికి సోపానములగుచున్నవి.

మరియు ద్వైతులకు ముఖ్యదేవుఁడగు హనుమంతుఁడు శ్రీసీతారాములవలన ఆత్మతత్వము బోధింపఁబడిన పిమ్మట „తెలిసినదా” యని శ్రీరాములడుగగా „దేహబుధ్యాస్మి దాసోహం। జీవ బుధ్యాత్వదంశకః। ఆత్మ బుధ్యాత్వమేవాహం। ఇతిమేనిశ్చితం మనః।” యని ప్రత్యుత్తరమిచ్చెను.

ఈశ్లోకయొక్క మొదటి రెండుపాదములు స్థూల సూక్ష్మదేహములని, భగవదారాధనకు ముఖ్యమైన శ్రవణం, కీర్తనం, విష్ణోస్స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, మాత్మనివేదనం యను నవవిధభక్తిమార్గములలో, మొదటి యేడుమార్గములనున్ను; “ఆత్మబుధ్యాత్వమేవాహం” యను మూడవ పాదము కారణదేహమును, „సఖ్యమ’ను మొనిమిదోభక్తిమార్గమునగా సగుణ బ్రహ్మధ్యానమునున్ను, “ఇతిమేనిశ్చితమనః” యను

నాల్గవపాదము తురీయమైన "ఆత్మనివేదనము"ను తొమ్మిదో భక్తిమార్గమనగా "అహంభావము" పోయిన సమాధిని తెలుపును. "అహం బ్రహ్మేతి నిశ్చిత్య అహం భావం పరిత్యజ" తేజోబిందూపనిషత్తు 6 అధ్యాయము. సమాధియనగా అహం బ్రహ్మాస్మి, తత్వమసి యిత్యాది మహావాక్య బోధిత జీవ బ్రహ్మైక్యమును తెలుపును. ఇందువలనగూడ ద్వైత విశిష్టాద్వైతములు అద్వైత సిద్ధికి సోపానములుగాని భిన్నమతములు కావని నానిశ్చయము.

నాకు "అహం బ్రహ్మాస్మి" యను మహావాక్యోపదేశ కాలమందు, నేనున్న స్థలమందుఁగాక, ఆయింటిలో మరియొక స్థలమందు సతి యుత్సాహముతో సమ్మవారి పూజను జేయుచున్నటులఁ గనుపించుటఁజేత (గీ. 3 అ. 20 శ్లో.) జనకాదులు కర్మానుష్టానమువలన జ్ఞానసిద్ధిని పొందిరని, అందువలన నితర దేవతాపూజఁ జేయవచ్చునని, (గీ. 3 అ. 26 శ్లో) అట్లు యితరదేవతాపూజఁ జేయువారి కర్మాసక్తబుద్ధిని చలింపఁజేయఁగూడదని, గీతల 9 అ. 23 శ్లో). అట్టివారు అవిధిపూర్వకముగ నన్నే—పరమాత్మను పూజించుచున్నారని, అంతకాలమందు (గీ. 9 అ. 5 శ్లో) వారు పూజించిన దేవతాస్వరూపము బొందుదురని సూచనచేసినటులఁ దలచెదను. ఇందువలన లోకములోనున్న మతములు శాఖలు చక్రములోని రేఖలు కేంద్రమందు నేకమగునటులఁ దుదకుఁ బరబ్రహ్మమందేకమగును. గాన నేమతము శాఖ నిందార్హముకాదు.

—♦ 22వ స్వప్నము. ♦—

"సంవిత్కరణాయనమః" యను మంత్రమొక మహావాక్యమని, జీవాత్మ—ప్రత్యగాత్మ—కూటస్థచైతన్యము—అంశయను

పేర్లుగల 'సంవిత్' పరమాత్మ—ఉత్తమ పురుషుయని స్పష్టముగఁ దెలియుట కుపదేశించఁబడినదని తలఁచెదను.

'సంవిత్'—జ్ఞానము, 'కరణాయ' చేయు లేక స్థానభూతముగ నుండు వానికి 'నమః' నమస్కారమనఁగా జ్ఞానస్థానముగ నుండినఁ బరమాత్మకు నీనమస్కారమని ద్వైతబుద్ధిని యర్థమగును.

"సంవిత్కరణాయ" చతుర్థ విభక్త్యైకవచనమగుటవలన 'రామాయనమః,' 'శివాయనమః' యను మంత్రములకు వలెనే సచ్చిదానంద స్వభావమని, "నమః" యనునది పూర్ణానందైక కారణమని యద్వైతార్థము జెప్పవచ్చును.

"ఆదిబ్రహ్మ స్వసంవిత్" నిర్వాణోపనిషత్తు. అజాత్యసంవిన్మనసం తన్మయోభవ సర్వదా" మహోపనిషత్తు. "నశక్యతే మనోజేతుం వినాయుక్తి మనిందితాం। శుద్ధాంసంవిదమాశ్రిత్య వీతరాగస్థిరోభవ" అన్నపూర్ణోపనిషత్తు "ఏకనిష్ట తయాంతస్థసంవిన్మాత్రపరోభవ." వరాహోపనిషత్తు.

"సంవేద్యవర్జిత మనుత్తమ మాద్యమేకం। సంవిత్పదం వికలనం కలయన్ మహాత్మన్। హృద్యేవతిష్టతి కలనారహితః క్రియాంతు కుర్వన్నకర్తృ పదమేత్య శమోదతశ్రీః" అన్నపూర్ణోపనిషత్తు. ఓమహాత్మా కర్మఫలమును గోరక, కర్మ జేయుచున్నానను యభిమానములేక, విధ్యుక్తమైన మతకర్మలను జేయుచు, నద్వితీయమై, యేకమై, తనతో సమము, తనకంటె నధికమైన దేదియులేక, నిత్యమై, నిరవద్యమై, ప్రపంచమునకు మూలకారణమై, నీహృదయమందున్న "సంవిత్—"జ్ఞానమును సదా ధ్యానముజేయుము. పైవా

క్యములవలన సంవిత్పదము పరమాత్మ—నిర్గుణాత్మ—అంశయని స్పష్టమగుచున్నది. గీతల 15 అ. 7 శ్లోకము చూడుము.

ఈక్రింద వివరింపబడిన దృష్టాంతము వలన నీ వాక్యార్థము బూర్ణముగఁ గ్రహింపనగునని తలఁచెదను.

వేదశాస్త్రములు, మతములు, గురువు, భాషలేని యొక కాలమున నొక మనిషి మాత్రమె యుండెను. రెండవ మనిషి లేడు. కాని యతను మిక్కిలి బుద్ధిశాలి యగుటవలనఁ దానెవరో తెలుసుకొన దలఁచెను. ఇందుకుఁ దనకుఁ దానేయనఁగ దనమనస్సె మార్గదర్శిగాని వేరుసాధనములేదు. భూమి, పర్వతములు, నదులు, సముద్రములు, వృక్షములు, ఆకాశము, నక్షత్రములు, సూర్య చంద్రులు, యంతట నసంఖ్యములైన జీవ జంతువులతో నిండి, యతి సుందరమైన విశ్వము, దాని యుత్పత్తి. స్థితిలయములు కానవచ్చు చున్నవి. వీనినుంచి యనఁగా వీనియుత్పత్తి, స్థితిలయ కారణము లను యదార్థముగాఁ బరిశీలించి తనను దానె దెలుసుకొన దలఁచెను. సర్వావయవములు సరిగానుండి, కదలలేక శిథిలమగుచున్న శవమును మొదటఁ జూచెను. దానినిఁ బరీక్షించఁగాఁ గనుపడు చున్న స్థూలావయవములకు జలనశక్తి లేదని, యేదో నగుపడని సూక్ష్మశక్తివలన జలనమనఁగాఁ గ్రియాసామర్థ్యము కలుగుచున్న దని, మొదట నట్టి సూక్ష్మ శక్తియొక్క కారణములను బరిశీలించి తెలుసుకొన నిశ్చయించుకొనెను.

దాని యదార్థమునుసూక్ష్మ దృశ్య పదార్థములనుంచి యను మేయములనొంది, తిరిగీ మరికొన్ని కారణములనుబట్టి ముం... యనుమేయములనువిడచి క్రొత్త య... మేయముల నవలంబించుట,

యంతఃకరణ వృత్తులు మారుచుండుటవలన గలుగుచున్నవి. అట్టివృత్తు లొకటితో నొకటి యన్వయముగాను వ్యతిరేకముగాను గూడ నుండును. వీనిని విభజించునట్టి యూహలుకూడ వృత్తులేయైనను, బూర్వపు వృత్తులను, తత్కాలమున ఖండించునవిగాను బిమ్మట మరికొన్ని నూతన వృత్తులచే ఖండింప బడునవిగా నుండును. యెంత ప్రయత్నము చేసినను స్థిరమైనవృత్తి పదార్థము యగుపడక మనస్సుకు మరికొంత వ్యసనము కలిగెను.

సృష్టిని పరీక్షించి చూడగా క్రమము తప్పక సూర్య చంద్రులు నక్షత్రము లుదయించుట, యస్తమించుట, వాయువు వీచుట, సంవత్సరములు, కాలములు, ఋతువులు, మాసములు, దినరాత్రులు, నియతకాలముల వచ్చిపోవుట మొదలగు కార్యములనుజూచి, వీనికొక నియామకుడనగా యథావిధిని నడుపునట్టి గొప్పవ్యక్తి లేక శక్తియొకటి యుండునని, లేనియడల నిట్టి విచిత్ర సృష్టిస్థితి లయములు కలుగవని తలచెను. ఇంతేగాక సృష్టిలో బ్రతివస్తువునకుం బుట్టుట, పెరుగుట, నశించుట, యను మూడు స్వభావములను, జాగ్రత్స్వప్న నిద్రలనెడు మూడవస్థలను చలనము, ప్రకాశము, జడమనెడు మూడు గుణములను గలిగియున్నవి. ఇట్టి భిన్నలక్షణములు స్వభావములొక కారణమునుండి కలిగినవో లేక వేరు వేరు కారణములనుండి కలిగినవో తెలియవలెను. ఈసంశయములను దాను నివారణ చేసుకొనలేక జ్ఞానముకొరకు గొప్ప శక్తులనుగూర్చి వరుసక్రమముగా ధ్యానించెను. అందువలన నతనికి గొన్ని నూతన శక్తులనగా సామర్థ్యములు లభించినవి గాని తానెవరను ప్రశ్నకు సమాధానము కలుగలేదు. ఇంతేగాక యిన్నిటికి నాదికారణ

మనఁగా ప్రథమ కారణవ్యక్తి—శక్తిని దెలుసుకొనక యనేక శక్తుల ధ్యానించుట సత్యవిరుద్ధమని తోఁచెను.

సత్యమును తెలుసుకొనుటకు విశేష పట్టుదల, శ్రద్ధ, శాంతముకలవాడు గావున సృష్టిలో దృష్టిగోచర మగునట్టియుఁ గానట్టియు సకల పదార్థముల నుత్పత్తి స్థితిలయములను వాని కారణములను గూర్చి విడువక విచారణ చేయుచుండెను.

ఒకనాడతని యదృష్టవశమున తన యింటి సమీపములో సంధ్య చీకటి సమయమున నొకపాము కనుపించెను. తనకు సహాయమొనర్చుటకు నెవరును లేక విశేష భయమునొంది యేడ్చెను. భయముచే నొణుకుచు దూరముగా నిలబడి కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని, పామును కొట్టి చంపుటకొరకు దీపమును కర్రనుఁ దెచ్చుటకు నింటి తలుపు తెరువగా నింటిలోనున్న దీపకాంతిలో నత్యాశ్చర్యముగ పాముకనుపించిన స్థలమందు త్రాడు కనుపించెను. పాము కనపడలేదు. మొదట మందచీకటిలో నగుపడిన సర్పము దీపపు వెలుతురులోఁ ద్రాడుగాఁ గనుపించిన కారణము లెస్సగాఁ దర్కించుకొని, పామెప్పుడుగాని లేదని, త్రాడుమాత్రమె యున్నదని, అదియె మందాంధ కారములోఁ దనగన్నుల దృష్టిదోషము వలనఁ బాము యాకారముగ గనుపించినదని, దీపపు వెలుగులో భ్రాంతి కారణము లేనందున, భ్రాంతికల్పితమైన పాము రజ్జువునందడగి సత్యరజ్జువు కనుపించెనని స్థిరపరచుకొనెను. ఈదృష్టాంతమును చిరకాలమునుంచి తానాలోచించుచున్న సృష్టికారణమున కన్వయింంచగా, యజ్ఞానావస్థయందు భ్రాంతివశమున, మూలకారణమునగా ఆదికారణమందుఁ బ్రపంచకము కనుపించుననియు, భ్రాంతి నశించి

నపుడు లేదనియు నిశ్చయబుద్ధిగలవాడయ్యెను. ఇంతేగాక మూల కారణమని చెప్పబడు వ్యక్తియందు, భ్రాంతి యవస్థలో జగన్నిర్మాణముచేయు శక్తి మొదటి ప్రకృతియనియు, అదియెల్లపుడుండునదియు, లేనిదనియు, యుభయమగునదియు, కానిదనియు, కారణరహిత మూలకారణ వ్యక్తిలో భేదమనియు, అభేదమనియు, యుభయమనియు, గానిదనియు, అవయవములు కలదనియు, లేనిదనియు, యుభయమనియు కానిదనియు నిశ్చయింప వీలులేని మిక్కిలి యద్భుతమైన భ్రాంతిరూపమని తెలుసుకొనెను. ఇందువలనసృష్టి కారణము తెలిసినది. కాని తానెవరను ప్రశ్నకు సమాధానము కాలేదు.

తానెవరనునది తెలియుటకు, భూమి, ఆకాశము, ఉదకములయందున్న నసంఖ్యములగు వ్యష్టి జీవులయొక్క యుత్పత్తి తెలియవలెను. పుణ్యవశమున నొకరోజున పెద్దమంటను దానిలోనుంచి యమిత సంఖ్యలుగా బయలుదేరి యన్నిదిశలను వ్యాపించుచున్న మిణుగురులను జూచెను.

అటువలెనే పైనజెప్పిన కారణరహిత యాదికారణములోనుంచి యసంఖ్యాకములగు అంశలు—లేశములు బయలుదేరి సర్వత్ర వ్యాపించుచున్నవని, యవి కారణరహిత కారణములోనుంచి వెడలునపుడు, పైనజెప్పిన ప్రకృతిగుండా బోవలయునుగాన, ప్రకృతి సంబంధమగు రక్తిమయనగా గుణములతోఁ బూయబడినవై, అందువలన (నవి—అంశలు) తమ స్వస్వరూపమనఁగా నాదికారణముయొక్క అంశలను దానిని మరచి, వ్యష్టిజీవులై ప్రకృతిగుణ జన్యకార్యములలో దాదాత్మ్యబుద్ధితో సంచరించుచుండును. ఇదియె యవిద్య. దీనిని వ్యక్తికొఱకు జీవులు—అంశలు మొదట ఖనిజము

లనగా—భూమిలో నణువులుగా జేరి, కాలక్రమమున వృక్షవర్గము లోను చిన్నచిట జీవజంతువులుగా బుట్టుచు, పెరుగుచు, జచ్చుచు తరు వాత మానుషజన్మమునొంది యనేక జన్మ పరంపరలో జేసిన కర్మల యొక్క పలువిధ సుఖదుఃఖముల ననుభవించి, తుదకు సుకృతకర్మ పరిపాకమువలన సద్గురుబోధ లభించుటచేత నజ్ఞానమను సంసార సము ద్రముదాటి, తమయొక్క యాదిస్వరూప జ్ఞానమునుబొంది, తుదకు గారణ రహిత కారణములో ననగా స్వస్థానము చేరును. జీవుడు— అంశ స్వస్థానము చేరువరకు కర్మానుగుణ్యముగ బుట్టుచు జచ్చుచు గర్మఫలముల ననుభవించుచుండును. గాని యెందును స్థిరముగా నుండదు. జీవుడనుభవించు సర్వ సుఖ దుఃఖములు, సర్వ ద్వంద్వ ములు, సర్వతాపములు మనస్సుయొక్క దోషములను మలినము లను నశింపుచేసి, నిర్మలత నొసగును. అనేక జన్మలందిట్టి యనుభవ మువలన యజ్ఞానము నశించి జీవుడు—అంశ—సంవిత్ కారణ రహిత కారణములో జేరును. కారణరహిత కారణమునుండి వెడలిన అంశలలో బ్రారంభమందు నించుకైన భేదములేదు. కాని యవి తరువాత ధరించు దేహములవలనను గర్మలవలన నసంఖ్యములగు భేద ములుగలిగి తాము జీవులమని కించిజ్జ్ఞులమని యజ్ఞానముచే దలచు దరని, చరాచరాత్మకమైన సర్వజీవులయొక్క స్థూలసూక్ష్మదేహా ములను, గుణములను దొలిసివేయగా శేషించునది కారణరహిత కారణమేగాని మరెద్దియు గాదని గ్రహించెను.

ఈజ్ఞానమె "సంవిత్" సంవిత్తెజ్ఞానము - ఇది యిట్టిదని యూ హించుటకు జెప్పుటకు సాధ్యముకానిది. మనోబుద్ధుల కగోచరమై నది. దేశకాలములు లేనిది. ఇదియె సర్వకారణకారణము. ఇదియె

సృష్టికిఁ బూర్వమందును పరమందును నిత్యముగానుండునది గాన తనజీవుఁడు యితరజీవులు సర్వకారణ కారణముయొక్క అంశలేగాని వేరుకావని స్థిరపరుచుకొనెను. అందువలన „ సంవిత్కారణాయనమః" యను వాక్యము ప్రత్యక్చైతన్య పూర్ణబోధ వాక్యముని "మహ్యా మేవ నమోనమః" యనునట్టి పూర్ణానందైక కారణముని చెప్పిన గుసు. "సర్వభూతాంత రస్థాయ నిత్యముక్త చిదాత్మనే । ప్రత్య క్చైతన్యరూపాయ మహ్యామెవ । నమోనమః." వరాహోపనిషత్తు.

తైత్తిరీయోపనిషత్తు చతుర్థప్రశ్న 12 అను వాక్యములో "తస్యాస్తేసుషిరగ్ంసూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్" „నీవా ర శూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా । తస్యాః శ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః । సబ్రహ్మాసశివస్సహరిస్సేన్ద్రస్సోఽక్షర పరమ స్స్వరాట్" వాక్యములు బోధించు పరమేశ్వరుని సూక్ష్మరూపము ఈస్వప్నములో "సంవిత్" శబ్దము బోధజేయునని తలఁచెదను.

మరిన్ని పరబ్రహ్మము అద్వితీయుడయ్యు (ఏకోబహుశ్యాం శ్రుతి) అనేకమైయుండఁగోరి (గీ. 14 అ. 3 శ్లో.) పలువిధరూపము లలోఁ బ్రవేశించి, తిరుగఁ బ్రతిరూపములోను (గీ. 9 అ. 4వ శ్లో) సర్వవ్యాపియై యుండును. „ పిణ్డస్థోపి ప్రత్యగాత్మా సర్వవ్యాపీభవతి." పైంగలోపనిషత్తు. ఇదియె సృష్టిచమత్కారము. ఇది వాదమునకు సాధ్యముకాదు. గానఁ దార్కికులంగీకరించరు. పూర్ణచిత్తోపరతిగ లిగి ముక్తినొందిన మహాపురుషులనఁగఁ దత్వదర్శినులు—జ్ఞానులు స్వానుభవముచే నంగీకరింతురు.

## —◆ 23వ స్వప్నము. ◆—

సృష్టిలో దృష్టిగోచరమైనట్టియు, కానట్టియు ప్రతిష్ఠాల

సూక్ష్మపదార్థము నేను—పరమాత్మయని " మహాత్మాహం మహాత్మ తత్వాహం" యను వాక్యము తెలుపుచున్నది. " ద్రిష్టృదర్శన దృశ్యా నిత్యక్త్వానాసనయాసహా" మైత్రేయోపనిషత్. 2 అ. గీతల 7 అ. 4-5-6-7 శ్లోకములను చూడుము.

ఈబ్రహ్మము ఆదిని సన్మాత్రమైయుండెను. అనఁగా సచ్చిదానంద రూపము. రెండవదిగాని, స్వజాతీయ, విజాతీయ, స్వగతభేదములులేనిది. ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ—శ్రుతి. దీనికి సత్తు, అసత్తు, సదసత్తు, భిన్నము, అభిన్నము, భిన్నాభిన్నము, అవయవములు కలది, లేనిది, రెండుకానిదయ్యె, నిర్దేశింపఁ శక్యముకానిది, అత్యద్భుతమై తెలుపు, మెరుపు, నలుపురంగులు (సత్వరజస్తమోగుణములు) గలిగి అవ్యక్తమను పేరుగల మూలప్రకృతియనఁగా బ్రహ్మశక్తియొకటి యున్నది. ఇట్టి ప్రకృతిలో బ్రహ్మము ప్రతిఫలించి సాక్షిచైతన్యమయ్యెను.

1. ఈమూలప్రకృతి (ప్రకృతిః పరమాశక్తి ద్వికృతిః ప్రతిబింబితా) వికృతినొందఁగా, సత్వగుణములోఁ బ్రతిబింబించిన బ్రహ్మము సత్వగుణాధిక్యమువలన అవ్యక్తము—ఆవరణశక్తి అయ్యెను. ఇదియే ఈశ్వరచైతన్యము. ఈశ్వరుఁడు మాయకుఁ బ్రభువై జగదంకుర కారణుఁడయ్యెను. తనలో గుప్తమైయున్న బ్రహ్మాండలమును జీవులఁ గర్మానుసారముగ సృజించుచు, నశింపుచేయుచుండును.

2. ఈశ్వరాధిష్ఠితమైన ఆవరణశక్తినుంచి మహత్ యనునామముతో రజోగుణ ప్రధానమైన విక్షేపశక్తి పుట్టినది- దీనిలోఁ బ్రతిబింబించిన బ్రహ్మము హిరణ్యగర్భనామముతో స్పష్టాస్పష్టరూపము గలిగియుండును.

3. హిరణ్యగర్భునియొక్క విక్షేపశక్తినుంచి తమోగుణ ప్రధానమైన అహంకారమను స్థూలవ్యక్తి పుట్టినది. ఈ అహంకారములోఁ బ్రతిబింబించిన బ్రహ్మను 'విరాట్' చైతన్యమయ్యెను. ఈ విరాట్ అహంకారము నధిష్ఠించి స్థూలశరీరముగలిగి విష్ణుయను నామముతో స్థూలశరీరముల రక్షణకర్త, ప్రధానపురుషుఁడయ్యెను.

4. ఆత్మనుంచి ఆకాశ సూక్ష్మతన్మాత్రలు, వానినుంచి వాయుతన్మాత్రలు, వీనినుండి అగ్నితన్మాత్రలు, వీనినుండి ఉదకతన్మాత్రలు, వీనినుండి భూమి తన్మాత్రలు బుట్టినవి. పిమ్మట ఈశ్వరుఁడు (సోకామయత) స్థూలసృష్టి చేయఁగోరి, తమోగుణము నవలింబించి, పైనఁజెప్పిన సూక్ష్మతన్మాత్రలను యుక్తభాగముల ప్రకారము (ఒకదానిలో నొకటి) పంచీకరణమొనర్చి, పిమ్మట అపరాప్రకృతియగు సమస్త బ్రహ్మాండములను స్థూలోపాధులను సృజించెను.

5. ప్రకృతియొక్క సత్వగుణ మాయయనఁగా నిర్మలమగు మాయలోఁ బ్రతిబింబించిన బ్రహ్మము సమష్టిని ఈశ్వరుఁడాయెను. అవిద్యయనఁగా మలిన ప్రకృతిలోఁ బ్రతిఫలించిన బ్రహ్మము వ్యష్టిని జీవుఁడాయెను.

6. ఉపచైతన్యమనఁగాఁ బ్రత్యగాత్మ—అంశ—సంవిత్—కూటస్థచైతన్యము—స్వస్వరూపము. "సర్వజ్ఞేశో మయాలేశ సమన్వితో వ్యష్టిదేహం ప్రవిశ్య । తయా మోహితో జీవత్వమగమత్" పైంగలోపనిషత్తు.

7. అందువలన మంత్రములో 'మహాత్మాహం' యను శబ్దములు మాయాభాగములోఁ బ్రతిబింబించిన, బ్రహ్మమనఁగా ఈశ్వరలేక సాక్షిచైతన్యము. 'అహం'—నేను యని తెలుపును.

8. 'మహాత్మతత్త్వాహం' యను శబ్దములుపైనఁ జెప్పినటుల నుత్పన్నమైన (గీతల 7 అ. 4 శ్లో.) అపరాకృతియగు సర్వపదార్థములు తత్త్వములు 'అహం'—నేనని తెలుపును. స్థూలం సూక్ష్మంపరం చ్చేతి త్రివిధం బ్రహ్మణోవపుః । తజ్ఞబ్రహ్మమయం రూపం స్థూలం వైరాజముచ్యతే । హిరణ్యగర్భ సూక్ష్మన్తునాదం బీజత్రయాత్మకం । పరంబ్రహ్మ పరం సత్యం సచ్చిదానన్దలక్షణమ్ । అప్రమేయ మనిర్దేశ మజ్ఞానసగోచరం । శుద్ధం సూక్ష్మం నిరాకారం నిర్వికారం నిరంజనం । అనన్తమపరిచ్ఛేద్య మనూపమమనామయం. × × × బ్రహ్మైన సర్వనామాని రూపాణి వివిధానిచ, కర్మాణ్యపిసమగ్రాణి భాసతీవేతిభావయ." యోగశిఖోపనిషత్తు. ఏకో దేవస్సర్వ భూతేషు గూఢః సర్వవ్యాపీ । సర్వభూతాంతరాత్మా । కర్మాధ్యక్షః సర్వ భూతాధి వాసస్సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ శ్వేతాశ్వతరోపనిషత్తు.

ఆత్మయనఁగా—"యస్మాత్సర్వ మాప్నోతి సర్వమాదత్తే సర్వమింతిచ । తస్మాదుచ్చతే ఆత్మేతి." శాండిల్యోపనిషత్తు. "ఆకాశవత్సూక్ష్మశరీర ఆత్మా । నదృశ్యతే వాయువదంతరాత్మా । సబాహ్యమభ్యంతర నిశ్చలాత్మా । జ్ఞానోల్కయాపశ్యతి చాంతరాత్మా." పైంగలోపనిషత్తు.

"అణోరణీ యాన్మహతో మహీయానాత్మా గుహాయాం నిహితోస్యజంతోః" యని తైత్తిరోయోపనిషత్తు. 4 ప్రశ్న 12 అను వాక్యములోను, నారద పరివ్రాజకోపనిషత్తులోనుఁ జెప్పినటులఁ ఆత్మ అణువులలో నణువుగాను, గొప్పవానిలోఁ గొప్పదిగఁ బ్రతి జీవుని హృదయములోనుండునని, అదియె 'అహం—నేనని చెప్పఁ బడినది.

పైనఁజెప్పిన వాక్యములనుబట్టి భిన్నములుగాఁ గనుపించు ఆత్మ, సృష్టిపదార్థములు—ఉపాధులకు నుండు సంబంధమును, ద్వైతబుద్ధిని గలుగఁజేయునట్టి దేశకాలములకునుండు సంబంధ ను గూర్చి యోచించుటవసరమని తలఁచెదను.

1. ఆత్మయనఁగా జ్ఞానము—తెలివి. జ్ఞానము వలనఁ దెలి ఁబడునవి సృష్టిపదార్థములు. ఇవి—సృష్టిపదార్థములు జ్ఞాన ు నాత్మసంబంధమును దెలియఁజేయుచున్నను, వేరు—భిన్నస్థి లవిగను, జ్ఞానతాదాత్మ్యమనఁగా జ్ఞానముతోఁ జేరియుండనివిగఁ పించును. గాని పరీక్షించి చూచిన, యనగా, వివేకముతోఁ చిన యీ భేదము సత్యముకాదని, పైకి మాత్రమటులఁ గను చునని స్పష్టమగుచున్నది. అనాత్మపదార్థములైన శబ్దము మొద నవి ఆత్మకంటె భిన్నముగనున్నటులఁ గనుపించినను, ఆత్మ— నముతో నావరింపఁబడి యనగా నాత్మతో మిళితమైయున్నవి. త్మయన సంవిత్—జ్ఞానము వానిని విడిచియుండదు. జ్ఞానము ార్థమును నావరించియున్నపుడు, యేపదార్థము జ్ఞానమునుంచి ుగా నుండదు, దానితోఁ గలసేయుండును. గాన జ్ఞానము పదా ు వేరుగా—భిన్నముగానుండినటులఁ గనుపించుట వ్యవహారి ు. అనఁగా నవిద్య—తెలివిలేమిని తెలుపును. ఈ అజ్ఞానము ేకము వలన పోవును. జ్ఞానము—ఆత్మభిన్నములేనిది, అనఁగా ాజింపఁబడునదికాదు. సర్వమును తెలుసుకొనునది. పదార్థము ును మాత్రమె తెలియునది. ఆత్మయొక్కయు పదార్థముయొక్క ం యీ భేదము, భేదస్వభావకారణమును గూర్చి పరీక్షించి సత్య ు కాదని తెలుసుకొనువరకు నిలిచియుండును. ఈ భేదకారణము

దేశకాలములై యున్నవి. దేశమనఁగా- పదార్థముల సమకాల భావము. కాలమనఁగా- పదార్థములు యొకటి తరువాత యొకటి యని తలఁచుట. దేశకాలములు పదార్థములయొక్క యింద్రియ జన్యజ్ఞానములను క్రమపరచుచున్నవి. యనఁగా విశదముచేయుచున్నవి. వీనిలో దేశము ఒక పదార్థమును మరియొక పదార్థమునుంచి, ఆత్మను ప్రపంచమునుంచి భిన్నముగఁ గనుపింపఁజేయుచున్నది. ఆత్మ శరీరములో ఇక్కడను లేక శరీరముయొక్క యొక భాగములోను, ప్రపంచము లేక ప్రపంచపదార్థము అక్కడను అనఁగా ఆత్మభిన్నముగ నున్నట్టులఁ గనుపించును. ఆత్మకు ప్రపంచకము వలెనె లోపల, వెలుపల, లేక ఇక్కడ అక్కడ యను భేదము, ఆత్మస్వభావము జ్ఞానమను సంగతి మరచి, శరీరమే ఆత్మయను బుద్ధితోనుండుటవలనఁ గలిగినది. జ్ఞానదృష్టిలో ఆత్మ యిక్కడనఁగా నేదోయొక పదార్థములోనే గాక సర్వత్రయనఁగ సర్వపదార్థముల లోపలను వెలుపలను గూడ నుండి సర్వమును ప్రకాశింపఁజేయుచున్నది. ఇక్కడనున్నదే (ఆత్మ) అక్కడను, అక్కడనున్నదే యిక్కడను నున్నది. గాన ఆత్మ సర్వవ్యాపి అయ్యున్నది. అందువలన జ్ఞానముయొక్క పదార్థమగు దేశము జ్ఞానమగు నాత్మలోనున్నదిగాని వేరుగ—భిన్నముగ లేదు. గాన ఆత్మకు వెలుపల యనఁగా బాహ్యమందే భిన్నపదార్థము ప్రపంచములేదు. ప్రపంచము వ్యావహారిక సత్యము కలదిగాని ఆత్మ సత్యము కలదిగాదు. గాన దేశము విశ్వమును ద్వైతముగాను ఆత్మకంటె భిన్నముగాను చేయుటలేదు. అది, ఇది, అక్కడ, ఇక్కడయను శబ్దములు రెండు పదార్థముల మధ్య దేశమును భాగములుగాఁ జేయవు. ఘటములోనుండు దేశము

ఘటము వెలుపలనున్న దేశముకంటె వేరుగానున్నటులఁ దోఁచును. కాని వేరు చేయుచున్నటులఁ గనుపించెడు ఘటముయొక్క గోడలు లేక పక్కలు దేశములోనుండుటవలన దేశము వేరు అనఁగా భిన్నముకాలేదు.

అటులనే ఆత్మను ప్రపంచమునుంచి భిన్నముచేయు పదార్థముగాని, లేక యుపాధిలోనుండు ఆత్మను విశ్వములోనున్న ఆత్మనుంచి భిన్నముచేయు పదార్థముగాని సత్యముగ లేదు. ఏమనఁగా శరీరము (దీనికి బాహ్యముగానున్నటులఁ గనుపించెడు) ప్రపంచము గూడ నొక యాత్మవలననే ప్రకాశించుచున్నవి. దానిలో—ఆత్మలోఁ జేరి దానికి దృష్టి పదార్థములుగనున్నవి. గాన దేశము వలన ద్వైతబుద్ధికిఁ గారణములేదు.

2 పైనఁజెప్పినటుల ఆత్మయె పారమార్థికయనఁగా సత్యస్థితి కలది. అజ్ఞానఅవస్థలో ప్రపంచము వ్యవహారిక స్థితికలది. పరమార్థావస్థలో ఆత్మభిన్నమైన ప్రపంచము పదార్థములేదు. దేశము, కాలము కర్మలేవు, అందువలన కర్మచేయువాఁడు, కర్మఁ జేయుకాలములేదు. దేశము అక్కడ ఇక్కడయను భేదమునుఁ దెలుపును. ఈరెంటి అభేదము తెలియనంతవరకు మాత్రము యివి కనుపించును. అనఁగా దేశములోనున్న పదార్థములు ఆత్మభిన్నములని సత్యములని తలఁచినంతవరకు మాత్రము భేదముగనుపించును.

అటులనే అప్పుడు ఇప్పుడు యని భిన్నముగఁ గనుపించుఁ గాలము ఆత్మసంబంధముగఁ జూచిన, భిన్నము నశించును. ఎటులనఁగా- భూతవర్తమాన భావికాలములు వచ్చి పోవుచున్నను, ఆత్మ

మార్పులేక సర్వమును తెలియును. పదార్థములయొక్క రాకపోకలు అనఁగా నుత్పత్తి నాశనములు కేవల ఆభాసము. పదార్థములు ఆత్మ భిన్నములుగఁ దలఁచెడుఁ గాలమందు సత్యములుగఁ గనుపించును. దేశకాలములు ఆత్మలో లీనమైనపుడు బహు జీవ ప్రతీతి అధార రహితమైపోవును. ఒకటియగు సత్యములో బహుళమును ప్రతి పాదించునట్టి ఉపాధిత్వము (finitude) అసత్యమనఁగ అభాసమని తెలియఁగానే ఉపాధిత్వముగూడ అనంతములో—బ్రహ్మములో లీనమై బ్రహ్మము శేచించుచున్నది. అటుల నాశరీరములోని జీవుఁడు (finite) పరమార్థదశలో సత్యముని అంతము కలదికాదని, యితు లనే ప్రతి యుపాధిలోనుండిన జీవుఁడు కూడఁ బరమార్థదశలో సత్య మని అంతము కలది కాదని, అందువలన నొకటేయనఁగ బ్రహ్మ మని తెలియవలెను. శ్రుతి., "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" సత్తు చిత్తు ఆనందములు ఆత్మ స్వభావముగాని నొకదానినుంచి యొకటి భిన్నలక్షణములు కావు. ఆనందమనఁగా (బాహ్యపదార్థానుభవ మువలనఁ గలిఁగిన ఆనందముకాను) ద్వైత రహితమైనఁ బూర్ణా నందమును తెలియఁజేయును. ప్రాణము ఆత్మని శేషము. ఆత్మ పర మాత్మ విశేషము.

ఇట్లు "మహాత్మాహం మహాత్మ తత్వాహం" యను వాక్య ము 'పరా అపరా' ప్రకృతుల నతిక్రమించి విశ్వమునకు సర్వకా రణ కారణమగు నిర్గుణబ్రహ్మమును, 'అదియే' అహం—నేనని తెలుపును. తదిదం సర్వం బ్రహ్మం సర్వమిదమహం బ్రహ్మైవచ శ్రుతివాక్యముల యర్థమును బోధించును.

మరిన్ని. తైత్తిరోపనిషత్తు భృగువల్లిర అను వాకము "ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందాద్ధ్యేవ ఖల్విమాని

భూతానిజాయంతే । ఆనందేనజాతాని జీవంతి । ఆనందం ప్రియం త్యభి సంవిశంతీతి." అనఁగా ఆనందమే బ్రహ్మమని, జీవులు (భూతాని) ఆనందమువలనబుట్టి ఆనందముచేతనే జీవించుచున్నవని, తిరిగి ఆనందమునే జేరునని చెప్పఁబడినది. అవి యవిద్య—అజ్ఞానమువలన బుట్టిన వికారమువలన, వాని ఆది స్వరూపము మరచుటచేఁ జనన మరణ దుఃఖపరంపరకు హేతుభూతములైన కామక్రోధములచేత నావరింపఁబడిన మలినమనస్సు, బుద్ధి యింద్రియములకు వశ్యులై మలిన వృత్తులు, వాసనలు, సంస్కారములతోఁ దాదాత్మ్యమునొంది, తత్కాలమున నాటకములో నటకుని చందంబున, ప్రపంచనాటకములోఁ దెలివిలేనివిగను, బద్ధులుగను సంచరించుచున్నవి. ఇది తప్పుటకు మనుజుఁడు శరీరముచేతను నిర్మల మనస్సు, బుద్ధి, యింద్రియములచేతను చేయు కర్మలను, ఫలాపేక్షలేక, తాను చేయువాఁడు చేయించువాఁడు కానని ఈశ్వరార్పణ చేయవలెను. గీతల 5 అ. 10-11, 9 అ. 27, 12 అ. 16 శ్లోకములు. మనుజుఁడు తాను చేయు కర్మలను, వాని ఫలములను తన సహితముగ నీశ్వరార్పణచేసి, యనఁగాఁ దనకెట్టి స్వతంత్రము సమర్థత లేదని, సర్వము బ్రహ్మమేనని, తనకు బ్రహ్మకు భేదమించుకయు లేదని, సదా బ్రహ్మతాదాత్మ్యము పొందియుండవలెను. ఇట్టి పదవి లభించుటకు మనుజుఁడు నిండు నిర్మల మనోబలముచేత మలినమనస్సును కోర్కెలను, మలినవృత్తులు, వాసనలు, గర్వము, అహంకారము, డంబము, దురభిమానము, క్రోధము, నిష్ఠురవాక్కులు మొదలగు నాసురసంపద్గుణములను, గీతల 4 అ. 26-27 శ్లోకముల సారముగ, నింద్రియ నిగ్రహమనెడు అగ్నియందు హోమముచేసి, తానుగూడ,

భగవదర్పణయనఁగాఁ బరమేశ్వర తాదాత్మ్యము నొంది యుండ వలెను. ఇట్లు చేయుటయె పురుషోత్తమ ప్రాప్తియని ఆత్మాహం ఆత్మతత్త్వాహం యను శబ్దముల తాత్పర్యమని నమ్మెదను.

విశేషించి, "మహాత్మాహం మహాత్మతత్త్వాహం" యను వాక్యమును జపముచేయుమని ఆజ్ఞయిచ్చుటవలన, గీతల 6 అ. 25 శ్లోకములో ("శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యాధృతిగృహీతయా। ఆత్మసంస్థంమనః కృత్వానకించిదపిచింతయేత్") శ్రీకృష్ణస్వామి అర్జునకుఁజేసిన బోధానుసారముగ, దృఢమైనబుద్ధిచేత మనస్సును ఆత్మయందుఁ బ్రవేసింపఁజేసి, యితర చింతలేమియులేక, మెల్లమెల్లగా ఉపరతినిఁ బొందవలయును. ఇదిలభించుటకు ముముక్షువు తొలుత వాక్కునునియమించి, కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను, సంకల్ప వికల్పాత్మకమైన మనస్సును, బుద్ధిని, అహంకార తత్త్వమును, మహాతత్త్వమును, అవ్యక్త తత్త్వమును క్రమముగ అవి లోమవార్గమునఁ బ్రతి తత్త్వమును ఉత్తర తత్త్వములో లీనముచేసి, తుదకు నద్వితీయ నిరంజన నిరుపాధిక నిర్గుణ బ్రహ్మయనఁగా శాంత ఆత్మనుఁ జేరవలయును. శ్రుతి- యచ్ఛేద్వాజ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని, జ్ఞానం నియచ్ఛేన్మహతి తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని." పైనఁజెప్పిన తత్త్వములలోఁ బ్రతియుత్తర తత్త్వము పూర్వతత్త్వముకంటె సూక్ష్మమని, కడపటి తత్త్వము—శాంతఆత్మ అన్నిటికంటె సూక్ష్మతమమై సృష్టిక్రమమును బట్టి అన్ని తత్త్వములలోను వ్యాపించియున్నదని తెలియవలెను. శ్రుతి- ఇంద్రియాణిపరాణ్యాహురింద్రియేభ్యః పరంమనః। మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః। మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః। పురుషాన్న పరంకించిత్సా కాష్ఠాసా పరా గతిః.

అహంకార తత్వము "వ్యష్టి సమష్టి" యని రెండు విధములు. సమష్టి అహంకారము అన్నిటియందు వ్యాపించియుండుటం జేత మహదాత్మలేక "హిరణ్యగర్భుండ"ని చెప్పంబడును. "శాంత ఆత్మ" అన్ని తత్వముల నతిక్రమించియున్నది. పూర్ణసమాధిలో మహదాత్మమొదలగు నన్ని తత్వములు శాంత ఆత్మలో లీనమైన పుడు పరిశుద్ధజీవాత్మ—ప్రత్యగాత్మ వ్యక్తమగుచున్నది. అనంగాం జూడంబడుచున్నది. మహదంకారములనెడు కొమ్మలు, మనస్సు బుద్ధిం ఇంద్రియములనెడు చిగుళ్లు పుష్పములు రాలిపోయిన శుష్కవృక్షమూనులోనుంచి పురుషుండు వ్యక్తమగుట, 19 స్వప్నములో దృష్టాంత పరచంబడినది.

పై గ్రంథముయొక్క ముఖ్యతాత్పర్యమేమనంగా, సర్వకర్మలను, ధర్మాధర్మములను, తన సహితముగ సర్వత్రవ్యాపించియున్న పరబ్రహ్మయనంగ శాంత ఆత్మ—కారణరహితకారణములోం జేర్చుటయని, అదియె నిజమైన జ్ఞానమని తెలుపును. "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ । అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః" గీతల 18 అ. 66 శ్లోకము.

## —♦ 24వ స్వప్నము. ♦—

ఇదివరకుం జేసిన యుపదేశములను ప్రపంచ సుఖములు, వ్యాపకములు మొదలగువానివలనం గప్పంబడి మరచిపోంగూడదని గురుపీ స్వప్నములో నాజ్ఞాపించుచు, వేరుపదములచే "తత్వమసి" యను మహావాక్యతాత్పర్యము బోధంజేసెనని తలంచెదను.

"ననధననిరోహితః" యను వాక్యమున కర్థమేమనంగా, (త్వం నీవు) (సః—ఆత్మవు. "తిరోహితః—ప్రకృతిగుణముల

వలనఁ గప్పఁబడిన వాఁడవు, (నభవ '—కాకుము. అనఁగానాసురసం పత్తికారణములైన రజస్తమోగుణలయొక్క చిత్తవిభ్రాంతులవలన మోహామనెడు వలచేతఁ జుట్టుకోఁబడినవాఁడవు కాకుము. గీతల 4 అ. 12, 16 అ. 16 శ్లోకములు.

స్వప్నపదములనుబట్టి గురువు యుపదేశములను ముగించఁదలచినట్లు సూచించును.

—♦ 26వ స్వప్నము. ♦—

ఇదివరకుఁ జేసిన యుపదేశములను నీ స్వప్నములో నుపపాదించి, సంసార మోచనముఁ జేయునదిగాన, నద్వైతమును శ్లాఘించెనని తలఁచెదను.

1. అద్వైతమననేమిటి? 2. బోధితతత్వ్యమనఁగనేమి? ఎట్టిస్థితిలో మనుజుఁ డద్వైతమును దెలిసినవాఁడగును? 3. పరబ్రహ్మయననెవరు? 4. తేయతేయుఁ శబ్దార్థమేమి?

1 „జీవేశ్వరౌ మాయికావితి విజ్ఞాయ । సర్వశేషం నేతినేతీతివిహాయ । యదవ శిష్యతే తదద్వయం బ్రహ్మ." అద్వయతారకోపనిషత్తు.

2. గీతల 3 అ. 5 శ్లోకసారముగఁ బ్రకృతి గుణములచేతఁ బ్రేరేపింపఁబడి మనుజుఁడుచేయు సర్వకర్మలను, (2 అ. 47 శ్లో) ఫలాపేక్ష రహితుఁడై 9 అ. 27 శ్లో మశ్వరార్పణచేసి, (14 అ. 19 శ్లో) తాను వాటికి సాక్షిభూతుఁడై. తస్మిన్సర్వభూతాని యను వాక్యబోధప్రకారము సర్వభూతములు—జీవులయందు సమబుద్ధి

గలిగి (గీ. 6-29శ్లో) తనను సర్వభూతములయందు, సర్వభూతములనుఁ దనయందుఁ జూచుటయనఁగా సర్వము తానేగాని యన్యముకాదని స్వానుభవముతో సమదర్శియై యుండుట „ అద్వైతే బోధితేతత్త్వే” యగునని తలఁచెదను. ద్వైతాద్వైత సముద్భూతైర్జగ నిర్మాణ లీలయా। పరమాత్మ మయీశక్తి రద్వైతైవ విజృంభతే” మహోపనిషత్తు.

3. ప్రతిశరీరమందు క్షర, అక్షర, ఉత్తమపురుషులని ముగ్గురు పురుషులుందురు. నశించు స్వభావముగల సమస్త చరాచర స్వరూపములు క్షరపురుషుఁడు. ప్రత్యగాత్మ—కూటస్థుఁడని చెప్పఁబడు అంతరాత్మ అక్షరపురుషుఁడు. గీ. 8 అ. 4 శ్లో. ఈ యిద్దరుపురుషులకంటె విలక్షణుఁడు, ఉత్కృష్టుఁడు, అగోచరుఁడు, శాశ్వతుఁడై స్వర్గమర్త్య పాతాళలోకములయందనఁగా విశ్వములోఁ బ్రవేశించి (గీ. 8 అ. 20, 9 అ. 4, 15 అ. 17 శ్లో.) వాటిని భరించుచున్న సాక్షిచైతన్యము—పరబ్రహ్మ (గీ. 13 అ. 23, 15 అ. 18 శ్లో.) “ తత్ప్రతి బింబితం యత్తత్సాక్షిచైతన్యమాసీత్” పైంగలోపనిషత్తు. “ఆత్మాహం సర్వభూతానాం విభుస్సాక్షీనసంశయః” సర్వసారోపనిషత్తు. „ భేదదృష్టి రవిద్యేయం సర్వథాతాం విసర్జయేత్ ” మహోపనిషత్తు 5 అ.

4. ఎవని జీవాత్మ—ప్రత్యగాత్మ ప్రపంచవాసనలేమియు లేక యుత్తమపురుషునిఁ జేరునో, అట్టి జీవుఁడు పునర్జన్మరహితుఁడై పరిపూర్ణ మోక్షపదవినిఁ బొందును. గీ. 15 అ. 19శ్లో. క్షేత్రజ్ఞ పరమాత్మోచతయోరైక్యం యథాభవేత్ । తదైక్యే సాధితే బ్రహ్మన్ చిత్తంయాతి విలీనతాం. యోగశిఖోపనిషత్తు.

పైనజెప్పినటుల జీవాత్మను బరమాత్మ—బ్రహ్మలోఁ జేర్చునదిగాన నద్వైతమును శ్లాఘించెను. „ అద్వైతం పరమానందం శివంయాంతితు కేవలం । అధిష్ఠానం సమస్తస్య జగతస్సత్య చిద్ఘనం । అహమస్మీతి నిశ్చిత్యవీతశోకో భవేన్మునిః । స్వశరీరే స్వయం జ్యోతిస్స్వరూపం సర్వసాక్షిణం.” రుద్రహృదయోపనిషత్తు.

ఓంకారశబ్దభాగములగు అకార ఉకారములధ్వని—ఉచ్చారణ మకారధ్వని నాదములో లీనమై నాదాంత మందద్వైత నిర్గుణబ్రహ్మలోఁ గలియునటుల జీవాత్మ చాంచల్యరహిత ధ్యానసమాధులలో నుత్తమపురుషునిఁ బొందును. ఇదియె పూర్ణాద్వైతభావము.

పంచమహాభూతముల పంచీకరణమువలనఁ గలిగిన స్థూలశరీరములను అపంచీకరణమనఁగా విడతీయుటకుఁ బరమాత్మయొక్క— „ సోకామయత ” యనెడు వృత్తి కలుగగానే సర్వభూతములు వాని వాని యుత్పత్తికారణములలో అనిలోమమార్గమున లీనమై తుదకు పరబ్రహ్మమును జేరును. పైంగలోపనిషత్తు. 3 అ.

ది 5-4-24 రాత్రి నేను నిద్రనుండి లేచునపుడు „ స్వాత్మన్యేవ సదాపశ్యేత్ । స్వాత్మన్యేవ సదాస్థితిః । స్వాత్మన్యేవ సదా ధ్యానం । స్వాత్మన్యేవ సదాగతిః ” యను శ్లోకము నామనస్సునకుఁ దట్టినది. నేనీ శ్లోకము నేపుస్తకములోనుఁ జదివిన జ్ఞాపకములేదు. మోక్షమునొందుటకు స్వాత్మ—స్వస్వరూపము—సంవిత్తును దెలుసుకొని సదా దానియందు రమించుటయె ముఖ్యసాధనమని నీ శ్లోకము బోధించుచున్నది. గీ. 6 అ. 15-20, 13 అ. 25 శ్లోకములు.

చంచలమనస్సును నిర్మలమనస్సుచేత విషయవ్యాప్తినుండి మరలించి, ఆత్మను ఆత్మచేతనేఁ జూడవలయును. „ బ్రహ్మనిస్తన్ను

పర్యంతం మృషామాత్రో ఉపాధయః । తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనాస్థితం." "స్వయంబ్రహ్మా స్వయంవిష్ణుస్స్వయమింద్రస్స్వయంశివః । స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యన్న కించన." అధ్యాత్మోపనిషత్తు. "హృదయం నిర్మలంకృత్వా । చింతయిత్వాఽప్యనామయం । అహమేవపరం సర్వమితి పశ్యేత్పరం సుఖమ్ ." "మనసోహ్యున్మనీ భావే ద్వైతం నైవోపలభ్యతే" పైంగలోపనిషత్తు.

ముముక్షువు ఆహారనిద్రలయందు మితముగానుండుచు, బ్రహ్మచర్య వ్రతముగలిగి, మిక్కిలి యెత్తుపల్లములుగాని పరిశుభ్రమగు రహస్యసమప్రదేశమున, మొదట దర్భాసనము దానిపైనం గృష్ణాజినము, దీనిపైన వస్త్రము బరచిన యాసనము మీద శరీరమును, కంఠమును, శిరమును సరిగానిలిపి, మనస్సు నితరవృత్తుల నుండి మరలించి, రాగద్వేషరహితుడై, దిక్కులుజూడక, తన ముక్కు కొనమీద దృష్టినిలిపి, యేకాగ్రబుద్ధితో స్వాత్మధ్యానమనంగా స్వస్వరూప ధ్యాన మారంభించవలయును. సర్వభూతములయందు సమదర్శియై సర్వభూతములయందుం దనను, తనయందు సర్వభూతములను జూచుచుండవలయును. ఇట్లు చేయుటయె స్వాత్మను జూచుట, స్వాత్మయందుండుట, స్వాత్మధ్యానము యగును. "స్వస్వాత్మ నిస్స్వయంరంస్యే, స్వాత్మన్యేవవిలోకయె । స్వాత్మన్యేవ సుఖాసీన స్వాత్మమాత్రావశేషకః । స్వచైతన్యే స్వయంస్థాస్యే స్వాత్మరాజ్యే సుఖేరమె । స్వాత్మసింహాసనేస్థిత్వా స్వాత్మనోన్యన్న చింతయే." తేజోబిందూపనిషత్తు. 3 అ. "తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః. గీ. 5 అ. 7 శ్లో. "సోహం చిన్మాత్రమేవేతి చిన్తనం

ధ్యానముచ్యతే । ధ్యానవిస్మృతి తస్సమ్యక్సమాధి రభిధీయతే." త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు.

మరిన్ని గీ. 3 అ. 17 శ్లో. "యస్త్వాత్మ రతిరేవస్యా దాత్మతృప్తశ్చమానవః । ఆత్మన్యేవచ సంతుష్టస్తస్యకార్యం నవిద్యతే"—తనయందే ప్రీతిగలిగి, తనచేతనే తృప్తినొంది, తనయందే సంతోషించుచున్న మనుజునకు—జ్ఞానికిఁ జేయఁదగిన కర్మమేదియు లేదని చెప్పుచున్నది. అనఁగా—పరమాత్మానందమును పొందినవానికిఁ దనకంటె నన్యమైనది యేదియులేదు గనుక అనాత్మవిషయమైన రతి, తృప్తి, సంతోషములులేనివాఁడై అద్వితీయ పరమానందమును అనుభవించుచు (శ్రుతి) ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మ విదాంవరిష్ఠః." యను వాక్యసారమున, సదా జ్ఞానధ్యాన వైరాగ్యాది క్రియలతో ఆత్మసాక్షాత్కారము చేసుకొనుచుండు నని, అట్టి ఆత్మవేత్తకు (శ్రుతి)"ఇహైవ సర్వేప్రవిలీయంతి కామాః" యను వాక్యసారముగ సర్వకోర్కెలు బ్రహ్మప్రాప్తియందు అణఁగి పోయినందున తనకొరకుఁ జేయఁదగిన లౌకిక వైదిక కర్మలేవియు లేవని తెలుపును. సదా ఆత్మయందు రమించు జ్ఞాని నేను బ్రాహ్మణుఁడను, క్షత్రియుఁడను అనెడు మతాంతర శాఖాంతరభేదబుద్ధిగాని, నేను నాదియను తలంపుగాని లేనివాఁడై సర్వాత్మ స్వరూపుఁడై జడభరతాదులవలె సంచరించును. ఇట్టి బ్రహ్మభావమును పొందిన గృహస్థు ప్రారబ్ధవశమున సన్యసించకపోయినను, ప్రవృత్తికి హేతువులైన దేహాత్మ భావములేక పోవుటవలన (గీ. 3 అ. 20 శ్లో.) లోకసంగ్రహముకొరకు గాని, శరీరయాత్రకొరకు గాని చేయు కర్మలవలన (గీ. 5 అ. 7 శ్లో.) "కుర్వన్నపినలిప్యతే" బద్ధుఁడుకాఁడు.

మనుజుఁడు శరీరపోషణకొఱకు తనకిష్టమైన కర్మ—పనియనఁగా వ్యాపారము చేయవచ్చును. అట్టిపని తన పనిగాఁ దలపఁగూడదు. తనకుఁ బరమాత్మనుంచి వేరుగానునికి సత్యముగా లేనందునఁ దాను చేయు ప్రతిపని పరమేశ్వరునిపనియగుచున్నదిగాని తన పనికాదు. అందువలన నట్టి కర్మఫలమును తానుకోరఁగూడదు. యేపనినిదాను చేయుచున్నానని చేయించుచున్నానని తలచకూడదు. „ జాగ్రత్యేవ సుషుప్తస్థ కురు కర్మాణి వైద్విజ । అంతస్సర్వపరిత్యాగీ, బహిఃకురు యథాగతం ” అన్నపూర్ణోపనిషత్తు. 5 అధ్యాయము. గీతలయొక్క 2 అ. 47-48, 3 అ. 8. 18, 4 అ. 20 మొదలు 24 వరకు, 5 అ. 7 మొదలు 13 వరకు శ్లోకములను జదువుము. ఇట్లు చేయుటవలనఁ జిత్తశుద్ధి, తద్వారా క్రమముగా మోక్షము గలుగుటకు సందేహము లేదు.

పైన వివరించిన స్వప్నోపదేశములయొక్క వివరణయొక్క ముఖ్యతాత్పర్యమేమనగా—

యేమత యేశాఖవాడైన, యేపనిచేయువాడైన, దేవుని యందు నిండుభక్తి, సృష్టిజంతువుల యందసూయత, భేదబుద్ధిలేక, సమబుద్ధియనఁగా „ ఆత్మవత్సర్వభూతాని ” యను సద్బుద్ధితోఁ బ్రవర్తించుటయె జ్ఞానము. ఇదియే విద్య. „ విద్యా సంప్రాప్యతే బ్రహ్మన్ సర్వదోషాపహారిణి ” మహోపనిషత్తు. 5 అధ్యాయము. అట్టి మనుజునకు ముక్తి కరతలమున నుండుటయెగాక, పరమేశ్వరుఁడు సదా యట్టి మనిషియొక్క హృదయాంతరవర్తియై యోగక్షేమము లరయుచుఁ దనను పొందఁదగిన యోగజ్ఞాన మార్గముల బోధచూపి

ది 24-6-24 దినముదయమున నిద్రనుండి లేచునపుడు "నతిష్ఠతిక్షణేనైవ వృత్తిం బ్రహ్మమయీంవినా" యను నర్ధశ్లోకము నెవరో చెప్పినటుల మనస్సుకుఁ దట్టినది. దైవభక్తిగల ప్రతి మనుజుడతి చంచల స్వభావమైన మనస్సును, యింద్రియములను వాని వాని విషయములయందొక నిమిషమైన బ్రవర్తింపనీయక సర్వదా బ్రహ్మధ్యానములో నిలుపవలయునని చెప్పుచున్నది. "ఆవృణోతి తథామాయా ప్రాజ్ఞంవాపి పరాన్ముఖం" యని అధ్యాత్మోపనిషత్తులోఁ జెప్పినటుల నింద్రియ నిగ్రహము బహు కఠినముగాన, వివేకియైనను సదా జాగరూకుడై యుండవలయును. గీతల 2 అ. 60-68, 5 అ. 17, 8 అ. 14 శ్లోకములు చూడుము.

"ఏకంబ్రహ్మ చిదాకాశం సర్వాత్మక మఖండితమ్ । ఇతిభావయ యత్నేన చేతశ్చాంచల్య శాంతయె" వరాహోపనిషత్తు 5 అధ్యాయము. "బ్రహ్మవేదన మాత్రేణ బ్రహ్మాప్నోత్యేవమానవః" కఠోపనిషత్తు. వేదన యనఁగ భక్తి. స్నేహపూర్వకమగు ధ్యానము. అట్టి భక్తిని విధితోగాని, విధి తెలియకగాని అనన్యమనస్సుతోఁ జేసిన, ఫలదాయి యగునని శివ గీతలలోఁ జెప్పఁబడినది. "శ్లో. విధినా విధినావాపి భక్త్యాయే మాముపాసితే । తేభ్యఃఫలప్రయచ్ఛామ్యహం నసంశయః."

"అద్వైతే బోధితే తత్త్వే పరంబ్రహ్మణిలీయతె" యనునర్ధ శ్లోకములో జెప్పబడిన యద్వైతానుభవము గలుగుటకు మార్గము దీనిలోను వెనుకటిదానిలోను సూచించబడినది.

పైనజెప్పిన బోధలవలన మనుజుఁడు పరబ్రహ్మధ్యానముతప్ప మరియేకర్మ—పనిచేయుఁగూడదని చెప్పినటుల దలచవలదు. ప్రతి

ప్రకృతి సంబంధమగు యవివేకమనే యంధకారము నశింపఁజేయును. ఇందు కించుకైన సంశయము వలదు. గీతల 9 అ. 22, 10 అ. 10-11 శ్లోకములు చూడుము.

ఇదిగాక ముక్తినొందిన మహాపురుషసంఘములు దైవజ్ఞానోపదేశమున కర్హులైన జనులకొరకు వెదకుచుఁ బ్రపంచములో సదా సంచరించుచుఁ బూర్వజన్మములందు ఆత్మానాత్మ వివేకజ్ఞానము మిక్కిలి స్వల్పముగానుండు నావంటివానికి స్వప్నములయందును, విశేషజ్ఞానము, సర్వభూతములయందు, సమబుద్ధి, పూర్ణాద్వైత భావనగల బుణ్యపురుషులకుఁ దత్కాలమందు స్థూలరూపముల ధరించి జాగ్రదవస్థయందు బ్రహ్మజ్ఞానోపదేశము చేసెదరని నేను నమ్ముచున్నాను. 15 స్వప్నము చూడుము.

బ్రహ్మజ్ఞానము సద్గురుసేవ సద్గురుబోధవలన గలుగును గాన, బుద్ధిమంతులు సదా సాధుసంగమనఁగా సాధుజనులతో సహవాసము చేయవలయును. „ సత్సంసర్గస్స్వర్గః " నిరాలమ్బోపనిషత్తు. „ సత్సంగత్వే నిస్సంగత్వం । నిస్సంగత్వే నిర్మోహత్వం । నిర్మోహత్వే నిశ్చలతత్వం । నిశ్చలతత్వే జీవన్ముక్తిః" శ్రీశంకరాచార్యులు- గీతల 4 అ. 34-39 శ్లోకములు చూడుము.

నేను మొదట వ్రాయనారంభించిన ఇంగ్లీషు పుస్తకమునకు మలిరోజున బూర్తిచేసి నా యాత్మానుభవమని పేరుపెట్టవలెనని ది 24-1-1925 తేదీని తలచినాను. మలిదిన ముదయము 4 ఘంటలకు నిద్రనుండి లేచునపుడు „ Songs of Eternity " యను మాట, లెవరో చెప్పినట్టుల మనస్సునకుఁ దట్టినవి. „ సదేవసోమ్యేద

మగ్రిఆసీత్ తంనిత్య ముక్తమవిక్రియం। సత్యజ్ఞానాఽనందం పరిపూర్ణం సనాతన మేకమేవాఽద్వితీయంబ్రహ్మ” యని పైంగలోపనిషత్తులోఁ జెప్పినటుల నీస్వప్నోపదేశములన్నియు నిత్యనిర్గుణ నిరుపాధిక నిరంజన నిర్వికల్ప నిరుపమాన సర్వపరిపూర్ణబ్రహ్మను దెలియజేయునవి గాన “సనాతనగీతలు (Songs of Eternity) లేక నా యాత్మానుభవమని” పేరుపెడితిని.

## 27వ స్వప్నము.

రెండుమాసములనుంచి శరీరములో స్వస్థతలేక మంత్రాభ్యాసము సరిగా జరుగుటలేదు. అందువలన గురువీస్వప్నములో “మంత్రాధికారీస్యాత్సగుణః। యస్యనిష్ఠాపరికీర్తితా” యని మంత్రాభ్యాస మహిమను శ్లాఘించుచు నాయశ్రద్ధను గూర్చి మందలించెనని తలంచెదను.

“యస్య”—యెవనియొక్క, “నిష్ఠా”—నిష్ఠలనఁగా నచంచల భక్తి, ధ్యానము యమనియమాదికము, “పరికీర్తితా”—కీర్తించబడునో యనగా దృఢాభ్యాసము కలిగియుండునో (సః) అట్టి మనుజుఁడు, “సగుణః”—శమదమాది షట్కసంపత్తి, సాధనచతుష్టయముతోఁ గూడినవాఁడై, “మంత్రాధికారీ”—మంత్రాభ్యాసము కనగా మహావాక్య విచారణ కధికారి, “స్యాత్”—యగును.

జ్ఞాన యోగాభ్యాసములు రెంటిని సదా నిండు భక్తిశ్రద్ధలతో నభ్యసించుమని, బ్రహ్మపరోక్షజ్ఞాన మచిరకాలములో లభించునని తలంచెదను- గీతల 8 అ. 7-8 శ్లోకములు. తస్మాత్ జ్ఞానంచ యోగంచ ముముక్షుర్దృఢ మభ్యసేత్. యోగశిఖోపనిషత్తు.

విభవ సంవత్సర ఆషాఢశుద్ధ మేకాదశి (28-6-28) రాత్రి 3 ఘంటలకు కారణములేకనే నిద్ర మెళుకువవచ్చి "నైవచింత్యం, నచాచింత్యం, నచింత్యం, చింత్యమేవతత్" యను వాక్యము మనస్సులోఁ దట్టినది. నేనీవాక్యమును అదివరకెందులోను చదివియుండలేదు.

"నైవచింత్యం"—అనగా పరమాత్మను తెలుసుకొనుటకు శక్యమగునా, కాదా యని శంకించఁగూడదు.

"నచాచింత్యం"=పరమాత్మ తెలియనిదికాదు.
"నచింత్యం"=ఇతర పదార్ధజాతమును చింతించఁగూడదు.
"చింత్యమేవతత్"=ఆత్మయొకటియె చింతించఁదగినది.

చింతయనగ ధ్యానము. ఇది సగుణమని, నిర్గుణమని ద్వివిధము. సగుణము సాకారబ్రహ్మధ్యానము. దృశ్యములగు దేహేంద్రియ ప్రాణమనోబుద్ధులు, తత్సంబంధములగు సర్వవృత్తులు వాసనలు నేను (ఆత్మ) కానని నేతి నేతీతి వాక్యములవలన నిషేధించి, శేషించిన దృక్ (తెలుసుకొనేది) నేను (ఆత్మ) యని చింతించుట (నిర్గుణ (స్వస్వరూప) ధ్యానమగును.

మరియు సృష్టిలోనున్న సర్వదృశ్యములు—పదార్థములు నామరూపములు గలిగియున్నవి. వానిలో రూపము నామము కంటె వేరుకాదు. నామోచ్చారణచే రూపము—వస్తుజ్ఞానము కలుగుచున్నది. అందువలన ఆ వస్తువు ఆ నామముకంటె వేరుకాదు. నామమనునది వాక్కును ఆరంభముగాగల వికారముగాని వేరుకాదు. ఎట్లనఁగా. ఘటమనునది వాక్కున కారంభముగాగల నామమాత్రమే.

మృత్తేసత్యము. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీయను చతుర్విధ వాక్కునకు సకల నాదములకు అదియె ఉత్పత్తిస్థానము. గాన సర్వ నామములు ఓంకారమేకాని వేరుకాదు. ఓంకారము బ్రహ్మనిర్దేశ వాచకమైయున్నది. బ్రహ్మము (ఆత్మ) వాచ్యమైయున్నది. వాచక మగు ప్రణవము (ఓం) కున్ను చైతన్య రూప బ్రహ్మ ఆత్మలకు భేదమించుకయులేదు. గాన నామరూపములు దృష్టిగోచరములైనను, కాకపోయినను, అనాత్మ పదార్థములగుటవలన ధ్యానార్హములు (నచింత్యం) కావు. వానికి అధిష్టానమగు ఆత్మయే (చింత్యమేవతత్) ధ్యానించదగినది. ఈ ధ్యానమందంతర్భూతమగు ఓం యనునది సగుణ బ్రహ్మమునకు ప్రతీతమనఁగాఁ బ్రతినిధిగాను, నిర్గుణబ్రహ్మ మునకు ద్వారముగానున్నది. అందువలన ప్రణవము (ఓం) పరాప రబ్రహ్మ స్వరూపమగును. ఇట్టి ప్రణవమును తన కభేదముగ, తైల ధారవలె, నిరంతరము చిత్తమందు నిలుపుట జననమరణములనే సం సారసముద్రమును దాటుటకు నుత్తమమైన ధ్యానము.

మరియు ఓంకారమునకు అకార ఉకార మకారములు అర్ధ మాత్రయనగ ఓంకారధ్వని నాలుగు పాదములు (భాగములు లేక అంశలు) మాత్రలగును. అటులనే బ్రహ్మము—ఆత్మకు జాగ్రత్స్వ ప్నసుషుప్తి, తురీయములను నాలుగు పాదములు (అవస్థలు) ఉన్నవి. అవి సమష్టి వ్యష్టి యని రెండువిధములు. సమష్టియందు విరాట్ (అకారము) హిరణ్యగర్భ (ఉకారము) ఈశ్వరచైతన్యము (మకారము) అనియు, వ్యష్టియందు విశ్వ (అకారము) తైజస (ఉకారము) ప్రాజ్ఞ (మకారము) కూటస్థుడనియుఁ జెప్పఁబడును. గాన ధ్యానపరుఁడు ధ్యానకాలమందు పద్మాసనమున గూర్చొని, లోలుత చిత్తచలన

మునకు కారణములైన ఇంద్రియ వ్యాపారములను అరికట్టి, పిమ్మట అంతఃకరణశుద్ధికొరకు ప్రాణాయామము చేయవలెను. తదుపరి ఇంద్రియములను వాని విషయములనుండి మరలించి అనగా వాని ఉత్పత్తి స్థానముల అధిదైవములతోఁగూడ (నేతినేతీతివాక్యముల ఫరించుచు) లయనుచేయవలెను. తరువాత, అకారవాచ్యుఁడైన విరాట్ నేను యను భావనచే విరాట్‌ను ఆత్మలో నిలిపి, పిమ్మట విరాట్టును ఉకారవాచ్యుఁడైన సమష్టి ఆత్మయగు హిరణ్యగర్భుని యందు, హిరణ్యగర్భుని మకారవాచ్యుఁడై త్రిగుణాత్మికమాయను ఉపాధిగాగల ఈశ్వరునియందు లయముచేయవలెను. తరువాత అర్ధమాత్ర లక్షితమై మూలకారణమగు విశుద్ధబ్రహ్మములో ఈశ్వరుని లయముచేసి, నిర్మలబ్రహ్మభావనలో స్థిరత నొందవలయును.

ఎట్లనఁగా- ఖమధ్యేకురుచాత్మాన మాత్మమధ్యేచ ఖంకురు। సర్వంచ ఖమయంకృత్వాన కించిదపిచిన్తయ। బాహ్యాచిన్తాన కర్తవ్యాతథైవాంతర చిన్తికా। సర్వచిన్తాం పరిత్యజ్య చిన్మాత్ర పరమోభవ." యని శాండిల్యోపనిషత్తులోఁ జెప్పినటుల, (ఆత్మన ఆకాశస్సంభూతః శ్రుతి) ఆత్మవలన గలిగిన ఆకాశమధ్యను ఆత్మను, ఆత్మమధ్య ఆకాశమును వుంచి, సర్వము ఆకాశమయముగాభావించి, బాహ్యాంభ్యంతర చిన్తలేమియులేక చిన్మాత్ర స్వరూపమునొంది, మణ్డలబ్రాహ్మణోపనిషత్తు 4 బ్రాహ్మణములో ఆకాశము పరాకాశము, మహాకాశము సూర్యాకాశము, పరమాకాశములను పంచాకాశములలో, కడపటి పరమాకాశము "అనిర్వచనీయ జ్యోతిస్సర్వవ్యాపకం। నిరతిశయానన్దలక్షణం" అనగాఁ జెప్పనలవిగాని తెజస్సు, సర్వవ్యాపకత్వము, అత్యంతానందలక్షణములుగల పరమా

కాశము తాదాత్మ్యబుద్ధితో స్వస్వరూపమును చిన్తించవలయును. ఇట్లు ధ్యానమొనర్చిన ,, విదిత్వాస్వాత్మనోరూప మసంప్రజ్ఞాసమాధితః" యని వరాహోపనిషత్తు 4 అధ్యాయములోఁ జెప్పిన ,, అసంప్రజ్ఞాసమాధి" యనఁగ నిర్వికల్పసమాధిఁగో స్వస్వరూపము తెలియనగును. ఇదియె మిగుల సంక్షేపముగ వివరింపఁబడిన నిర్గుణబ్రహ్మధ్యానము. మోక్షసాధనము.

గాన పరమాత్మను (,, నైవచింత్యం") తెలుసుకొనుటకు శక్యమగునా—కాదా యను శంకకును, (,, నచాచింత్యం") చింతింపకూడనిదికాదు యను సంశయమునకు హేతువులులేవు. " చింత్యమేవతత్ " వాక్యసారముగ సదా ఆత్మను—స్వస్వరూపమును చిన్తించవలయును. (శ్లోకము) స్వాత్మన్యేవ సదాపశ్యేత్, స్వాత్మన్యేవ సదాస్థితిః, స్వాత్మన్యేవ సదాధ్యానం, స్వాత్మన్యేవ సదాగతిః.







# జపాభ్యాస మంత్రముల తాత్పర్యము.



స్వాప్నోపదేశముల వివరణలు ముగించుటలో నొకసంగతి వ్రాయుచున్నాను. ఏమనఁగా ఈ యుపదేశములలో దైవజ్ఞానాభివృద్ధిని బట్టి జపముచేయుటకు అప్పుడప్పుడుపదేసించిన మంత్రములు.

| ఉపదేశసంఖ్య. | మంత్రములు. | ఉపదేశకాలము. |
|---|---|---|
| 1 | రామ శ్రీ రామరామ. | 1887 |
| 11 | ఓం శ్రీ పరమేశ్వర సుప్రసన్నోభవ. | 1891 |
| 14 | సోహం ఈశః | 1894 |
| 18 | శిః శివః | 1901 |
| 21 | అహం బ్రహ్మాస్మి | 1915 |
| 22 | సంవిత్కారణాయనమః | 1916 |
| 23 | మహాత్మాహం మహాత్మ తత్త్వమహం. | 1922 |
| 7 | | |

ఈమంత్రముల యుపదేశక్రమమునుఁ జూడఁగా అమృతనాదోపనిషత్తులోఁ జెప్పఁబడిన ,,ఓంకారరథమారుహ్యావిష్ణుంకృత్వాథసారథిం । బ్రహ్మలోక పదాన్వేషీ రుద్రారాధన తత్పరః । తావద్రథేనగంతవ్యం యావద్రథపథస్థితః । స్థాతారథపతి స్థానం రథ

ముత్సృజ్యగచ్ఛతి." యను వాక్య క్రమము ననుసరించినటులఁ గను పించుచున్నది.

'బ్రహ్మలోక పదాన్వేషి'—బ్రహ్మను తెలుసుకొనఁ యిచ్ఛ గల ముముక్షువు, 'రుద్రారాధన తత్పరః' ('జ్ఞానం మహేశ్వరా దిచ్ఛేత్' యను వాక్యమును బట్టి రుద్రుఁడనఁగా జ్ఞానముగాన) జ్ఞానసంపాదనకొరకు, 'ఓంకార రథమారుహ్యవిష్ణుం కృత్వాథసా రథిం,' (ఓం యన సమత్వము) సర్వసమత్వబుద్ధి గలిగి ఓం యను మంత్రమును విష్ణువుగా ధ్యానించుచు, 'తావద్రథేనగం తవ్యం యావద్రథపథ స్థితః' ధ్యానములో మనస్సు స్థిరతనొందు వరకు జపించుచుండిన, స్థాతారథపతిస్థానః రథముత్సృజ్యగచ్ఛతి"—మ నస్సు సమాధిలో ఉన్మనినొందినపుడు ఓంకారజపము నిలిచిపోవును.

పైనచెప్పిన మంత్రములలో నీ క్రమము స్పష్టముగఁ గను పించుచున్నది. ఎట్లనఁగా—మొదటిదైన శ్రీరామమంత్రము విష్ణు యొక్క అవతారమనఁగ సాకార సగుణ బ్రహ్మమంత్రమైనను, రామ తాపన్యుపనిషత్తు, తారసారోపనిషత్తులలో రామశబ్దము ఓంకార ప్రతిపాదికమని చెప్పఁబడినది. రెండవదియగు 'ఓం శ్రీపరమేశ్వర సుప్రసన్నో భవ' మంత్రము ఓంకార సహితమై శ్రీ మహావిష్ణు యొక్క సూక్ష్మరూపమైయున్నది. అందువలన నీరెండు మంత్రములు 'ఓంకార రథమారుహ్య విష్ణుం కృత్వాథసారథిం' యను న్యాయ మును బొందినవి. విష్ణుయనఁగా సర్వకరణానిమనసి సంప్రతిష్ఠాప్య ధ్యానం విష్ణుః." యని అథర్వశిఖోపనిషత్తులోఁ జెప్పఁబడినది. అనఁగా ధ్యానములో మనస్సుచు చలింపఁజేయునట్టి సర్వకరణము లనఁగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను, మలినమనస్సు చిత్తము

లను, పూర్వానుభవ సంస్కారములవలనఁ గలిగిన సర్వవాసనలను నిర్మలమనస్సుచేత నిరోధించి, ఆత్మధ్యానము చేయుట 'విష్ణు' యని చెప్పఁబడినది. ఈ ధ్యానము ధ్యాతృ, ధ్యాన, ధ్యేయత్రిపుటి యుక్తమైయున్నది. పూర్ణమనోనిగ్రహము లేకపోయినను, కొంత కాలము ధ్యానము జరిగినఁ బిమ్మట, త్రిపుటిని, ద్వైతమును నిరాకరించునట్టి, ఈశ్వరభక్తి కలుఁగజేయునట్టి 'సోహం ఈశః' యను మూఁడవ మంత్రోపదేశము చేయఁబడినది. ఈశః అనఁగా రుద్ర—జ్ఞానము. "ప్రాణం మనసిసహకరణైస్సంప్రతిష్ఠాప్యధ్యాతారుద్రః" అథర్వశిఖోపనిషత్తు. ప్రాణమనఁగా బ్రహ్మయొక్క జీవభూతమైన ఉత్కృష్టశక్తి. గీ. 7. అ. 5 శ్లో. ఇదియె సాక్షిచైతన్యము. ప్రాణవాయువులై, ప్రతిజీవుని ధరించుచున్నది. చంచల స్వభావముగల ప్రాణవాయువులను, కరణములను (పైఁజెప్పిన జ్ఞానేంద్రియాదులు) మనస్సులో నరికట్టి యనఁగా నిరోధించి ధ్యానముచేయుట 'రుద్ర' (జ్ఞానము) యని చెప్పఁబడినది. 'సోహం ఈశః' అను వాక్యములో సః—తత్—నిర్గుణబ్రహ్మ, 'అహం'—నేను—జీవుఁడు—ప్రత్యగాత్మ, ఈశః—మాయాశబలిత బ్రహ్మము ఒకటేయను భావనతో సుమారు ఆరు సంవత్సరములు ధ్యానము జరిగినఁ బిమ్మట శ్శ్శివః యను మంత్రముపదేశింపఁబడినది. శివః యనఁగా- "ప్రాణం మనసిసహకరణైర్నాదాంతే పరమాత్మనిసంప్రతిష్ఠాప్య ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం సర్వమిదం బ్రహ్మ, విష్ణురుద్రేంద్రాస్తేసంప్రసూయంతే." అథర్వశిఖోపనిషత్తు. మనః చాంచల్యకారణములైనట్టి పైనఁజెప్పిన ప్రాణములను జ్ఞానేంద్రియాది సర్వకరణములను నిర్మలమనస్సుచేత నిరోధించి ఓంకారధ్వనియొక్క నాదాంత

మందనఁగా అసంప్రజ్ఞాత సమాధిలో నిర్మలమనస్సును పరమాత్మ యందుంచి, ఈ పరమాత్మనుండియె బ్రహ్మ, విష్ణు రుద్రమొద లగు సర్వసృష్టి పదార్థములు పుట్టినవని నిండు తాదాత్మ్య బుద్ధితో ధ్యానించుట శివః యని చెప్పఁబడును. "శివఏవ సదాధ్యేయస్సర్వ సంసారమోచకః" శరభోపనిషత్తు. ఈ సందర్భమున 18 దో స్వప్న వివరణచూడుము.

"అహం బ్రహ్మాస్మి" యను అయిదవ మంత్రము జీవచైత న్యము—ప్రత్యగాత్మను, పరమాత్మ—సాక్షిచైతన్యముతో నైక్య ముచేయుచున్నది. ఆరవదైన "సంవిత్కారణాయనమః" మంత్రము సంవిత్—జ్ఞానము—ప్రత్యగాత్మ పరమాత్మలోఁ జేరుట యను సంపూర్ణానందమును బోధించును. "సర్వభూతాంతరస్థాయనిత్య ముక్తచిదాత్మనే" వరాహోపనిషత్తు. "నామరూపవిహీనాత్మ పరసంవిత్సుఖాత్మకః" తేజోబిందూపనిషత్. 4వ అధ్యాయము.

"మహాత్మాహం మహాత్మత్వాహం" యను నేడవ మం త్రము "అహం బ్రహ్మేతినిశ్చిత్య అహం భావం పరిత్యజ" యని తేజోబిందూపనిషత్తులోఁ జెప్పినటుల మనుజుఁడు దాను బ్రహ్మ యని నిశ్చయబుద్ధిగలిగి తన సహితముగ సర్వకర్మలు ధర్మాధర్మ ములు ఆత్మార్పణఁజేసినపుడు 'అహం' భావము నసించి పరమా త్మయగునని బోధించును. అట్టివానికి మరల శరీరమే నేననిగాని, నీవు, నేను, అది, ఇది, యను భేదజ్ఞానముగాని కలుగదు.

మరియు, మొదటిమూడు మంత్రములనగా-1. రామ శ్రీరామ రామ, 2 ఓం శ్రీపరమేశ్వర సుప్రసన్నో భవ, 3. సోహం ఈశః యనునవి

(23వ స్వప్న వివరణలో జెప్పినటుల) బ్రహ్మాండములో అనిలోమమార్గమున పరబ్రహ్మయొక్క 1. స్థూల 2. సూక్ష్మ 3. పరాస్వరూపములనగా, 1. తమోగుణ ప్రధానమై అహంకారముతో గూడిన విరాట్—స్థూలశరీర రక్షణకర్తయగు విష్ణుని, 2. రజోగుణ ప్రధానమై విక్షేపశక్తితో గూడి సృష్టాఽస్పష్ట రూపముగల హిరణ్యగర్భుని, 3. సత్వగుణ ప్రధానమై ఆవరణశక్తితో గూడి జగదంకుర కారణుడైన ఈశ్వరునిఁ దెలియఁజేయును. "స్థూలం సూక్ష్మం పరంచేతి త్రివిధం బ్రహ్మణోవపుః । తంచ బ్రహ్మమయం రూపం స్థూలం వైరాజ ముచ్యతే । హిరణ్యగర్భ సూక్ష్మస్తు నాదబీజత్రయాత్మకం । పరంబ్రహ్మ పరంసత్యం సచ్చిదానంద లక్షణం॥" యోగసిఖోపనిషత్తు.

ఈమూడును సృష్టి—ఉత్పత్తి క్రమములో సగుణ బ్రహ్మ శరీరములై యున్నవి.

"శిః శివః" యను నాల్గవమంత్రము త్రిగుణాత్మిక (యనఁగా సమముగనుండిన సత్వరజస్తమోగుణములు) యగు మూలప్రకృతిలో ప్రతిబింబించిన బ్రహ్మము—సాక్షిచైతన్యము—పురుషోత్తమ.

అటులనే పిండాండములో జీవునకు జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, యనఁగా విశ్వ, తైజస, ప్రాజ్ఞులను మూడు అవస్థలును వీనితో జేరియుండు మల, విక్షేప, ఆవరణములను మూడు దోషములతోఁగూడి క్రమముగ స్థూల, సూక్ష్మ, కారణదేహములను, క్షర, అక్షర, ఉత్తమ యను మూడు పురుషులను గలిగియుండును. ఇట్టి లక్షణములను దోషములను గల జీవుఁడు సోపానన్యాయముగ సతి

క్రియించుటకు మొదటి మూడు మంత్రములును, పైనజెప్పిన సాక్షి చైతన్యమును పొందుటకు "శిఃశివః" యను మంత్రముపదేశింపఁ బడినటులఁ దలఁచెదను.

విశేషించి మొదటి మూడు మంత్రములయొక్క 24 అక్షరములు (7. రామ శ్రీరామ రామ, 13. ఓం శ్రీపరమేశ్వర సుప్రసన్నోభవ, 4. సోహం ఈశః,) గాయత్రీమంత్రాక్షరములవలె 24 తత్వముల (5 మహాభూతములు, 5 ప్రాణములు, 5 కర్మేంద్రియములు, 5 జ్ఞానేంద్రియములు, 4 అంతఃకరణ చతుష్టయమనఁగా మనోబుద్ధి చిత్తహంకారములు) ను, "శిఃశివః" మంత్రముయొక్క మూడక్షరములు—25 జీవః, 26 ఈశః, 27 పరమేశ్వరః, యనఁగా పరబ్రహ్మమును దెలియఁజేయును.

శేషించిన 5,—6—7 సంఖ్యగల 3 మహావాక్యములలో మొదటిదైన "అహం బ్రహ్మాస్మి" యనునది "అహం"—ప్రత్యగాత్మను బ్రహ్మయందుఁ జేర్చుచున్నది. "సంవిత్కారణాయనమః" యనునది ప్రత్యగాత్మ—కూటస్థచైతన్యము—అంశ—సంవిత్ చిన్మాత్రస్వరూపమై పూర్ణానందభావమును బొందునని దెలుపును. ఇటులనీరెండుమహావాక్యములు గీతలు 7 అ. 5వ శ్లోకములోఁ జెప్పబడిన జీవభూతమైన పరాకృతిని సాక్షిచైతన్యములోఁ జేర్చును. అపరాప్రకృతియనఁగా గీతల 7వ అధ్యాయము 4వ శ్లోకములో జెప్పిన జడస్వభావముగు 5 మహాభూతములు మనోబుద్ధి అహంకారములు వాని వికారములతోఁగూడ "నేనే" యనగఁ 'బరబ్రహ్మమే' యని స్పష్టపరచుటకు "మహాత్మాహం మహాత్మతత్మాహం" యను వాక్యము

నుపదేశింపబడెను. మరియు నీమంత్రములు 1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానసా, 4. సత్వాపత్తి, 5. అసంసక్తి, 6. పదార్థభావని, 7. తుర్యగయీసప్త భూమికలనుకూడ తెలుపునని తలచెదను

మలదోషమనఁగా అశుభకార్యములను పలుమారు చేయుట. విక్షేపమనఁగా మనస్సు ఒక విషయములో స్థిరముగ నుండక దఱచు చలించుట. ఆవరణమనఁగా బ్రహ్మమునకు మనస్సునకు మధ్యనున్న తెరయనఁగా జీవాత్మ పరమాత్మలకు సంబంధము కలుగకుండఁ జేయునొక శక్తి.

మరిన్ని, అకార ఉకార మకారములుగూడి ఓంకారమైనదని చెప్పనక్కరలేదు. దానియొక్క అక్షరములు, ధ్వని —— నాదము వేరువేరుగా దెలియఁజేయు గుణములు, రంగులు, భూంతములు, వేదములు, దేవతలు, అగ్నిభేదములు మొదలగు వివరణాలను గూర్చి ముఖ్యముగ అథర్వశిఖోపనిషత్తు, ధ్యానబిందూపనిషత్తు, హంసోపనిషత్తులను జూడుము.

సృష్టిక్రమములో స్థూలసృష్టి కడపటిదిగాన, లయము అనులోమమార్గమున స్థూలపదార్థములనుండి ప్రారంభించును.

అందువలన మొదట నాకు సాకారసగుణ బ్రహ్మోపదేశము శాస్త్రోక్తముగ నున్నది.

———



# సమాప్తి.



ఈ గ్రంథమును ముగించుటలోఁ గొన్ని సంగతులు వ్రాయుచున్నాను. ఏమనఁగా—

ఈ స్వప్నములు రజోద్రేకమువలనఁ గలిఁగియుండునని, యందువలన విశ్వసనీయములు కావని తలఁచవచ్చును, కాని ఉపనిషత్తులకు గీతలకు నెంతమాత్రము తేడా లేకుండునవి బోధించు సర్వసమత్వము, ధారణ, ధ్యాన, సమాధి, జ్ఞానమార్గములను విచారణఁజేసినయడల, రజోగుణోద్రేకమువలనఁ గలిగినవి కావని, మహాపురుషులు—తత్వదర్శినులు స్వప్నావస్థయందు విజ్ఞానమయకోశములోఁ జేసిన పరబ్రహ్మ ప్రతిపాదకమైన మంత్రములు మహావాక్యముల యుపదేశముల నిస్పష్టమగును. ఈ బోధలు కలిగిన నాకట్టి నమ్మకము తోచవచ్చునుగాని, యితరులకెట్లు కలుగునని చెప్పవచ్చును. సత్యమౌను. కాని బ్రహ్మశ్రీ శ్రీమాన్ కొమాండూర్ కృష్ణమాచార్యులుగారు చెప్పినటులఁ బరమరహస్యమగు స్వప్నసత్యతాసిద్ధాంతమును "దైవం మానుషరూపేణ" యను న్యాయమున సర్వజనోపయోగముకొరకు శ్రీ పరమేశ్వర ప్రేరణచేఁ గలిఁగినవని తలఁచెదను.

విశేషించి, యీ యుపదేశముల యభ్యాసమువలనఁ (స్వశ్లాఘనకాదు) గొంత మనస్థైర్యము, నిర్మలత, వైరాగ్యము, సర్వభూత

సమత్వము మొదలగునవి వృద్ధినొందినవి. శరీర సౌఖ్యముఁగలిఁగెనవి. స్వప్నోపదేశ ప్రారంభకాలమందుండిన ద్వైతబుద్ధికూడఁ గ్రమముగఁ దగ్గినది. యత్కించెద ద్వైతబుద్ధి వృద్ధినొందిం, విశ్వము, దానిలోఁ జూడఁబడునట్టి, వినఁబడునట్టి, తలపఁబడునట్టి స్థూలసూక్ష్మ పదార్థములన్నియు "మహాత్మాహం మహాత్మతత్వాహం" యనునుపదేశప్రకారము పరబ్రహ్మ యనఁగ 'నేను' యని కొంత నిశ్చయముగలిగినది. ఇది అంతయు మహాత్ములైన సద్గురువులు స్వప్నములలోఁ జేసిన యుపదేశముల అభ్యాసమువలనఁ గలిగినదని చెప్పుటకు నెంతమాత్రము సంశయములేదు.

జ్ఞానాభ్యాసములోను, ప్రపంచవ్యాపారములలోను యేదిచేయవచ్చును, యేదిచేయఁగూడదను సంశయము సర్వదా మనుజుని గొప్పశత్రువుగ బాధించుచుండును సంశయాత్మకునికిఇహపరలోకసుఖములు గలుగ వని గీతల 4 అ. 40 శ్లో. చెప్పుచున్నది. గాన మనుజుఁడు "ఆత్మబుద్ధిస్సుఖంచైవ, గురుబుద్ధిర్విశేషతః" యను వాక్యము ననుసరించి, తనకు సత్యముగను యుక్తముగను దోచు మార్గమవలంబింపవలయును. అటులఁ జేయనిచో, మైత్రేయోపనిషత్తులో "అసంశయవతాంముక్తిస్సంశయా విష్టచేతసాం। నముక్తిర్జన్మజన్మాంతే। తస్మాద్విశ్వాస మాప్నుయాత్." యని చెప్పినటుల నష్టము సంభవముగును. సంశయము సంభవించినపుడు నివారణకొరకు బ్రహ్మనుప్రార్థించవలెను. "సంశయే సమనుప్రాప్తే బ్రహ్మనిశ్చయమాశ్రయేత్. తేజోబిందూపనిషత్.

అన్నపూర్ణోపనిషత్‌లోను మరికొన్నిటిలోనుఁ జెప్పఁబడిన "సర్వకర్మపరిత్యాగీ" యను వాక్యములనుబట్టిన్ని "యస్త్వాత్మరతి

రేవస్యాదాత్మ తృప్తశ్చమానవః । ఆత్మన్యేవచ సంతుష్టస్తస్య కార్యం నవిద్యతే" యను గీతల 3 అ. 17వ శ్లో. బట్టి జ్ఞానయోగాభ్యాసము చేయదలచిన మనుజుఁడు తన మతము శాఖకు విధింపబడిన నిత్య కర్మను చేయవలయునా? లేదా? యను సంశయము నొందును. కాని అన్నపూర్ణోపనిషత్ లోనే ,, జాగ్రత్యేవ సుషుప్తస్థకురుకర్మాణి వై ద్విజః అంతస్సర్వపరిత్యాగీ బహిఃకురుయథాగతం" యని గీతల 5 అ. 11 శ్లో. ,,కాయేన మనసాబుద్ధ్యా కేవలై రింద్రియైరపి । యోగినః కర్మకుర్వంతి సంగత్యక్త్వాత్మశుద్ధయె." యని, 13 శ్లో. సర్వకర్మాణి మనసాసన్యస్యాస్తే సుఖం వశీనవద్వారే పురే దేహేనైవ కుర్వం నకా రయెన్ యని, జయాపజయములయందు సమబుద్ధి గలిగి కోరికలు విడిచి కర్మవిధిగాఁ జేయుమని, గీతల 2 అ. 47 శ్లో. యజ్ఞదానతపః కర్మలు తప్పకఁ జేయవలెనని 18 అ. 5 శ్లో. చెప్పుచుండుటవలన విధ్యుక్తకర్మను ఫలసంగవర్జితుఁడై చేయవలెను. విశేషించి గీతల 3 అ. కర్మయోగమునే బోధించుచున్నది. నాయనుభవమునుబట్టి, యేకారణముచేతనైన, నిత్యకర్మ చేయుటకు నొకరోజున మానినను స్వల్పముగఁ జేసినను, చిత్తచాంచల్యము, నిద్ర, బద్ధకములధికమై, తిరుగ యథాప్రకారము చేయుటకు 2-3 దినములు చాలా చిక్కు గనుండును. నిత్యకర్మానుష్టానము మానినయెడల ఆ ఋ ఋక్షు లకు అద్వైతాభ్యాసముగూడ జరుగదు. విశేషయదృష్టవంతులగు యోగారూఢులయనుభవము స్థితి ఆ ఋ ఋక్షులమగు మనము తెలియలేము. గాన అద్వైతజ్ఞానాభ్యాసము చేయుచున్నను స్వమ తాచారములను నిత్యకర్మలను తప్పక ననుష్టించవలయును.

తీర్థయాత్రలు—ముఖ్యముగఁ గాశీలో గంగాస్నానముచేసిన వారికి ముక్తికలుగునని శాస్త్రవచనములు, వానివలన లోకవాడు

కయు గలదు. కాశీలో మరణమునొందువారికి ముక్తికలుగుటను గూర్చి రామతాపన్యుపనిషత్ లో వివరింపబడినది. ఏలననగా ? పురాణములలో ముక్తిదాయకములని చెప్పఁబడిన అయోధ్య, మధుర, మాయా, కాశీ, కాంచి, అవంతిక, ద్వారకయను సప్తతీర్థములలో కాశీ మధ్యతీర్థమై యిరుప్రక్కలను అసివారణయను నదులతోఁగూడిన గంగానదియొడ్డున యున్నది. అందువలన శరీరములో సహస్రారము మొదలు మూలాధారమువరకు ఇడాపింగళనాడులమధ్య సుషుమ్నలోనున్న సప్తచక్రములలో మధ్యదియగు అనాహత చక్రమనగా హృదయస్థానమును పోలియున్నది.

మరియు త్రిశిఖబ్రాహ్మణోపనిషత్తులో ,, హృత్పుండరీకమధ్యస్థం చైతన్యం జ్యోతిరవ్యయంయని ,, హృదిచైతన్యేతిష్ఠతి " యని కఠోపనిషత్ లో జెప్పఁబడుటవలన, కాశీ శ్రీ విశ్వేశ్వరస్థానమై యోగాభ్యాసులకు ముఖ్యప్రదేశముగనున్నది. అట్టివారి హృదయములలోనుండు సర్వమలిన స్వభావములను నశింపుచేయునుగాన కాశీకి మహాశ్మశానమని పేరుగల్గి కర్మమార్గమవలంబించినవారికి ముఖ్యయాత్రయైనది. గాని జ్ఞానయోగులకుఁ గాదని నాయభిప్రాయము. ఏలననఁగా ,, ఉత్తమాతత్వచింతైవ । మధ్యమాశాస్త్రచింతనం । అధమా మంత్రచింతాచ । తీర్థభ్రాంత్యధమాధమా " యని మైత్రేయోపనిషత్. ,, తనుంత్యజతు వాతీర్థేశ్వపచస్య గృహేథవా। జ్ఞానసంపత్తిసమయె । ముక్తోసావిగతాశయః. " యని పైంగలోపనిషత్ 4 అధ్యాయము, అన్నపూర్ణోపనిషత్ 5 అధ్యాయము చెప్పుచున్నది.

* పరబ్రహ్మ—నిర్గుణబ్రహ్మ దేశకాలభేదములు లేక, విశ్వ

మంతయు సమముగ వ్యాపించియుండుటచేతను, జ్ఞానులు ప్రత్య గాత్మ పరమాత్మల విచారణచేసి, పిణ్డస్థోపి ప్రత్యగాత్మా సర్వవ్యాపీ భవతి. „ యథాజలేజలంక్షిప్తం । క్షీరంక్షీరేఘృతంఘృతే " య త్రయత్రమనోయాతి । తత్రతత్ర పరంపదం । తత్రతత్ర పరం బ్రహ్మ । సర్వత్ర సమవస్థితమ్. " తదావిద్వాన్బ్రహ్మ జ్ఞానాగ్ని నాకర్మబంధం నిర్దహేత్." యని పైంగలోపనిషత్తులోఁ జెప్పినటుల, జ్ఞాననిష్ఠ నవలంబించినవారు బ్రహ్మతాదాత్మ్యబుద్ధికలవారుగాన, నెక్కడ మరణమునొందినను, నతస్యప్రాణాఉత్క్రామంతే అత్రైవస మవిలీయంతే యను వాక్యప్రకారము ముక్తినొందుదురనఁగాఁ బర మాత్మలో లీనమగుదురు. గాన జ్ఞానులకుఁ బునర్జన్మహేతువగు బాహ్యపూజలు, తీర్థయాత్రలవసరములేదు. అంతకాలమందు నిర్మల మనస్సుతోఁ బరమాత్మను సర్వభావములయందు శరణుపొంది శరీర మును విడచినఁ బరమాత్మను (గీతల 8 అ. 5 శ్లో. 18 అ. 62 శ్లో.) ఇతరదేవతల స్మరించుచు విడిచిన ఆయాదేవతల స్వరూపములనుఁ బొందునని గీతల 8 అ. 6 శ్లోకములోఁ జెప్పఁబడినది.

ఇదిగాక అహంకారయుక్తమై, కామరాగాదులతోఁగూడి, అశాస్త్రమగు ఘోరతపస్సులనుఁ జేయువారు తమ శరీరములయం దున్న ఇంద్రియ సమూహమును తత్కర్మసాక్షియైన నన్ను కృశిం పఁజేయుదురని ఆసురప్రకృతి సంభూతులుగానుందురని శ్రీకృష్ణ స్వామి గీతల 17 అ. 5-6 శ్లోకములలోఁ జెప్పెను. గాన శాస్త్రస మ్మతముగాని కర్మలఁ జేయఁగూడదు.

ప్రపంచములో నన్నిమతములు శాఖలు యొకేదేవుని—పర మాత్మను పూజించును, ధ్యానించుచున్నవి. గీతల 9 అ. 2) శ్లోక

ములో "సమోహం సర్వభూతేషు నమే ద్వేష్యోస్తి నప్రియః" యని, 13 అ. 28 శ్లోకములో "సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం" యని పరబ్రహ్మయగు శ్రీకృష్ణస్వామి చెప్పియున్నారు. భాషనుబట్టి పేరుభేదము గలిగినదిగాని వస్తుతః భేదములేదు. అందువలన దైవదృష్టిలో సర్వజీవులు సమానమేగాని గొప్ప కొద్ది లేదు. వారు నివసించు దేశస్థితులనుఁ బట్టి భుజించు ఆహారపదార్థములను బట్టి యేర్పడిన ఆచారాదిభేదములవలనఁ బరబ్రహ్మ భేదమునుఁ జెప్పుట సాహసముగాని సత్యముకాదు. జనులలో సాంఘిక మర్యాదులు నీతిప్రవర్తనలు దైవభక్తిని వృద్ధిచేయుటకు తద్వారాయన్యోన్యమైత్రి శ్రేయోభివృద్ధి, యొకరి సుఖదుఃఖములు సాంఘిక సుఖదుఃఖములుగ నెంచుకొని, గొప్ప కొద్ది వివక్షతలులేక, సర్వదా సర్వకార్యములయందు నన్యోన్యప్రీతి స్నేహములతోఁ బ్రవర్తించుటకుఁ బరమేశ్వర సదృశులైన మహాపురుషులవలన మతములు, శాఖలు, జాతులు యేర్పరచఁబడినవి. ఇవి అన్నియు పరమేశ్వరునిఁ జేరుటకు సత్యమార్గములుగా నున్నవి. అందరును ఒకే స్థానమును జేరుదురు.

ఇంతేగాక, జనులు యొక స్థలమందుఁ జేరి యొకరి కష్టసుఖముల నితరులతోఁ జెప్పి తగిన యేర్పాటులు చేసుకొనుటకు, దేవుని గూర్చి సంఘప్రార్థనలు చేయుటకు మన పూర్వులు గ్రామములు, పట్టణములు, పల్లెలు యేర్పరచి, ప్రతిగ్రామములోను దేవాలయములు, మసీదులు ప్రార్థన స్థానములు మతసాంప్రదాయములనుబట్టి యేర్పాటు చేసియున్నారు. ఐనను అవిద్యాప్రభావముచేతననఁగా నవిద్యావశులై జనులు పై సంగతులను మరచి, పూర్వకర్మ పరిపాక

ముగఁ బ్రికృతజన్మలోఁ గలిగిన ధనాధిక్యత, విద్యాధిక్యత, అధికారాధిక్యత మొదలగు వానివలన డంబము, దర్పము, గర్వము, క్రోధము, దురభిమానము, పరహింసబుద్ధి, పరపీడనము యిత్యాది ఆసురసంబంధమైన దుష్ప్రవర్తనల నవలింబించి గీతల 16 అధ్యాయములో వివరింపఁబడినటుల, అన్యోన్య కలహములే యానందకరముగ నెంచుకొని, తమమతము జాతి తక్కినవారిమతము జాతికంటె శ్రేష్టమని, తమను తక్కిన యందరు పూజించవలయునని కోర్కెలుగలవారై, అట్టికోర్కెలఁ బడయుటకుఁ బరపీడ, అంతఃకలహములు మొదలగు సాధనములవలన, జనులకు భయకంపాదులఁ గలుగఁజేయుచు స్వర్గతుల్యమైన నీభూలోకమును నరకప్రాయముగఁ జేయుచున్నారు. ఇది మిక్కిలి శోచనీయము. ఈశ్వర సేవకన్న లోక సేవ శ్రేష్టతరమని పెద్దలవలన వినుచున్నారము.

సర్వదేశములలోను గొప్ప మతములు శాఖలుగలవు. కాని భరతఖండములో మన హిందువులవలె నితర దేశములలో నొక మతశాఖవారన్యశాఖల వారిని నిందించుట, దగ్గిరకు రాకూడదనుట, దూషించుట, తిరస్కరించుటఁ గానరాదు. ఈవివాదలవలన జనులలో నైకమత్యము, శాఖాంతర మర్యాదలు చెడిపోయి, కొందరుమతాంతరులై, స్వసంఘబలిమితగ్గి దేశముదుస్థితికి వచ్చినదని, వచ్చుచున్నదనిసర్వజనులకు విశదమైయున్నది. ఇకనైన జనులు—హిందూసోదరులు తమస్థితి, దేశస్థితి, మతశాఖ విశేషములు, దేశముయొక్క పూర్వపు ఔన్నత్యము, ప్రస్తుతపుదుస్థితి దూరదృష్టితోఁ బూర్ణముగ నాలోచించి, మత, జాతివివాదలను, కలహములను విడనాడి సోదరన్యాయమున అన్యోన్యప్రీతి, ప్రేమగలిగియుండఁ గోరెదను.

సర్వజీవులు యొక విరాట్పురుష—బ్రహ్మవలన నుత్పన్న మైనవి. అనఁగాఁ బరమేశ్వరుని లేశములై యున్నవి. "సర్వజ్ఞేశో మాయాలేశ సమన్వితోవ్యష్టి దేహం ప్రవిశ్య। తయామోహితో జీవత్వమగమత్ । శరీరత్రయతాదాత్మ్యాత్కర్తృత్వ భోక్తృత్వతామగమత్" యని పైంగలోపనిషత్తు ప్రథమాధ్యాయము. పాపపూరితములగుఁ గామక్రోధములఁజేత మోహితులై, యొకరినొకరు ద్వేష బుద్ధితో బాధించుటఁ బరమార్థహానికరముగాన సర్వవిధముల విడువవలయును. సకల స్థూలసూక్ష్మకారణ దేహములు, పంచకోశములు, ప్రాణేంద్రియములు, జననమరణములు, సుఖదుఃఖములు, జాగ్రత్స్వప్నసుషుప్తులు, కూటస్థచైతన్యము సమమైయుండ, క్షణభంగురమైన ప్రస్తుత దేహముయొక్క భోగైశ్వర్యాది తారతమ్యములు స్థిరమైనవని నమ్మి, తనకంటె నిపుడు హీనస్థితిలోనున్నవానిని తిరస్కరించుట, బాధించుటకంటె నెక్కుడు దోషము కనుపించదు గాన సర్వజీవులయందు సమదర్శియై "ఆత్మవత్సర్వభూతాని" యను శ్రుతియొక్కయు గీతల 6 అ. 2)_30_31_32 శ్లోకముల తాత్పర్యమును గ్రహించి ప్రతిమనుజుఁడు తన స్వల్పజీవితకాలము శ్రీ పరమేశ్వరునియందు నిండుభక్తితోఁ గడపవలయును. ఇదే జ్ఞానము. ఇదియే ముక్తిసాధనము.

ప్రతి మనుజుఁడు ప్రతి జనసంఘమునకు నొక అవయవము. శరీరములో నొక అవయవమునకు నొప్పి గలిగితే, శరీరమంతకు నెట్లు బాధగానుండునో, అటుల నేసంఘములోనొకనికిఁ గలిగిన బాధ సంఘమంతకు బాధయగును గాన జనులు విద్వేషములుమాని నిండు సౌహార్దముతో సంచరించవలయును. సర్వజీవులయందు నిట్టి ప్రే

మమె "ఆత్మవత్సర్వభూతాని" యను వాక్యసారము ముక్తిసాధనము బ్రహ్మము.

ఓం తత్సత్.

శ్రీవిభవ సం॥ర నిజశ్రావణమాస మనగ 1928 సం॥ర మాగష్టు నెలలో నావయస్సు 83 సం॥ర ప్రారంభమున వ్రాయఁబడినది.



పి. వి. రంగారావుగారి రంగా అండ్ కో., లో ముద్రింపబడియె 1929.